# ఆంధ్రపత్రిక




ANDHRA PATRIKA ILLUSTRATED WEEKL

పంచతంత్రం:

# లబ్ధనాశము

చిత్రరచన, నిర్వహణ: విశ్వాత్ముల నరసింహమూర్తి





ఉండేనొకప్పుడు మహారణ్యమున
కరాళకేసరమను మృగరాజు.
ధూసరకంబను జంబుకమతని
నమ్మిన బంటు



వేటకువెళ్ళిన కరాళకేసర
మొకరోజున మూల్గుతువచ్చింది.









రాజుగారి ఈ సూచన మేరకు
ధూసరకం అటు ఇటు తిరిగి
చివరికి ఒక చెరువు గట్టును
చేరింది! ఆ చెరువు గట్టున
లంబకర్ణమను గాడిద ఒకటి
మేస్తూ వుండెను


















తెలివి తక్కువ
గాడిద నక్కతో -
గంతులు వేస్తూ
పరుగెత్తింది. -
కొద్ది క్షణాలలో
కరాళకేసర -
ముందుకు
చేరారిద్దరు. -

లంబకర్ణమును చూసిన సింహం - ఎగిరి మీద పడబోయింది గురి తప్పుటచే గాడిదకేమీ - దెబ్బ తగుల లేదు. - కాని అపాయమేదో - వచ్చిందని ఆ గాడిద పరుగు తీసింది!



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 47
సంచిక 44
**14-7-54**

జయ ఆషాఢ శుద్ధ చతుర్దశి బుధవారం




జూలై 5-వ తేదీ సోమవారంనాడు రాష్ట్ర గవర్నరు శ్రీ సి. ఎం. త్రివేదీ, ఆంధ్ర హైకోర్టు ప్రథమ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావుగారిచే, ప్రమాణస్వీకారం చేయించారు.




**బుధవారం, జూన్ 30:**

—యూరోపియన్ రక్షణ కూటమిలో చేరి జర్మన్ సైనికాభివృద్ధిని కూటమి అదుపులో ఉంచుకోడమో లేక స్వతంత్ర జర్మన్ సైన్యాభివృద్ధికి తలొగ్గడమో ఏదో ఒకటి ఫ్రాన్సు త్వరలో నిర్ణయం చేసుకోవాలని పారిస్‌లోని అమెరికన్ రాయబారి హెచ్చరిక చేశారు.

—తమ వాషింగ్టన్ సమాలోచనల వల్ల ప్రపంచశాంతి సావకాశాలు హెచ్చయినాయని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ కెనడా రాజధానిలో ప్రకటించారు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: కృష్ణా పిక్చర్స్ వారి "విజయగౌరి"లో లలిత.



—సోవియట్ రష్యా దౌర్జన్య విధానం వల్ల ప్రాచ్యపాశ్చాత్య దేశాలమధ్య శాంతియుతమైన వ్యవహారవిధానం అసాధ్యమని తన అభిప్రాయమైనట్లు అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ ప్రకటించారు.

—గ్వాటిమాలాలో పరిణామాలు సంతృప్తికరంగా ఉన్నవని ఐసెన్‌హోవర్ ప్రకటించారు.

—గ్వాటిమాలాలో ఉభయపక్షాలు యుద్ధం విరమించి సాల్వదార్ అధ్యక్షుని సమక్షంలో రాయబారాలు జరపడానికి నిశ్చయించారు.

—లావోస్, కాంబోడియాల తాటస్థ్యానికి విశ్వరాజ్యసమితి హామీయివ్వాలని సమితికి సూచించనున్నట్లు థాయ్‌లాండ్ విదేశాంగమంత్రి న్యూయార్కులో తెలియచేశారు.

—నెహ్రూ-చౌ సమాలోచనల గురించి ప్రసంగిస్తూ భారతదేశం అవలంబించిన విధానాన్ని ఈజిప్టు సమర్థిస్తున్నదని ఈజిప్టు అధికారి ఒకరు ప్రకటించారు.

—ఈజిప్టు రివల్యూషనరీ కౌన్సిల్ రద్దు పరచబడింది.

—ప్రపంచ బాంక్ ప్రతిపాదనలను తిరస్కరించలేదని, పరిశీలనకింకా వ్యవధి మాత్రమే కోరారనీ, ఇది సాకుగా భారత ప్రభుత్వం పంజాబ్‌నదుల నీటిని బక్రా డామ్ ప్రాజెక్టుకు మళ్ళిస్తున్నదనీ పాకిస్తాన్ రేడియో వ్యాఖ్యానించింది.

—సంపూర్ణ సూర్యగ్రహణం అమెరికా, కెనడా, గ్రీన్‌లాండ్, ఐస్‌లాండ్, నార్వే, స్వీడన్, రష్యా, మధ్య ప్రాచ్యం, పాకిస్తాన్, ఇండియా (రాజస్తాన్) దేశాలలో మొత్తం 9000 మైళ్లు మూడు గంటలలో ప్రయాణం చేసింది.

—భూమిశిస్తులో వాటా ఇచ్చి గ్రామ పంచాయతీలను బలపర్చాలనీ, రాష్ట్రప్రభుత్వానికీ గ్రామపంచాయతీలకూ మధ్య తాలూకా పంచాయతీలవంటివి నిర్మించవలెనని కేంద్ర కాంగ్రెస్ నియమించిన కమిటీ నివేదించినట్లు ఢిల్లీవార్త.

—కేంద్ర ప్లానింగ్ మంత్రి నందాగారు ఆంధ్ర హైదరాబాదు ముఖ్యమంత్రులతో సంప్రదింపులు జరిపి అయిదుగురు సభ్యులతో తుంగభద్ర బోర్డును పునర్నిర్మించాలని నిర్ణయించారు.

—హైదరాబాద్‌లో పత్రికా రచయితల పిల్లలకు సెకండరీ క్లాసులవరకూ ఉచితంగా విద్యాబోధకు ప్రభుత్వం ఏర్పాటుచేసింది.

**గురువారం, జూలై 1:**

—త్వరలోనే ఆగ్నేయాసియారక్షణకు ఒకసంస్థను స్థాపించాలని అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ రాజ్యకూటం నిర్ణయించింది.

—యూరోపియన్ రక్షణ సైన్యం త్వరలో స్థాపించబడనిపక్షంలో జర్మనీకి స్వాతంత్ర్యమివ్వడానికి బ్రిటన్ అమెరికాలు (వాషింగ్టన్ సమాలోచనలలో) నిర్ణయించుకున్నట్లు లండన్ వార్తలు.

—హానోయ్ నగరాన్ని రక్షించుకోడం కోసం ఫ్రెంచి సైన్యాలు దక్షిణడెల్టాలో 1680 చదరపుమైళ్ళమేర విడిచిపెట్టి నగర సరిహద్దులకు చేరుకున్నారు. ఇది వియత్‌నామ్ దేశాన్ని రెండు భాగాలుగా పంచడానికి అనువుగా చేసిననిర్ణయమని జెనీవా వాషింగ్టన్ నగరాలలో కొందరు అనుమానిస్తున్నట్లు వార్తలు వచ్చాయి.

—మొరాకోలో హత్యలు రాజకీయ కల్లోలం తిరిగి ప్రజ్వరిల్లినందువల్ల ఫ్రెంచి ప్రభుత్వం నాలుగువేల అదనపు సైనికులను పంపారు.

—జెరూసలెంలో ఇజ్రాయల్, జోర్డన్ సైన్యాలమధ్య రాత్రివేళ పోరాటం జరిగింది.

—భారతదేశంలో పంజాబ్‌నదీ జలాల విషయంలోగాని, కాశ్మీరువిషయంలోగాని సమాధానం కుదరలేదనీ, ఈలోగానే భారత ప్రభుత్వం సట్లెజ్ నదీజలాలను బక్రా కాలువలకు తరలించడం పూర్వపు ఒప్పందానికి విరుద్ధమనీ పాకిస్తాన్ ప్రధాని మహమ్మద్ అలీ ప్రకటించారు.

—మాహె భారత యూనియన్‌లో చేరిపోవాలని స్థానికసంస్థలన్నీ ఏకగ్రీవంగా తీర్మానించాయి. మేయర్ భారత యూనియన్‌లోకి వచ్చేశారు.

**శుక్రవారం, జూలై 2:**

—వియత్‌నామ్ రెడ్‌రివర్ డెల్టాలో ఫ్రెంచి సైన్యాలు ఖాళీచేసిన నాలుగు ప్రధానమైన నగరాలను వియత్మిన్ సేనలు ఆక్రమించుకున్నాయి. వియత్నామ్ సైనిక దళాలు కొన్ని కమ్యూనిస్టులపక్షం చేరుతున్నట్లు సింగపూర్ వార్తలు.

—అమెరికన్ ప్రభుత్వానికి తెలియకుండా రహస్యంగా ఫ్రెంచిసేనలు వియత్నామ్‌ను కమ్యూనిస్టులకు ఒప్పగిస్తున్నవని

హోటల్ సర్వర్ బిల్లువేయబోతూ:— సార్! మరచిపోయాను, ఇందాక మీకిచ్చింది ఓవల్టినా, కాఫీయా?

ఆసామీ:— ఏమిచ్చావో గాని ఆ ముదం కిరం పు కొడుతోంది.

సర్వర్:— ఓహో, అయితే అది కాఫీలెండి. మా ఓవల్టిన్ నూనెకంపు కొడుతుంది.

అమెరికన్ సెనేటర్ నోలండ్ ఆరోపించాడు.

—చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఐక్యరాజ్యసమితిలో చేరనీయబోరని అమెరికన్ విదేశాంగమంత్రి డల్లెస్ తిరిగీ ప్రకటించాడు.

—థాయ్‌లాండ్ ప్రభుత్వం లావోస్‌తో సరిహద్దుల రాకపోకలను అరికట్టుతూ ఆజ్ఞలిచ్చింది.

—వియత్‌నమ్‌తో రాయబార బాంధవ్యాలు పెట్టుకోడానికి జపాన్ నిర్ణయించింది.

—సింగ్మన్ రీ సూచించిన మంత్రివర్గాన్ని దక్షిణకొరియా శాసనసభ ఆమోదించడానికి నిరాకరించింది.

—ఇతర దేశాలు యూరోపియన్ రక్షణ కార్యక్రమంలో జాప్యంచేస్తున్న కారణం వల్ల జర్మనీస్వాతంత్ర్యమివ్వడంలో ఆలస్యం జరగకూడదని ఛాన్సెలర్ ఎడీనార్ ప్రకటించారు.

—గ్వాటిమాలాను అయిదుగురు సభ్యులు గల సైనికకూటం పరిపాలించడానికి ఉభయపక్షాల మధ్యా ఒప్పందం కుదిరింది.

—అక్టోబరు నెల మధ్యలో అమెరికన్ సైనిక సామగ్రి మొదటి వాయిదా పాకిస్తానుకు అందగలదనీ, వచ్చే మాసంలో 30 మంది అమెరికన్ సైనికోద్యోగులు పాకిస్తాన్ రాగలరనీ కరాచీలోని అమెరికన్ రాయబారి ప్రకటించారు.

—ఫజల్ ఆలీ కమిషన్ హైదరాబాద్ విచారణలో రెండు తెలుగు రాష్ట్రాలను కోరుతున్న కాంగ్రెస్‌వాదులు ఆ రెండు రాష్ట్రాలకూ ఒకే హైకోర్టు, ఒకే సర్వీస్ కమిషన్ ఉండవచ్చునని తమ అభిప్రాయాన్ని తెలిపినట్లు హైదరాబాద్ వార్త. హోం శాఖామంత్రి బిందూగారు ఒకే భాష గల రెండు రాష్ట్రాల నేర్పరచడం పొరపాటనీ, మహావిదర్భ నిర్మాణం శ్రేయస్కరం కాదనీ నివేదించారట. హైదరాబాద్ విభజనకు భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణానికీ వ్యతిరేకంగా ఆర్థికమంత్రి విద్యాలంకార్, ఆరోగ్య మంత్రి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ నివేదించారట.

**శనివారం, జూలై 3:**

—ఇండోచీనాలో పరాజయం అంగీకరించి కమ్యూనిస్టులకు దేశాన్ని అప్పగించబోరని ఫ్రెంచి ప్రధాని ప్రకటించారు.

—ఇండోచీనా యుద్ధంపట్ల ఫ్రెంచి ప్రభుత్వ విధానం తెలుసుకోడానికి అమెరికన్ రాయబారి ఫ్రెంచి ప్రధానిని కలుసుకున్నారు.

—ఇండోచీనాలో ఆర్మిస్టిస్ పర్యవేక్షణకు ఫ్రెంచిప్రతినిధులు ప్రతిపాదించిన రాజీ సూచనలను జనీవా సమావేశం పరిశీలించింది.

—హనోయ్ నగరానికి 30 మైళ్ళలో నున్న ఫూలీనగరాన్ని ఫ్రెంచి సైన్యాలు ఖాళీచేశాయి.

—టర్కీ - పాకిస్తాన్ పొత్తులో చేరడానికి లిబియా నిరాకరించింది.

—భారత యూనియన్‌లో మాహేను చేర్చాలని కోరుతున్న నాయకులు కొందరిని ఫ్రెంచి అధికారులు మాహేనుండి వెళ్ళగొట్టారు.

—విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర ఐక్య కర్ణాటక రాష్ట్రాలను నిర్మించాలని రామానందతీర్థగారు ఫజల్ ఆలీ కమిషన్‌కు నివేదించారు.

—ఆంధ్రరాష్ట్రంలో భూమిశిస్తు సంస్కరణల గురించి పరిశీలించడానికి లక్కరాజు సుబ్బారావుగారు అధ్యక్షులుగా, రొక్కం లక్ష్మీనరసింహదొర, బి. యస్. మూర్తి, పి. హెచ్. రామిరెడ్డి, జి. నాగభూషణం గార్లు సభ్యులుగా డా॥ వి. వి. రాయన్నగారు కార్యదర్శిగా ఒక కమిటీని ఆంధ్రప్రభుత్వం నియమించింది.

**ఆదివారం, జూలై 4:**

—ఇండోచీనాలో కొత్త ఫ్రెంచి ప్రభుత్వవిధానంగురించి ఫ్రెంచి ప్రధాని వివరించారు.

—ఆగ్నేయాసియా రక్షణకోసం అమెరికన్ ప్రయత్నాలపట్ల ఫ్రెంచి పోషలిస్టు

# ★ న్యూస్ రీల్ ★

పార్టీ వ్యతిరేకభావం ప్రకటించింది.

—ఇండో చీనాలో యుద్ధ విరమణకు గాను ఉభయ సైనికాధికారులమధ్యనూ హానోయ్ నగరానికి 25 మైళ్ళ దూరంలో ఒకచోట సమాలోచనలు ప్రారంభమైనాయి.

—పంచవర్ష ప్రణాళికనుగురించి ప్లానింగ్ కమిషన్ సలహాదారు ఇ. పి. మూన్ రేడియోలో ప్రసంగిస్తూ అనుకున్నంతకంటె ఆహారవస్తువులు అధికంగానే ఉత్పత్తి అయినాయనీ, పారిశ్రామికంగా విప్లవాత్మకమైన పరిణామం వస్తున్నదనీ అన్నారు.

—ఆంధ్రదేశంలో ధాన్యపు పంట పెరిగిందనీ, వరి సాగుచేసే భూమి కూడా వృద్ధయిందనీ ఆంధ్రప్రభుత్వం తయారుచేసిన లెక్కలు చూపుతున్నాయి.

—అణుశక్తిని పరిశ్రమలకు వినియోగపరచే కేంద్రం రష్యాలో నెలకొల్పబడిందని మాస్కో ప్రకటన.

—ఆంధ్రరాష్ట్రంలో ప్రతి జిల్లాను గంజేసివొప్పన "నమూనా నీరా కేంద్రాలను" నెలకొల్పడానికి ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది.

సోమవారం, జూలై 5:

—ఆంధ్ర హైకోర్టు గుంటూరులో కోకా సుబ్బారావుగారు ప్రధాన న్యాయమూర్తిగా పి. చంద్రారెడ్డి, కె. ఉమామహేశ్వరంగార్లు ఇతర న్యాయమూర్తులుగా స్థాపించబడింది. భారత న్యాయశాఖామంత్రి డా॥ కట్జూ ప్రారంభోత్సవం జరిపారు.

—పశ్చిమ జర్మనీకి సంపూర్ణస్వాతంత్ర్యం ఇచ్చే విషయమై లండన్‌లో బ్రిటన్ అమెరికాల మధ్య సమాలోచనలు ప్రారంభమైనాయి.

—జర్మన్ ఛాన్సెలర్ హెచ్చరికను గురించి వ్యాఖ్యానిస్తూ యూరోపియన్ రక్షణగురించి రాజీకి ఫ్రాన్స్ ప్రయత్నిస్తుందని ఫ్రెంచి ప్రధాని తెలియచేశారు.

—ఆగ్నేయాసియా రక్షణ పథకం గురించి బ్రిటిష్ అమెరికన్ రాజకీయాధికారులు తిరిగి త్వరలోనే సంప్రదింపులు జరపగలరని వాషింగ్‌టన్ వార్త.

—ఇండో చీనాలో క్షతగాత్రులైన ఖైదీలను ఉభయత్రా మార్పిడికి ఫ్రెంచి వియత్మిన్ సైనికాధికారులు ఒప్పందానికి వచ్చారు.

—శరణార్థుల నివాసానికిచ్చిన ఇళ్లకు పూర్తి హక్కులను వారికిచ్చెయ్యాలని భారతప్రభుత్వం నిర్ణయించింది.

—తూర్పు బెంగాల్లో కమ్యూనిస్టుపార్టీ నిషేధించబడింది.

—రిజిస్టర్ చేయబడిన భారతీయులకు సింహళంలో ప్రత్యేక నియోజకవర్గాల నేర్పాటుచేస్తూ సింహళశాసన సభ ఒక శాసనం ఆమోదించింది.

—కమ్యూనిటీ ప్రాజెక్టులను, జాతీయ వికాస కార్యక్రమాలను నిర్వహించే బాధ్యత ప్రభుత్వ శాఖలు భరించాలని కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వాహకుడు ఎస్. కె. డే గారు ఢిల్లీలో సూచించారు.

—ఆసియా దేశాలమధ్య వ్యాపారాభివృద్ధి ఆర్థికాభివృద్ధి సహకారాలు సాధించడం కోసం దక్షిణ ఆసియా, ఆగ్నేయాసియా దేశాల ప్రతినిధుల సమావేశాన్ని భారతీయ ఉత్పత్తిదారులసంస్థ ఒకటి జరపాలని నిశ్చయించుకొన్నది.

—ముగ్గురు ఆనరరీ మేజస్ట్రేట్లతో మూడు సంచార న్యాయస్థానాలను మద్రాసు నగరంలో స్థాపించాలని మద్రాసుప్రభుత్వం నిర్ణయించింది.

—ప్రత్యేకోద్యోగులను నియమించి బంజరుభూములను పంచడానికి ఆంధ్ర ప్రభుత్వం ఒక కార్యవిధానం నిర్ణయించింది. తుంగభద్రకింద భూముల పంపకానికి వేరే ఒకవిధానం త్వరలో నిర్ణయించగలరు.

—ఆంధ్రదేశంలో ఆయుర్వేద వైద్యానికి ప్రోత్సాహమిచ్చే ఉద్దేశంతో ఆంధ్ర ప్రభుత్వం డా॥ ఆచంట లక్ష్మీపతిగారి అధ్యక్షత క్రింద 12 గురు సభ్యుల కమిటీ నియమించింది.



## ★ కాలక్షేపం ★

దొరలలో ఎక్కువగా ఉంటారు. కాని, అటువంటి ఆంగ్లేయులలోని కొందరు అధికారులకు వరసయ్యగారి మంత్రం నిమిషాల మీద పనిచేసి గుణమిచ్చింది.

అంతేకాదు. సిద్ధిపొందిన మహాయోగులు కొందరు తమవద్దకు వచ్చిన రోగులను నోటిమాటవల్లనే బాగుచేశారు. ఏసుక్రీస్తు జీవిత చరిత్ర యిటువంటి మహాద్భుత విచిత్ర చర్యలతో విస్మయార్చర్య సంభరితంగా ఉంటుంది. గ్రుడ్డివాని కండ్లను ఆయన చేతితో తాకితే కంటికి చూపు వచ్చింది. కుంటివానిని ఆయన చేతితో తాకితే, కాలికి నడక వచ్చింది. కుష్ఠరోగిని ఆయన నోటిమాటతో ఉత్కృష్ట ఆరోగ్యవంతునిగా చేయగలిగినాడు. ఇవన్నీ యోగశాస్త్రమహిమలని మన ప్రాచీన భారతీయ యోగిపుంగవుల చరిత్రలవల్ల మనకు తేటతెల్లమవుతూ ఉంది. ఆవిధంగా ఏసుక్రీస్తు తన దివ్య విభూతులను లోకమునకు చూపించినప్పుడు అది ఆయన మహిమావిశేషమనిన్నీ, ఆయన సాక్షాత్తు దేవుని కుమారుడనిన్నీ 1954 సంవత్సరాల క్రిందట ఆయన వెలసిన పాలస్తీనా దేశంలోని ప్రజలు తండోపతండములుగా ఆయన వెంటబడినారు. ఈనాడు క్రైస్తవ మతప్రపంచం అంతా ఆయనద్వారా తప్ప మరొకని ద్వారా లోకానికి ముక్తిలేదని బోధిస్తోంది. కాని, ఒక దుర్బలుని సందర్భంలో యిటువంటి దివ్యవిభూతిని ఏసుక్రీస్తు తన చుట్టు మన్న జనులమధ్య ప్రదర్శించి, స్వస్థతపొందిన వానితో చిట్టచివరకు "నీ దృఢవిశ్వాసమే నిన్ను దృఢకాయుణ్ని చేసింది" అన్నాడు.

"నీవే తప్ప నితఃపరం బెరుగ"—నీవు తప్ప మరొక దేవుణ్ని నేను ఎరుగను. అని గజేంద్రుడు కూడా చిట్టచివరకు దృఢవిశ్వాసంతో ఒక్క ఆర్తనాదం చేశాడు. ఆ ఘీంకారంతో ఆ గజేంద్రుని అహంకారం అంతా అంతరించింది. "జానామి న త్వాం వినా"-నిన్ను తప్ప ఇంకెవ్వరినీ నేను ఎరుగను అనేమాట త్రికరణశుద్ధిగా అంతరంగం అడుగునుంచి పాతాళగంగ లాగున వచ్చినప్పుడు, ఆ పాతాళగంగ పైకి ఎగజిమ్మినట్లుగా భక్తుణ్ణి సర్వపాప సర్వబాధా విముక్తుణ్ణి చేయగలదని బోధించేది భక్తిమార్గం. "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అనే భావంలోఉన్న ప్రభావం ప్రచండమైనదనిన్నీ, "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అనేది ఒక్కటే భక్తియోగంలో రాజమార్గం అనిన్నీ రామానుజాచార్యులవారు నొక్కి వక్కాణించారు. "అన్యథా శరణం నాస్తి" అంటే "యితర దైవము లెవ్వరూ నాకు లేరు" అనే ప్రమాణం చెయ్యాలన్నారు.

"నేను ఏ యితర భీమాకంపెనీలకూ ఏజంటుగా పని చేయడం లేదు" అనే ప్రమాణంచేసి సంతకంచేస్తేనే తప్ప తాను కోరిన భీమాకంపెనీకి ఏజంటు ఉద్యోగం ఖాయం చెయ్యడానికి వీలులేదు. అటువంటి ఏకేశ్వరోపాసన లేకపోతే భక్తి అనేది కుదరదని అనుభవరీత్యా శాసించినట్లుగా ఉంది. శరణాగతుడు కావాలంటే ఏదో ఒక దేవుని చరణాశ్రితుడు కావాలి. "ఇతర దైవములవలన యిలను సౌఖ్యమా? రామా!" అని త్యాగరాజుగారు శ్రీరామచంద్రమూర్తిని మించిన దేవుడులేడని చెప్పడమే కాకుండా యితర దైవములవల్ల ఏమీ ప్రయోజనములేదనికూడా పబ్లికుగా చాటించారు. ఇతర దైవములు ఆ ఒక్కమొక్కను ఆధారంగా తీసికొని పరువు నష్టం దావా దాఖలుచేస్తే చెల్లుతుంది. ఆ పరువు నష్టం దావా ప్రతివాదియైన త్యాగరాజుగారికి ప్రతికూలమై దావాఖర్చులతో సహా నష్టపరిహారం యిచ్చుకొనవలసి వస్తుంది. ఆయన అప్పుడు ఇతరదైవములను కూడా ఖాతరుచేయవలసివస్తుంది. "రామమూర్తికిన్ రెండవసాటి దైవమిల లేడనుచుగ్గడగట్టి భేరికా దాండడ దాండ దాండ నినదంబు లజాండము నిండ మత్తవేదండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ" అన్నాడు కంచర్ల గోపరాజుగారు. త్యాగరాజుగారి కంటె యింకో మెట్టు పైకెక్కి మత్తవేదండమునెక్కి భేరీ మ్రోగిస్తానన్నాడు. కాని, కొరడా దెబ్బలతో జెయిలులో ఆయన వీపు జయభేరీ లాగున మ్రోగింది. శ్రీరామమూర్తి కంటె మించిన దైవములేడని శ్రుతి మించి ఆలాపనచేసినందుకు బందిఖానాలో భరత నాట్యం చేయవలసి వచ్చింది. ఆ సమయంలో భద్రాచల రామదాసుగారుకూడా భగవంతునిమీద తిరుగబడిన సిపాయిలాగున తయారైనాడు. తానీషాకు చెల్లించవలసిన శిస్తు రొక్కంతో భద్రాద్రి రాములవారికి ఆభరణాలు చేయించాడు. ఈ ఆభరణాలన్నీ ధరించుకొన్నటువంటి ఆ శ్రీ రాముడు హాయిగా గుడిలో కూర్చుండి, తన భక్తుడు బందిఖానాలో కొరడా దెబ్బలు తింటూ ఉంటే, అవంత ఆవంతయినా కల్పించుకొనడం లేదు. శ్రీరాముడు యిటువంటి వాడని గోపన్నగారు ఎన్నడూ అనుకోలేదు. "ఎవడబ్బసొమ్మని కులుకుచు తిరిగెవు? రామచంద్రా!"అని శ్రీ రాముణ్ని చీవాట్లు పెట్టడంలోకి దిగినాడు. ఆయన భక్తిఅంతా అప్పుడే బాగా ప్రజ్వలించింది. భక్త్యావేశ జ్వరం 104 డిగ్రీలు దాటింది. సంధించినది. పిచ్చిమాటలలోకి దిగింది. శ్రీరాముడు ఆ సమయంలో ఆయన ఎదుటకు వచ్చినట్లయితే, జుట్టుపట్టి వంగదీసి నాలుగు గుద్దులు వేసేస్థితిలో బందిఖానాలో చిందులు త్రొక్కుతున్నాడు. జుట్టుపట్టి కొట్టే అట్టి ఆవేశంలోనే ఆయనభక్తిరసం కథ పట్టులోకి వచ్చినది.

భక్తిమార్గం అంటే చాలా రగడతో కూడిన గడబిడవ్యవహారం అని భక్తులు పడిన పాట్లూ పోట్లూ చూస్తే తెలుస్తుంది. హాయిగాఉన్న ప్రాణాన్ని అవస్థల పాలు చేసికొన్నారు. శ్రీరాము డెన్ని అవస్థలపాలైనాడో అంతకంటె ఎక్కువ అవస్థలపాలైనారు ఆయన భక్తులు. భక్తిమార్గం అంటే, హఠయోగనియమంతో హాయిగా భజనచేసి, హారతి యిచ్చి, అరటిపళ్లూ కొబ్బరికాయలూని వేదన చేసి, సదా నిముక్కుగా తిరిగి వడపప్పు పానకంతో సహా కడుపునిండా ఆరగించి, "ఇదిగో! రామనామము మిఠాయి! జనులార కొనుడీ!" అని కమ్మని మాటలతో తియ్యని పాటలు పాడుట తప్ప మరేమియూ లేదని మురియుచుండేవారిది వట్టి భ్రమ యని భద్రాద్రి రాముడు నిద్రలేపి చెప్పినట్లుగా రామదాసుగారికథ సమాధానంగా రూపించాడు. తపస్సుచేసిన మహాయోగులు శరీరాన్ని శుష్కింపజేసి తపింపజేసి, అన్నాహారములు వర్జించి ఆకలిదప్పులకు సీలువేసి, ఆత్మహత్య చేసి

## నారసింహ లేహ్యము




బంగారు చేర్చబడినది. మేహము, నిక్కాక, నిస్సత్తువ, శుక్ల నష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

20 తు॥ డబ్బి రు. 8-4-0 పోస్టేజి 15 అ. వి. పి. ఏ. &కరపెని. "ఆయుర్వేదసమాజం" పెరిదెపి- నెల్లూరు జిల్లా.

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహమచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స. క్యాటలాగు ఉచితము: వలహాకు జి. వి. రెడ్డి & కో. (రిజిష్టర్డు) "భాస్కరాశ్రమము." గోపాలపురం. తూర్పుగోదావరి.

కొన్నంత అఘాయిత్యాలు చేశారు. యజ్ఞయాగాది కర్మకాండలలో మునిగి తేలిన వాళ్లు అనేక వ్రతాలు దీక్షలు అవలంబించి సూర్యోదయం మొదలుకొని సూర్యాస్తమయంవరకూ నియమనిష్ఠలలో నిరతాగ్నిహోత్రులై, అనుదినాధ్యయనంతప్పకుండా 24గంటల కతినకవాతు రీతి చేసిచేసి ఆకర్మకాండలో నలిగి నల్లేరుకాడ అయినారు. ఇక, పరతత్వ పరిశోధన చేయాలని పగలూ రాత్రీ తల పగిలిపోయేటట్లు ఉపనిషత్తులు చదివి, ఊపిరిసలుపని వ్యాఖ్యానాలు అర్థంకాక, మహారణ్యపర్వంలో పడి పిచ్చి ఎత్తిన పచ్చి వేదాంతులు చాలామంది ఆ వేదనపడి అరణ్యరోదనగా అనేక గ్రంథాలు వ్రాశారు. జ్ఞానకోశంలో గ్రంథులు పెరిగినట్లుగా గ్రంథాలు పెరిగినవేగాని మోక్షానికి పంథాలు అవి కావు అని జగద్గురు శంకరాచార్యులవారే శంక లేకుండా జంకు లేకుండా జగత్తు కంతటికి చాటించారు. "నహి నహి రక్షతి డుకృఞ్కరణే" అన్నారు. డుకృఞ్కరణే మొదలైన వ్యాకరణ సూత్రాలు చదివి, అటుపిమ్మట శాస్త్రాలు వికరువు పెట్టి. "తత్వమసి" అంటే ఏమిటో ఆ సూత్రాన్ని కోసి చూసి, "తత్ త్వం అసి" (అది నీవు అయి ఉన్నావు) అనే మాటల మాటలో ఉన్న దేమిటో తెలియక, జ్ఞానమార్గంలో బోల్తాపడి చివరకు అజ్ఞానినని తెలిసికొని, ఈ "అజ్ఞానమే నీవు అయి ఉన్నావు" అని అవగాహన చేసికొనవలసి వస్తుంది. కనుక ఓ మూఢమతే! (ఓ బుద్ధిహీనుడా!) భజగోవిందం! భజగోవిందం! అని శంకరాచార్యులవారు చాలామంది "భజగోవిందాలకు" (అనగా మూఢమతులకు) హితోపదేశం చేశారు.

అటువంటి భజనమార్గం సకలజన సులభ మార్గం అని రామానుజులవారు వాదించారు. భక్తుడు త్రికరణశుద్ధిగా శరణాగతుడైపోతే చాలు తరిస్తాడన్నారు. ఆ భక్తిసముద్రంలో భక్తుడు మునిగిపోవాలన్నారు. మోక్షకాంక్ష గల ముముక్షువు అందులో మునిగి, తల మున్కలు అయ్యేటట్లుగా మునిగి, కడుపునిండా భక్తి జలధిలోని జలం త్రాగిన తర్వాత, కడుపు ఉబ్బితే, దేహియైనవాడు తప్పకుండా తేలుతాడు. హాయిగా కొట్టుకొనిపోయి గట్టుకు చేరుతాడు. అంటే ఏమిటి? దేహం గంగపాలైతే, జీవుడు తరించి గట్టెక్కి గట్టుకు చేరుతాడు. భక్తిమార్గంలో తేలిపోవడం అంటే, అందులో దుమికి "కృష్ణార్పణం" అనాలి.

రాజభక్తి అయినా. పతిభక్తి అయినా, దేశభక్తి అయినా ఆఖరుకు అంతే. రాజు యెడల భక్తి తత్పరుడై ఉంటే ముక్తిలేదని చెప్పలేము. పతియందు భక్తికలిగిఉంటే ముక్తి లేదని చెప్పలేము. కాని, పొట్టకూటికై ప్రాణరక్షణకై రాజును సేవిస్తే, అంతమాత్రమున అది భక్తి కాదు. అది భుక్తికైన సేవాసక్తి. అయితేనేం? కాని అటువంటి వాళ్ళందరూ తమ భక్తులే అని ఉర్వీపతులు గర్విస్తారు. భక్తి అంటే ఏమిటో తెలియని భూభర్తకు, తన చుట్టూ భజన చేసేవాళ్ళందరూ తన భక్తులే యని భ్రమిస్తాడు.

భక్తుణ్ని పరీక్ష చేయగలవాడు ఎవడయ్యా అంటే, పార్వతీదేవి యొక్క భక్తిని పరీక్ష చేసిన శివుడుతప్ప మరెవ్వరూ కారు. అతడే అద్రిజాపతి—మెదడుతో, సామర్థ్యంతో, పాండిత్యంతో, తర్క శాస్త్ర మీమాంసాది తర్జన భర్జనలతో పని లేదు మెదడును తీసి కడగా పెట్టు. కపాల మెందుకు? కావాలి హృదయం. హృదయంలోనే భక్తికి ఉదయం. కపాలం భక్తికి ఆలవాలం కాదు. కపాలమాల ధరించిన కాపాలి, "నీ కించిజ్ఞత్వపు పొడుము బుర్రవంటి పాడు బుర్రను ఉపయోగించ వద్దు—దానిని నాకిచ్చివేసి, నీ హృదయాన్ని భక్తిభరితం చేసికో!" అంటాడు. "కాపాలికలడయ్యా నాపాలికనుచు" భక్తి పరవశుడైనవాని

"శుభ్రకపాల మద్రిజా పతి
కుతుకంబుతోడ దలపై
ధరియించు విభూషణంబుగా"

శివుని గాత్రాభరణంగా భక్తుని కపాలం ఉంటుంది. కాని, ఆ భక్తుని హృదయంలో కపాలమాలియైన సదాశివుడు సదా ఉంటాడు.

"అహం బ్రహ్మ" ("నేనే బ్రహ్మను") అనేటటువంటి అహంకారం ఆత్మ పరిపక్వానికి అంత్యసంస్కారం కాదు. అహం అహరహం దహనం కావాలి. భస్మం కావాలి ఆ భస్మంతో బ్రహ్మకపాలం కూడా సర్వజ్ఞుడైన శివుని చేతికి చేరాలి.

"ఈశ్వరార్పణ కాద -
యీ జన్మ ఫలము?"

ఇదే రామానుజ తత్వసారము. ★

# పలుకుబడి

"కమలా."

"ఏమండి."

"యిటురా కొంచెం - మాటుంది."

"ఏమిటో చెప్పండి- నాకక్కడ తీరటం లేదు."

"అంత తీరనిపని ఏమిటి."

"పొయ్యిదగ్గర బోలెడు పనుంది."

"చేస్తారులే.

"వాళ్లు చేస్తే మీరు తిన్నట్టే."

"ఏం—?"

"అక్కడుండి చెబుతుంటేనే అంతంత మాత్రం."

"అంత తెలియని మనిషిని ఎందు కుంచుకోవడం."

"సరే! అది దొరకటం ఎంత మేలు- ఏమిటో చెప్పండి - పోతాను."

"అంత పుడుకు జాగ్రత్తున్నట్లా? కూర్చో చెబుతాను."

"అక్కడా కూర అధ్వాన్నమైపోతుంది."

"ఏమీ పోదులే...నాకు మహా విచిత్రమేస్తుంది."

"దేనికి."

"మీ వూరిదగ్గర మనకిచ్చిన ఆస్తి ఎంతుందంటావ్."

"ముప్పై వేలకు పైన వుండదూ-"

"యిక్కడా—"

"యిక్కడెంతుందో నాకేం తెలుసు."

"ఎటుబోయినా డబ్భై యెనభై వేల ఆస్తి. రెండూ కలుపుకుంటే లక్షకు పైన- అయినా మనది ఏం జీవితం."

"ఏం మన జీవితానికి - హాయిగా జరిగిపోతూవుంటే."

"మంచి హాయే. అబ్బెబ్బే!"

"మరింకెట్లుండాలని."

"లక్ష రూపాయల ఆస్తికి పైనుంది. అయినా పేరూ ప్రఖ్యాతి లేదు. యిదొక జీవితమా అని"

"ఆస్తి వుండగానే అందరికీ పేరు వస్తుందా?"

"వస్తుందే-వస్తుంది. డబ్బులోనే వుంది అంతా. నలుగురిని కూడబెట్టుకోవాలి. పదిమంది మనం చెప్పినట్టు తలూపేవాళ్ళుండాలి. లైఫ్ అంటే అది. బతికిన కొన్నేళ్ళు క్లాస్‌గా బతకాలి."

"ఇంతమాత్రం చాలులేండి. ఆయనతో ఎందుకు పేచీ."

"యీ ముసలాళ్లతో వచ్చిన యేదుపే యిది. దమ్మిడి ఖర్చు కాకూడదు. యిక పలుకుబడి రమ్మంటే ఎట్లొస్తుంది."

"ఆయనకు డబ్బు ఖర్చు కావటం యిష్టం లేదు. ఏమైనా మన మంచికేగా ఆయన చెప్పడం."

"ఆయనమాత్రం విధవ వ్యాపారాలన్నీ టికి పెట్టి కొంప గుల్ల చేయవచ్చు."

"యిప్పుడేం చేయటంలేదుగా."

"మునుపు చేసినపుడో."

"ఏమో - ఆ విషయం ఆయన్నే అడగండి. నామీద కేకలేస్తే."

"అయితే నేను పలుకుబడి సంపాదించటం - నీకుగూడా యిష్టం లేదన్న మాట."

పరంధామయ్య

"ఏం పలుకుబడో - ఏమో - దానివల్ల ఏమి వొరుగుతుంది."

"ఏ గుడిసెలోనో పడుంటే చాలదూ - యింత మిద్దెందుకు మనకు-తలదాచుకోటానికేగా - నీకసలు క్లాస్‌గా బతకటమంటే ఏమిటో తెలియదు. క్లాస్‌గా ఆలోచించటం అంతకుముందే తెలియదు."

"తెలియకపోయినా అంత యిబ్బంది లేదు లెండి."

"నాకంతా పోగయినందుకు అనుకోవాలి. అక్కడ మీవాళ్లు చూస్తే అట్టా..."

"వాళ్ళేం చేశారండి మధ్యా-"

"నీకు తెలిస్తేగా- వాళ్లెన్ని విధవపనులు చేస్తున్నా - మావాళ్లు మావాళ్లు- అని కలవరిస్తున్నావు."

"వొకవేళ ఎంత యిది అయినా సాకి సంతరించినోళ్లు..."

"నిన్ను సాకి సంతరించబట్టే నాకు భవిష్యత్తు లేకుండా చేశారు."

"యిందుకా నన్ను పిలిచింది."

"ఏదో తెల్లారుస్తావని గాదూ - మీ జీవానికి దమ్మిడీ లేకుండా నానా యాతన పడుతున్నాను."

"మొన్న అంత డబ్బూ..."

"ఎంత డబ్బు! పలుకుబడి అంటే వూరికి వస్తుందనుకున్నావా? మొన్న యీనాటి పాలెం వాళ్ళు కరువుమండి దస్తున్నాం అన్నారు. రెండు పుట్ల వడ్లు కొని పంచితే తలా నాలుగుముంతల వడ్లు రాలేదు."

"ఈవిధంగా వాళ్లని ఎంతకాలమని పోషిస్తారు."

"పోషించలేము. కాని అటువంటి తకువలు చేస్తుంటేగాని పలుకుబడి రాదు. మొన్న భజనోళ్లు వస్తే పాతిక రూపాయలిచ్చి లైటు కొనుక్కోమన్నాను. సాయిబులొచ్చి మసీదు కేమన్నా సాయం చేయమన్నారు. యాభై రూపాయలిచ్చి గోడ గడియారం కొనుక్కోమన్నాను. ఆ దెబ్బతో వాళ్లు మన పేరు వూరంతా మోగించారంటే నమ్ము."

"మీరేమో యిట్లా—అక్కడ వాళ్లను డబ్బడగబోతే - ఎందుకూ - అని అడుగుతారు."

"అడుగుతారా. అయితే వొక్క పని చెయ్యి. వాళ్లతిక్క కుదురుతుంది."

"ఏమిటది?"

"ఇక అక్కడికి పోవద్దు."

"ఎందుకని."

"వాళ్ళ తిక్క కుదర్చటానికి."

"వాళ్ళకేం తిక్కబట్టలేదు."

"అయితే పోబాకు..."

"ఎందుకు పోవద్దంటారు?"

"ఎందుకా. నన్ను వెళ్లగొట్టిందానికి."

"వెళ్ళగొట్టారా - మీరే ఏదో అనుకొని వచ్చేస్తిరే."

"ఏదో అనుకొనికాదు. అవమానంతో వచ్చి - నలుగురిలో తలయెత్తుకోలేక వచ్చేశాను - నామాట వొక్కటన్నా సాగనిచ్చారా వాళ్ళు."

"అయితే మీరెందుకు-అనవసర జోక్యాలకు పోవడం."

"ఆ...వచ్చినట్టు పడివుండమంటావ్ - వూళ్లో కాస్త మంచిపేరు తెచ్చుకొందాం, నలుగురిలో వొకడుగా లెక్కపెడతాం అనుకుంటే - అహా - మీ అమ్మ సాగనిచ్చిందా?"

"పోనీ - యిక్కడన్నా సాగించుకోండి."

"అక్కడ మీఅమ్మ - యిక్కడ యీ ముసలాయన నా ప్రాణానికి బాగా దాప

రించారు. వీళ్లలో ఎవరు గుటుక్కుమన్నా నా ప్రాణానికి తెరపగా వుండేది."

"ఏం మాటలండి అవి. ఎవరన్నా వింటే ఏమనుకొంటారు."

"నే నిట్లా చస్తుంటె బాగుంటుందిగా."

"ఎందుకురా చావడం—" కనకయ్య యింట్లోకి వస్తూ అన్నాడు. మామగారు రావడంచూసి కమల వంటింట్లోకి వెళ్లింది.

"ఏం-లేదు." ముఖం ముడుచుకొన్నాడు పాండురంగయ్య.

"ఏమీ ఎందుకు లేదు. వీధుల్లో అందరికి నీ మాటల్తో పొద్దుబోతుంటె."

"ఎవరికి..."

"యింకెవరుంటారు. నీ చుట్టూ మూగే స్నేహితులు."

"గేలి చేస్తున్నారంటావా."

"కాక—నీముందు నిన్ను స్తుతించేది. తర్వాత నీ మాటలనుకొని నవ్వుకొనేది."

"వెధవలు......"

"వాళ్లు కాదు......మొన్న భజనోళ్ల కెంతిచ్చావు."

"ఎంతో యిచ్చాను."

"భజనోళ్లకు - పురుసోళ్లకు డబ్బిస్తే అందరూ నీచుట్టు తిరుగుతారనుకున్నావా! అసలీ పిచ్చి ఎందుకు పట్టిందిరా నీకు."

"లేకుంటె పేరుప్రతిష్ట లేకుండా బతకమంటావా?"

"యీ కొల్ల బెట్టటమంతా పేరుకోసమన్న మాట—"

"నలుగురు సన్నగాళ్ళను రాబట్టుకోవాలంటె కర్చుగాకుండా అవుతుందా?"

"ఓరి నీపిచ్చి దొంగలు తోల. సన్నగాళ్లు...ఎందరిని రాబట్టుకొంటావ్ నీవు. అట్లనుకొనే ఎస్టేట్లంటివి నాశమైపోయినయ్. అయినా మునుపటి కాలమా యిది. ఎవడి కేమిచ్చినా వాడికి టోపియేసి తెచ్చామనుకొనేవాళ్ళు గాని నీకింద పడుంటారనుకున్నావా?"

"బాగా నే పడివుంటారు."

"అందుక నేనా ఎలెక్షనులో నిలబడితే వన్నారు."

"ఆ......"

"ఎవరో బాగా ఎక్కిచ్చినట్టుంది."

"ఎక్కించే దేముంది. అందరూ నన్నే నమంటున్నారు."

'నిలవమంటారులే. ఎందుకు నిలవ ను. తరవాత వెక్కిరించొద్దూ."

'అంతపని గాదులే నాన్నా. మనకే ) హోఫ్‌గా వుంది"

"ఇది మేజర్ పంచాయితిరా - చెప్ప ేకి లేదు."

ంగుకని."

"సీక్రెటు బ్యాలెటుకదూ."

"అదే మనకున్న ఛాన్స."

"మనకుకాదు - వోటర్సుకి."

"ఎట్లా."

"మన కెవరు వోటువేయనిది తెలదుగా."

"ఆ బ్రహ్మయ్యకు ఎవరు వేస్తారులే నాన్నా - నీకు లేనిపోని అనుమానాలు."

"నీకే తెలుస్తుందిగా."

"వొకసారి తెలుసుకోటంగూడా అవసరమే."

"వొకసారి తెలిసింతర్వాత పోతే - లేనిపోని పంతాలు యీర్ష్యలు పుట్టుకొనివస్తయ్."

"ఏమీ రావులే నాన్నా!"

"ఎంత మొండిపట్టుదలరా నీది. సరే నీ యిష్టం వచ్చినట్టు పూరేగుదుగాని - అమ్మాయిని రేపు దశమినాడట - పంపు."

"పంపను."

"ఏందిరా ప్రతిదానికి ఎడ్డెం అంటె తెడ్డెం అంటావు."

"మనకు వాళ్ళతో ఏలాంటి సంబంధం వుండకూడదు."

"యాభైవేల ఆస్తి వొదులుకుంటావా."

"రాసిచ్చినమటుకు ఎటూ వొస్తుంది."

"అదిమాత్రం ఎందుకు."

"వాళ్ళమ్మాయిని చేసుకున్నందుకు."

"నీకు యిష్టంలేకపోతే నీవు పోబాకు - అంతేగాని ఆమెను పోవద్దని చెప్పటం సబబుగాదు."

"నీకు తెలవదులే నాన్నా! కమలపోతుంటే గాని వాళ్ళకు లోకంసంగతి తెలియదు."

"వాళ్లమీద యీర్ష్యతో పాపం! ఆ అమ్మాయిని ఏడిపిస్తావా - "

"ఎందు కేడవటం అదే చెప్పేశాను. ఎక్కడ యిష్ట ముంటుందో - అక్కడే శాశ్వతంగా వుండిపొమ్మని - "

"యిప్పుడంత తెగ్గొట్టుకొ వాలశినంతప నే

రించారు. వీళ్లలో ఎవరు గుటుక్కుమన్నా నా ప్రాణానికి తెరపగా వుండేది."

"ఏం మాటలండి అవి. ఎవరన్నా వింటే ఏమనుకొంటారు."

"నే నిట్లా చస్తుంటె బాగుంటుందిగా."

"ఎందుకురా చావడం—" కనకయ్య యింట్లోకి వస్తూ అన్నాడు. మామగారు రావడంచూసి కమల వంటింట్లోకి వెళ్లింది.

"ఏం-లేదు." ముఖం ముడ్చుకొన్నాడు పాండురంగయ్య.

"ఏమీ ఎందుకులేదు. వీధుల్లో అందరికి నీ మాటల్తో పొద్దుబోతుంటె."

"ఎవరికి..."

"యింకెవరుంటారు. నీ చుట్టూ మూగే స్నేహితులు."

"గేలి చేస్తున్నారంటావా."

"కాక—నీముందు నిన్ను స్తుతించేది. తర్వాత నీ మాటలనుకొని నవ్వుకొనేది."

"వెధవలు......"

"వాళ్లు కాదు......మొన్న భజనోళ్ల కెంతిచ్చావు."

"ఎంతో యిచ్చాను."

"భజనోళ్లకు - వురుసోళ్లకు డబ్బిస్తే అందరూ నీచుట్టు తిరుగుతారనుకున్నావా! అసలీ పిచ్చి ఎందుకు పట్టిందిరా నీకు."

"లేకుంటె పేరుప్రతిష్ఠ లేకుండా బతకమంటావా?"

"యీ కొల్లబెట్టటమంతా పేరుకోసమన్నమాట—"

"నలుగురు సన్నగాళ్ళను రాబట్టుకోవాలంటె కర్చుగాకుండా అవుతుందా?"

"ఓరి నీపిచ్చి దొంగలు తోల. సన్నగాళ్లు...ఎందరిని రాబట్టుకొంటావ్ నీవు. అట్లనుకొనే ఎస్టేటంటిపి నాశమైపోయినయ్. అయినా మునుపటికొలమా యిది. ఎవడికేమిచ్చినా వాడికి పోపియేసి తేచ్చామనుకొనేవాళ్ళు గాని నీకింద పడుంటారనుకున్నావా?"

"బాగానే పడివుంటారు."

"అందుకనేనా ఎలెక్షనులో నిలబడితే వన్నారు."

"ఆ......"

"ఎవరో బాగా ఎక్కిచ్చినట్టుంది."

"ఎక్కించేదేముంది. అందుకు నన్నే నమంటున్నారు."

'నిలవమంటారులే. ఎందుకు నిలవ ు. తరవాత వెక్కిరించొద్దూ."

'అంతపని గాదులే నాన్నా. మనకే ) హాఫ్‌గా వుంది"

"ఇది మేజర్ పంచాయితిరా - చెప్పకి లేదు."

ంగుకని."

"సీక్రెటు బ్యాలెటుకదూ."

"అదే మనకున్న ఛాన్స్."

"మనకుకాదు - వోటర్సుకి."

"ఎట్లా."

"మన కెవరు వోటువేయనిది తెలవదుగా."

"ఆ బ్రహ్మయ్యకు ఎవరు వేస్తారులే నాన్నా - నీకు లేనిపోని అనుమానాలు."

"నీకే తెలుస్తుందిగా."

"వొకసారి తెలుసుకోటంగూడా అవసరమే."

"వొకసారి తెలిసింతర్వాత పోడే - లేనిపోని పంతాలు యీర్ష్యలు పుట్టుకొనివస్తయ్."

"ఏమీ రావులే నాన్నా!"

"ఎంత మొండిపట్టుదలరా నీది. సరే నీ యిష్టం వచ్చినట్టు పూరేగుదుగాని - అమ్మాయిని రేపు దశమినాడట - పంపు."

"పంపను."

"ఏందిరా ప్రతిదానికి ఎడ్డేం అంటె తెడ్డేం అంటావు."

"మనకు వాళ్ళతో ఏలాంటి సంబంధం వుండకూడదు."

"యాభైవేల ఆస్తి వొదులుకుంటావా."

"రానిచ్చినమాటుకు ఎటూ వొస్తుంది."

"అదిమాత్రం ఎందుకు."

"వాళ్ళమ్మాయిని చేసుకున్నందుకు."

"నీకు యిష్టంలేకపోతే నీవు పోబాకు - అంతేగాని ఆమెను పోవద్దని చెప్పటం సబబుగాదు."

"నీకు తెలవదులే నాన్నా! కమలపోతుంటే గాని వాళ్ళకు లోకంసంగతి తెలియదు."

"వాళ్లమీద యీర్ష్యతో పాపం! ఆ అమ్మాయిని ఏడిపిస్తావా - "

"ఎందు కేడవటం అదే చెప్పేకాను. ఎక్కడ యిష్ట ముంటుందో - అక్కడనే శాశ్వతంగా వుండిపొమ్మని - "

"యిప్పుడంత తెగ్గొట్టుకోవాలశినంతపనే

# ★ పలుకుబడి ★

న్నుంది. పోయి తెందుకో జాలండి రారాదూ -"

"పోవటానికేలేదు. వాళ్లు నా యింటికి రాకూడదు."

"చదువుకొన్నందుకు మంచితెలివే -"

"ప్రతిదానికి యింతే - నేనంటే ఎవరికీ లెఖ్ఖ లేకుండా జేశారు -"

"ఎవరుజేశారు. నీ తెలివితేటలు తెలుసు గాబట్టే - అక్కడయితే కుదురుగా వుంటావని పంపాను. ఏడాదిపాటన్నా వుండకుండా తెల్లార్చుకొని వచ్చావు."

"తిండికోసం పడుండమంటావ్. అభిమానం లేకుండా -"

"సరేపోరా - నీకు తెలియదు, చెప్తే తెలుసుకోవు." కనకయ్య కొడుకువైపు కోపంగా జూసి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. పాండురంగయ్య సిగరెటు ముట్టించి గట్టిగా పీల్చి పొగ వదలసాగాడు.

"మామేడి——" కమల వాకిట్లోకి వచ్చి అడిగింది.

"ఏమో——" సిగరెటు పీలుస్తూ విసుగ్గా అన్నాడు.

"భోజనానికి లేవరూ."

"అందరూ ఏడ్చేవాళే."

"ఎవరూ ఏడవటంలేదు లేవండి."

"ఏడవకపోతే యీ రాద్ధాంతమంతా ఎందుకు."

"ఏదో వుండబట్టలేక అంటే."

"ఇప్పుడేమంత మునుచుకుపోయింది, వుండబట్టలేక పోవటానికి——"

"ఏమీ లేదు రారండి - పన్నెండయిపోయింది."

"రేపు మీవాళ్లు పిలవొస్తే నీవు పోవద్దు."

"మీరు వద్దంటె ఎందుకు పోతాను."

"అంతేగాని నీకుమాత్రం పోవాలనే."

"అంత పట్టుదలగలవాళ్లు మొన్నెందుకు పంపారు."

"మన పనివుంటె పోయిరమ్మన్నాను.



"అటువంటి పనే శక్తే మళ్ళీ పంపించరూ—"

"ఏమోలే మిగత డబ్బు ఎప్పుడిస్తారంట మీవాళ్లు."

"వడ్లు అమ్మితే పంపుతామన్నారు."

"వాళ్ల మొహం - యింకా ఎప్పుడంట అమ్మేది. ధర తగ్గిపోతుంటే."

"అయినా ఆ డబ్బు మీకు రాదు. నాకు కొంచెం అవసరముంది."

"నీ అవసరాలకేంలే. పదిహేను జతల గాజులు, పదహారు రకాల చీరలు వున్నయ్. యింకా—"

"గుడ్డలు కొనుక్కోవాలి."

"మొన్న అయిదువందలూ పెట్టి—"

"కొత్తరకాలు వచ్చాయట..."

"ఆ రకాలు ఎప్పుడూ వుంటయిలే. యిప్పుడు డబ్బుకోసం నానాయాతన పడుతుంటె."

"అయితే నన్ను పోవద్దంటిరి."

"పోగానే వాళ్లు డబ్బిస్తారా అని."

"అంతలో వుంది మీ కాల్లి" కమల నవ్వుతూ అంది.

"సరే పద. యీ ముసలాయనే గనక లేకుంటే నా కాల్లి విషయం నీకు బాగా తెలిసేది."

"అయితే పంపిస్తారుగదూ"

"డబ్బు తెచ్చేట్టయితేనే" అంటూ పాండురంగయ్య లేచాడు.

పాండురంగయ్య తండ్రి మాట వినకుండా పంచాయితీబోర్డు ఎలెక్షనులో పోటీ వేశాడు. ప్రచారం జోరుగా సాగుతూంది. పోలింగు రోజు దగ్గరపడినకొలది ఇరు పక్షాలవారికి ఆవేశాలు ఎక్కువైనయ్. వొకరిని మించి వొకరు గ్రామస్థులకు లెక్కలేనన్ని వాగ్దానాలు చేయసాగారు.

ఒకనాటి వుదయం పాండురంగయ్య తన గదిలో కూర్చొని వోటర్ల లీస్టు పరిశీలిస్తూ వుండగా అతని తండ్రి కనకయ్యవచ్చి దగ్గర కూర్చున్నాడు.

"ఏం నాన్నా!"

"బ్రహ్మయ్యకు ఏం జెప్పి పంపావు."

"వుపయోగం లేదని చెప్పిపంపాను."

"ఏదో పెద్దవాడు. తానుగా రాజీపడతానంటూవుంటె."

"ఏంరాజీ అది. యిద్దరం విత్డ్రా చేసుకొని - యిద్దరికీ నచ్చిన ఎవణ్ణో పోటీ లేకుండా ఎన్నికొనేట్టు చేయాలట."

"యీ లేనిపోని రచ్చకంటె అది మేలు కదరా"

"ఎవణ్ణో ఎన్నికొనేందుకు యీ శ్రమంతా ఎందుకు."

"నీకు తెలవదు పాండూ! నామాట విని రాజీపడు"

"మనకే హోప్‌గా వున్నప్పుడు రాజీ ఎందుకుపడాలి."

"రాజీపడకుంటె కొన్ని యిబ్బందులున్నయ్ - బ్రహ్మయ్య సామాన్యుడు కాడు."

"ఏంజేస్తాడు."

"ఏమైనా జేస్తాడు. మనం యింకా కొంత లోకులకు బాకీవున్నాము. అటువంటప్పుడు లేనిపోని ద్వేషాలు కలగటం బాగు లేదు."

"యివ్వాలకి వుంటె - యివ్వొచ్చులే - దానికేం."

"నీకు తెలియదురా - అబ్బాయ్!"

"ఏమైనాకాని రాజీ చేసుకోను -"

"సరే........" కనకయ్య వొక దీర్ఘ నిట్టూర్పు విడిచి లేచాడు.

"దావాలు వేస్తామని నోటీసులిచ్చే ప్రయత్నంలో వున్నారట. నా జీవితంలో...... యిటువంటిపరిస్థితి వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు -" అంటూ భారంగా నడచిపోయ్యాడు కనకయ్య. అతడు కొడుకుతో యీమాట వుత్త అనుమానంతో అనలేదు. మరునాడు అయిదారు లాయరు నోటీసులను పోస్టుబంట్రోతు కనకయ్యయింటికి తెచ్చాడు. పాండురంగయ్య వీటికి ఏమాత్రం చలించలేదు. యథాప్రకారం ఎలెక్షన్ కార్యకలాపాల్లో మునిగిపోయాడు.

పోలింగు ప్రశాంతంగా జరిగిపోయింది. కనకయ్య ఆనాడు యిల్లువదలి బయటకు రాలేదు. మరునాడు వోట్లులెఖ్ఖ పెట్టేదినం. తాలూకాఫీసు వరండా అంతా జనంతో కిటకిటలాడిపోతోంది. అభ్యర్థులంతా అక్కడే వున్నారు. పాండురంగయ్య పది వోట్లు మెజారిటీతో గెల్చాడు. పాండురంగయ్యకు జై అనే నిదాలతో ఆఫీసు ఆవరణంతా దద్దరిల్లిపోయింది. బ్రహ్మయ్య తలవాల్చుకొని జట్కాలో ఎక్కి వెళ్ళిపోయాడు. పాండురంగయ్య అనుచరులు పాండురంగయ్య వూరేగింపుకు ఘనమైన ఏర్పాట్లు చేశారు. అవుట్లు వేసి - మందు కాల్చారు. పాండురంగయ్య పూలమాలలు వేసుకొని కారులో వూరంతా వూరేగాడు. వూరేగింపు తర్వాత డిన్నరు. కొత్త ప్రెసిడెంటుగారి ఆతిథ్యం స్వీకరించినవారంతా రాత్రి చాలా ప్రొద్దుపోయాక యిళ్లకు పోయారు. పాండురంగయ్య మహోత్సాహంతో మిద్దె మెట్లెక్కి పడకగది చేరాడు.

"పొద్దుటినుండి మామ కనబడలేదండి-" కమల అతని వెంటనేవచ్చి ఆందోళనగా అన్నది.

"ఎటు పొయ్యాడు."

"ఏమోనండి - మధ్యాహ్నం మీతో చెప్పాలంటే మీరు కనబడలేదు."

"ఏమిటా భయం - చిన్నపిల్లవాడు గన కనా - తప్పిపోయాడనుకోడానికి."

"నిన్న మొన్న ఆయన వొక మాదిరిగా వుండినాడండి."

"ఎలెక్షనులో ఏమౌతుందో ఏమో అనిలే ఆయన భయం...అయినా ఎవరికి తెలియ కుండా-" అంటూ మెట్లు దిగి క్రిందికి వచ్చాడు. అతని వెంటనే కమలకూడా దిగి వచ్చింది.

"ఒరే నాగా—"

"ఏమండి."

"నాయన కనపడలేదే. ఎక్కడికెళ్లాడు"

"ఏమోనండి. వేకువఝామున లేచిపో తుంటె చూశాను. మళ్ళీ కనబడలేదు"

"ఆ-సరే. వెళ్ళి పండుకో—" అంటూ పాండురంగయ్య తండ్రి గదివద్దకు పోయి తలుపులు తోశాడు. చీకటిగా వుంది. టార్చి వేసి చూశాడు. మంచంపై పరుపు చుట్టి వేశివుంది. పరుపుచుట్టమీద కవరు కనబ డింది. పాండురంగయ్య కవరు తీసుకొని—

"ఒరే నాగా—"

"అయ్యా—"

"యీ పరుపు చుట్టిందెవరు?"

"నేను చుట్టానండి."

"యీ కవరు."

"పరుపుమీదుంటె తీసి పక్క చుట్టి దానిపై నేశానండి."

"రాత్రి నాయన మేలుకొనివున్నాడా."

"సగం పొద్దుకాడ దీపం వెలుగుతూ వుండిందండి."

"సరే లాంతరీటు తీసుకరా."

నాగడు లాంతరు తెచ్చాడు. కవరు చించి చదివాడు.

"పాండూ - నేను వెళ్ళిపోతున్నాను. నామాట నీవు వినలేదు. తెలుసుకుంటా వనుకున్నాను. కాని నీ ధోరణి నీదే. బోలెడు అప్పులు. నేను సర్దుకుంటూ వచ్చాను. నీవు చేసిన పనివల్ల బ్రహ్మయ్య అందరిచేతా దావా వేయించాడు. యింత డబ్బు వొక్కసారి ఎక్కడనుండి తెచ్చి కట్టేది? జప్తులు. వేలాలు. ఆ అవమానం భరించలేక వెళ్ళిపోతున్నాను - ఇట్లు... కనకయ్య.

జాబు చదివి పాండురంగయ్య తెల్ల బోయ్యాడు.

"మామ రాశాడాండి - " కమల ఆందో ళనగా అన్నది.

"రాశాడు" అంటూ పాండురంగయ్య ఆ మంచంమీద చదికిలబడి రెండు చేతుల తోను తల పట్టుకొన్నాడు. ★



## సీరియల్

## "శారద"

## 35

బందరు బండి పదిన్నర పదకొండింటికి బందరు చేరుకుంది. పద్మ గుడివాడలో ఉదయం ఎనిమిదిన్నరకి బండెక్కింది. బండి దిగేసరికి ఆకలితో కళ్ళు తిరుగుతున్నాయి. ఉదయం గుడివాడ స్టేషన్‌లో కాఫీ తాగింది, అంతే. బందరులో రైలు దిగి ఆమె కొంగు చూసుకున్నది. అందులో పదిరూపాయలకు పావలా తక్కువ అట్టే పెట్టింది. ఇప్పుడు చూస్తే, అసలా మూట కనపడదు! ఆమె గుండెలు జల్లుమన్నయ్. కళ్లంబడి నీళ్లు వచ్చేశాయి. మనుషు లెవరూ తోడులేని తనకు ఈ పరాయివూళ్లో, డబ్బే ఒక్కగానొక్క ఆప్తమిత్రంగా నమ్మి వచ్చింది. ఇప్పుడదీ రెక్కలు వచ్చి ఎగిరిపోయింది. ఆమె మెల్లిగా ప్లాట్‌ఫారం దాటి పాసెంజర్ షెడ్డులో కొచ్చింది. ఆలోచనలు స్తంభించిపోయినాయి. విభ్రాంతితో అక్కడ అలా నిలబడిపోయింది, ఎటూ పోవడానికి తోచలేదు. రైలు దిగినవారందరూ ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. తిరిగి బెజవాడ వెళ్లే వాళ్లతో రైలు నిండుతోంది. స్టేషన్‌లో హడావుడి తగ్గలేదు. అదృష్టవంతులు టీస్టాల్‌లో టీ తాగుతున్నారు. పద్మ కటకటాలదగ్గిర నిలబడి అక్కరకురాని ఆలోచన్లు చేస్తున్నది. ఏ దేవుడైనా ప్రత్యక్షమై కాఫీయేనా ఇప్పించగూడదా? తన పోయిన డబ్బు దొరికేట్టు చెయ్యగూడదా? తనకీ కష్టాలనించి ముక్తి కలిగించగూడదా? కాని ఏ దేవుడూ పలకడు. సినిమాల్లో పిలవకముందే హాజరయ్యే ముక్కోటి దేవతల్లో ఒక్క దేవతా ప్రత్యక్షం కాలేదు. దేవతలు రాకపోతే పీడా పోయిరి, ఎన్ని వందల మంది అటునుంచి వెళ్లారు; ఏ ఒక్కరైనా, ఆమె నడిగారా! "ఏమిటమ్మా" అని?

కాని కొందరు ఆపద్బాంధవుల్లా ప్రత్యక్షమౌతూ ఉంటారు. వాళ్ళ దయా దాక్షిణ్యాలు ఇంతింతని చెప్పటానికి వీల్లేదు. ఈ వర్గులో చేరినవాడు వీరయ్య. వీరయ్య వెనకటికి బందరులో రౌడీ-ఒక సబిన్స్పెక్టర్ తన్ని వొదిలించేదాకా. ఇప్పుడు వీరయ్య రౌడీ చేష్టలు చెయ్యకపోయినా, ఇంగువకట్టిన గుడ్డల్లే రౌడీ వేషంలోనే వుండి, భయస్థుల్ని బెదిరిస్తూవుంటాడు. అతనికి కొద్ది రాబడివున్నది. దాంతో కాలక్షేపం చేస్తూ నిరాశ్రయులు నిరాధారులైన స్త్రీలను ఉద్ధరిస్తానని బయల్దేరుతూ వుంటాడు. పొడుగాటి విగ్రహమూ, దట్టమైన మీసాలూ, కొంచెం అందమైన మొహమూ అమాయికలను మోసగించడానికి చక్కగా తోడ్పడతాయి. పెద్దాపురం సిల్కు పొడుగు చేతుల చొక్కా తొడిగి మల్లుపంచె సైకిల్ కట్టు కట్టుకుని, ఎర్ర సిల్కు రుమాలు మెడచుట్టూ వొయ్యారంగా కట్టుకుని, చార్‌మినార్ సిగరెట్టు చూపుడువేలుకి పెద్దవేలుకీ మధ్య ఇరికించి బొటనవేలు మీదుగా పొగ పీలుస్తూ వొదులుతూ, తిరుగుతాడు. వీరయ్య ఆడవాళ్లపట్ల కీచకుడు.

ఆ వేళగూడా అతను భోజనం చేసి కౌరాఖిళ్ళీ బుగ్గన బిగించి స్టేషన్‌కి వచ్చాడు. అతని దృష్టిలో పేసెంజర్ షెడ్డులోని మనుషులూ గిరగిర తిరిగారు. కటకటాల కొనుకుని నుల్చున్న పద్మ కనిపించింది. వీరయ్య అటూ ఇటూ పాసెంజర్ షెడ్‌లో రెండుసార్లు నిదానంగా పచారు చేసి, మెల్లిగా పద్మ పక్కకువచ్చి, ఆమెకి గజం దూరంలో పక్కవాటున, కటకటాల కొనుకుని నుంచుని, సిగరెట్ దమ్ములాగి వదిలాడు. పద్మ వోరగా,—ఎవ రీతడు—అన్నట్టు ఒకసారి చూసింది. ఆ చూపులో భయం, సిగ్గు, ఆవేదన కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. వీటి అడుగున ఆకలి మంట కనిపిస్తోంది. సూక్ష్మగ్రాహి ఐన వీరయ్య త్రుటిలో గ్రహించాడు. ఈ మానపాత్రాభినయాన్ని, దృశ్యాన్నీ పుస్తకాలమ్మేవాడు, బిస్కట్లు అమ్మేవాడు చూచి చిరునవ్వు నవ్వుకున్నారు. వాళ్లకి వీరయ్య బాగా పరిచయం. అతని గుణసంపత్తి తెలుసు. అతని వలలో చిక్కే స్త్రీలనుగురించీ తెలుసును. కాని ఈ అమ్మ యెవరో కొంచెం విలక్షణంగా వుంది. ఏమౌతుందో అన్నట్టు చూస్తున్నారు వాళ్లిద్దరూ.

రెండెక్కుతోంది. పద్మకి ఆకలితో ప్రాణం కడబట్టిపోతోంది. రాత్రల్లా నిద్రపోలేదేమో, నీరసంగా వుంది. వీరయ్య మెల్లిగా, "ఏవూరు?" అని పలకరించాడు లౌక్యంగా. ఆ గొంతులో, దయ ధ్వనిస్తోంది.

"ఏవూరైతేం? నీదారిన పో" అంది పద్మ విరక్తిగా—ఆదుస్తావా! తీరుస్తావా—అని కూడా అనాలనుకుంది, అతను కదలకపోయ్యేసరికి.

"అదేమిటి అలా అనేశావు! నీ మొహం చూస్తే జాలేసింది

"ఏమోనండి - మధ్యాహ్నం మీ తో చెప్పాలంటే మీరు కనబడలేదు."

"ఏమిటో భయం - చిన్న పిల్లవాడు గన కనా - తప్పిపోయా డనుకోడానికి."

"నిన్న మొన్న ఆయన వొక మాదిరిగా వుండినాడండి."

"ఎలెక్షనులో ఏమౌతుందో ఏమో అనిలే ఆయన భయం...అయినా ఎవరికి తెలియ కుండా-" అంటూ మెట్లు దిగి క్రిందికి వచ్చాడు. అతని వెంటనే కమలకూడా దిగి వచ్చింది.

"ఒరే నాగా—"

"ఏమండి."

"నాయన కనపడలేదే. ఎక్కడికెళ్లాడు"

"ఏమోనండి. వేకువఝామున లేచిపో తుంటె చూశాను. మళ్ళీ కనబడలేదు"

"ఆ-సరే. వెళ్ళి పండుకో—" అంటూ పాండురంగయ్య తండ్రి గదివద్దకు పోయి తలుపులు దోశాడు. చీకటిగా వుంది. టార్చి వేసి చూశాడు. మంచంపై పరుపు చుట్టి వేశివుంది. పరుపుచుట్టమీద కవరు కనబ డింది. పాండురంగయ్య కవరు తీసుకొని—

"ఒరే నాగా—"

"అయ్యా—"

"యీ పరుపు చుట్టిందెవరు?"

"నేను చుట్టానండి."

"యీ కవరు."

"పరుపుమీదుంటె తీసి పక్క చుట్టి దానిపై నేశానండి."

"రాత్రి నాయన మేలుకొనివున్నాడా."

"సగం పొద్దుకాడ దీపం వెలుగుతూ వుండిందండి."

"సరే లాంతరీటు తీసుకరా."

నాగడు లాంతరు తెచ్చాడు. కవరు చించి చదివాడు.

"పాండూ - నేను వెళ్ళిపోతున్నాను. నామాట నీవు వినలేదు. తెలుసుకుంటా వనుకున్నాను. కాని నీ ధోరణి నీదే బోలెడు అప్పులు. నేను సర్దుకుంటూ వచ్చాను. నీవు చేసిన పనివల్ల బ్రహ్మయ్య అందరిచేతా దావా వేయించాడు. యింత డబ్బు వొక్కసారి ఎక్కడనుండి తెచ్చి కట్టేది? జప్తులు. వేలాలు. ఆ అవమానం భరించలేక వెళ్ళిపోతున్నాను - ఇట్లు... కనకయ్య.

జాబు చదివి పాండురంగయ్య తెల్ల బొయ్యాడు.

"మామ రాలేదాండి -" కమల ఆందో ళనగా అన్నది.

"రాలేదు" అంటూ పాండురంగయ్య ఆ మందంమీద చదికిలబడి రెండు చేతుల తోను తల పట్టుకొన్నాడు. ★

అడిగాను. పాపం డబ్బేమైనా పోయిందా, వెలా తెలా పోతూ నిల్చున్నావు?"

"అవును, కొంగున ముడేసుకున్న పదిరూపాయాలూ పోయినాయి"

"అన్నం తిన్నావా? ఇక్కడ నుంచుంటే ఏమైనట్టు?" అన్నాడు వీరయ్య, ఆమె ఆకలిమీద మహా అక్కరున్నట్టు.

ఆమె తృటకాలం ఆలోచించింది. ఇప్పుడు తనకు అన్నం చాలా ముఖ్యం. తనకోసమే కాదు, తన గర్భంలో ఉన్న శిశువు కోసం కూడా. ఏం జెయ్యాల్లి?

"సరే పద. ఆకలి వేస్తోంది." అంది ఆమె అప్పటికి స్థిరంగా ఆలోచించుకుని.

వీరయ్య మొహం వికసించింది. "సరే. రా" అంటూ స్టేషన్ బైటికి దారితీశాడు. బైట జట్కాలు నిల్చునివున్నాయి. వీరయ్యని చూసి గోపాలం తనజట్కా దగ్గిరికి తీసుకొచ్చాడు. "ఏమండోయ్, వీరయ్యగారూ! రండి ఊళ్ళోకి వెళ్దాం" పద్మ బండి ఎక్కింది. వీరయ్య వెనకచివర ఆమెను అంటీ అంటకుండా కూర్చున్నాడు. బండి మెల్లిగా సాగింది; ఆ గుర్రం చావ సిద్ధంగా వుంది. ఎంతకొట్టినా ఆ మెటల్‌రోడ్డుమీద మరింత చప్పు డెక్కువౌతోందేగాని బండివాడి ఇష్టంప్రకారం గుర్రం పరిగెత్తటం లేదు. ఆమె బండిలోనుంచి బైటికి చూస్తోంది. వరసగా కొట్లూ ఇళ్ళూ వెనక్కి పోతున్నాయి. రకరకాల కొట్లు కలగా పులగంగా పేర్చినట్టు కనిపిస్తున్నాయి. కొంతమంది వీరయ్యని బండిలో చూసి లోపలికి తొంగిచూస్తున్నారు అనుమానంగా. బండి మైలు దూరం పరిగెత్తి, ఎడంవేపు తిరిగి మినర్వాహాలుదగ్గిర సందులూ గొందులూ తిరిగి ఒక ఆరుంబాతిక డాబాదగ్గిర ఆగిపోయింది.

వీరయ్య పద్మా బండిలోనుంచి దిగారు. డాబా తాళం వేసివుంది. వీరయ్యవెళ్ళి తాళంతీసి తలుపుతోసి పద్మని లోపలికి తీసుకువెళ్ళాడు. రెండుగదులడాబా అది. ముందు గది పెద్దది. లోపలి గది చిన్నది, వంట కుపయోగించేది. పెద్ద గదిలో ఒక నవారు మంచం చిన్న ముక్కాలిపీట వున్నాయి. అల్మారాలలో ఏమీ లేవు. ఒకదాంట్లో ఖాళీ డబ్బాలు వున్నాయి. కాపరం చేస్తున్న కళ ఏమీ లేదు ఆ యింట్లో. పద్మ, వీరయ్యవేపు చూసింది. "ఏం?" అన్నట్టు.

"భోజనం తెప్పిస్తాను. నువ్విక్కడే వుండు. నీకు తోడు, ఓ చిన్నమ్మాయి వుంటుంది. నన్ను ఏదో దెయ్యం చూసినట్టు చూడకు. ఎటన్నా వెళ్ళావా?..." అంటూ హెచ్చరిక చేశాడు. గడపదాటుతూ ఆమె మాట్లాడలేదు. వీరయ్య వెళ్ళిపోగానే ఆలోచనలో పడింది. ఆమె ధైర్యం ఆమెకే అర్థం కావటంలేదు. ఆరిపోయే దీపపు కాంతిలాగా, మరణించేవాడి తెలివితేటలులాగా వుంది ఆమె తెగింపు. బహుశా ఇంక వేరేగతి లేదనుకుంది.

వీరయ్య జట్కా ఎక్కి బజారు వెళ్ళాడు. అక్కడ ఓ పెద్ద హోటల్లో కారేజీ భోజనం తీసుకుని జట్కావాడికిచ్చి, "ఇంట్లో ఇవ్వు. మన నారమ్మని అక్కడికి పంపించు" అన్నాడు. జట్కా వెళ్ళిందాకా అటే చూస్తో నుంచుని, తర్వాత హోటలుకి ఐదారు దుకాణాల తర్వాతఉన్న మంగలిషాపులోకివెళ్ళి కూర్చున్నాడు. మంగలిషాపు ప్రొప్రయిటర్ ఎర్రగా, కుదిమట్టంగా వున్నాడు. జుట్టు ముడేశాడు వెనక; ముందు కొద్దిగా క్రాపులాగా వొదిలి దువ్వాడు. వీరయ్య కుర్చీలో కూర్చోగానే "దయచెయ్యండి, దయచెయ్యండి" అన్నాడు చాలా మర్యాదగా, ఆప్యాయంగా. వీరయ్య గర్వంగా నవ్వి చుటూ చూశాడు.

షాపులో ఇంకా ఇద్దరున్నారు. ఒకడు తుంటుముక్కలా వున్నాడు; గళ్ళలుంగీ కట్టి ఆకుపచ్చని చొక్కా తొడిగాడు; అతనొక మాజీ ఫైల్వాన్. పదేళ్ళకిందట చాలాచోట్ల కుస్తీల్లో గెలిచి పేరు సంపాయించాడు. తర్వాత దుర్వ్యసనాలు ఎక్కువై కుస్తీలు మానేసి, ఇప్పుడు, తాలింఖానా పెట్టి శిష్యులకి నేర్పుతూ పొట్ట పోషించుకుంటున్నాడు. అతనికీ వీరయ్యకీ మంచి స్నేహం. రెండోవాడు బక్కపల్చగా వున్నాడు. క్షయరోగిలా అయిదు నిమిషాలకోసారి దగ్గుతాడు. అసలే చామనచాయ మనిషి, 'దుర్భడత' వల్ల నల్లబారిపోయి వికారంగా వున్నాడు. ఆస్తిఅంతా గుర్రప్పందాలకు ధారపోసి, ప్రస్తుతం ఓ సొంత గుర్రబ్బండి మిగుల్చుకుని, బాడిగ తోలుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. అతని కిద్దరు పసిపిల్లలున్నారు. మైనర్లపేర పెదవాళ్ళు రాసిన రెండెకరాల భూమీ మిగిలిపోయింది. దాంతో అతని భార్య కాలక్షేపంచేస్తూ మొగుడికీ ఇన్ని మెతుకులు పడేస్తోంది. తన సొదరు ఖర్చుకు గుర్రబ్బండి బాడిగ డబ్బులు వినియోగిస్తూ వుంటాడు.

మాజీ ఫైల్వాన్‌పేరు వస్తాద్ గోవిందు. రెండవవాడిపేరు రత్నం. వీళ్ళందరూ తమ అంతరంగిక వ్యవహారాలన్నీ ఈ షాపులో మాట్లాడుకోటం మామూలు.

వీరయ్య స్థిమితంగా కూర్చోగానే వస్తాదు గోవింద్, నవ్వాడు. "వీరయ్య మా జల్సాగా కనపడుతున్నాడు చూశా?" అన్నాడు రత్నంవేపుతిరిగి.

రత్నం పెద్దగానవ్వి ఒకసారిదగ్గి, "చూశా—ఇందాక గోపాలంబండీలో పోతున్నాడు! జల్సాగా వుండడుమరీ!—" అంటూ, మంగలివేపు తిరిగి, "సుబ్బయ్యోవ్! ఈయాల మహా నున్నగా చెయ్యాల వీరయ్యకి" అన్నాడు. పెద్ద హాస్యం విసిరినట్టు తనకు తానై విరగబడి నవ్వుతున్నాడు. వీరయ్య మీసం దువ్వుతూ తనూ నవ్వేడు. సుబ్బయ్య, వస్తాదూ నవ్వారు. వస్తాదు నవ్వు ఆపుకుని అడిగాడు. "పిట్ట కొత్తదంటన్నే! రత్నం చెబుతున్నాడు"

"చాలా కొత్తది గోవిందూ! ఓ పట్నాన లొంగదనుకుంటా. చల్లారిన లక్క." వీరయ్య ఎదురుగా అద్దంలో తనప్రతిబింబాన్ని చూసి మురిసిపోయాడు.

వస్తాదు గోవిందు, "లక్క నూ పెళుసు జాగర్త. ముక్కలై పోద్ది!" అని హెచ్చరికచేశాడు.

వీరయ్య—"ఛా! నాకు తెలవదంటా! కొత్తవేడికి—అదే కరుగుద్ది. ఇదో లెక్కంటా!"

వస్తాదు నవ్వాడు.

"ఏం—నవ్వుతున్నావు!" రత్నం.

వస్తాదు —"ఇదివరకు ఓసారి...యామైందో తెల్సా! ముందువరస రెండుపళ్లు వూడిపోయినాయి; తెల్లారి, బంగారం పళ్లు కట్టించుకున్నాడు. అదీ చెబుతున్నా."

"ఆరకం కాదులే. అంతధైర్యం ఎక్కడవచ్చిందీ! చేతిలో కానీ లేదు; తెలిసినవాళ్లెవరూ లేరంట. పస్తులుండి చస్తావుంది. ఇంక యేడికి పోద్దంటా? అయినా నారమ్మని కాపలా పెట్టినాలే" అన్నాడు వీరయ్య తనకు అనుభవంఇచ్చిన ధైర్యంతో.

మిత్రులిద్దరికీ అసూయకూడా కలిగింది. వీరయ్య ఆర్థికస్థితి వాళ్ళకి బాగా తెలుసు. ఓనెలదాటితే, వాడే తిప్పుకుంటాడు ఖర్చు భరించలేక.

కారేజీ భోజనం అందేటప్పటికి, పద్మ దొడ్లో బావిదగ్గర కాళ్లూచేతులూ కడుక్కుని సిద్ధంగా కూర్చునివుంది. ఆమె మనస్సు ఆలోచనలతో గందరగోళంగా వుంది. ఇంకా వాడు పంపుతానన్న అమ్మాయి రాలేదు. రెండు మూడుసార్లు ఎటన్నా వెళ్లిపోదాం అనుకుంది; కాని ఆకలిబాధ వేధిస్తోంది. చేతిలో కానీలేదు. రెండో చీరకూడా లేదు. ఇదేమో పరిక్రొత్త ప్రదేశం; ఎటు చూసినా ప్రమాదం గోచరిస్తున్నది. ఎవరుచూసినా తన వేపు గోళ్లు చాచుకుని, కరవొస్తున్నట్టే కనిపిస్తున్నారు. ఏమొగాళ్లే



# మంచి - చెడూ



చూసినా చిరునవ్వులు చిలకబోస్తున్నారు. సమాజంలో తనకి అందరూ శత్రువులే. ఇటువంటి సమాజంలోకి చేతిలో డబ్బు లేకుండా వెళ్ళడం బుద్ధిపూర్వకంగా, గోతిలో దిగటమే! కాని ఇక్కడ! తను ఈ రౌడీవెధవతో రావటం ఏమిటి! అలా చెప్పకుండా! కాని వేరే చేసేదేమిటి, అంతకన్న? తన కింత కన్న గత్యంతరం కనపడలేదు. ఒకసారి సమాజం దృష్టిలో తను 'చెడిపోయింది' అంటే ఇంక శాశ్వతంగా చెడిపోయినట్టేనా? అయినా, అతన్ని రానీ, మాట్లాడి తేల్చుకోవాలి. ఇప్పట్నించే భయపడ మెందుకు? గర్భిణి అని చెబితే దయతలచడా! వెక్కసేనా దని చూపిస్తారేమో! అతనిలో మానవత్వం వుండదా? ఏమో! అతని వైఖరి చూస్తే మాత్రం, దయ వున్నట్టు కనపడలేదు. అయితే ఏం? జట్కాలో తనకి అంటకుండా కూర్చున్నాడు. ఏమో! అతని మంచేమో చెడ్డేమో, అతనితో మాట్లాడందే ఎట్లా తెలుస్తుంది...

జట్కా వచ్చింది. జట్కా దిగి టిఫిన్ కారియర్ తెచ్చి లోపల పెట్టాడు గోపాలం. అతని వెనకాలే పన్నెండేళ్ళఅమ్మాయి చెంబులో మంచినీళ్లు తెచ్చిపెట్టింది. అప్పటికి రెండు గంటలయింది. పద్మ గబగబ భోజనం వడ్డించుకుని తినసాగింది. నూరమ్మ ఆమెకేసి ఆదరంగా చూస్తూ కూచుంది ఎదురుగా. పద్మ పది నిముషాల్లో భోజనం పూర్తిచేసి, మంచినీళ్లు తాగి, నూరమ్మవైపు తీక్షణంగా చూసింది. "నేను కాసేపు పడుకుంటాను. అత డొచ్చినాసరే నన్ను లేపకు" అంది ఆజ్ఞాపూర్వకంగా.

"ఎవర్ని మళ్ళ నేదికి వీరయ్య బావనా! బావ సాయంత్రం ఏడు గంటలకి గాని రాడులే. గోపాలం చెప్పాడు" అన్నది నూరమ్మ. నూరమ్మ, బొద్దుగా చామనచాయగా, ముక్కు మొగం తీరుగా వుంది. ఏ అలంకరణా ఆభరణాలూ లేవు, చెవి పోగులు, ముక్కున లవంగం తప్ప. ఆ అమ్మాయికట్టిన గుడ్డలూ మురికివే, ఛిద్రంగా లేవు. పద్మ ఆలోచనలు మానేసి మంచంమీద పడుకుంది.

పద్మ నిద్ర లేచేప్పటికి సాయంత్రం చీకటి పడుతోంది. ఇప్పుడు ఆమెకు అలసట తగ్గింది. మనస్సుమాత్రం కలతగా వుంది. వీరయ్య వస్తాడు కాబోలు, అని వూహిస్తూ కిటికీకుండా దూరంగా కనిపిస్తున్న మినర్వాటాకీసు లైట్లకేసి చూస్తోంది. లౌడ్ స్పీకరులోనుంచి సినిమా పాట ఏదో వినిపిస్తోంది శ్రావ్యంగా— "భూపతి చంపితిన్-మగడు-" అని.

పైట బూట్లు చప్పుడైంది. నూరమ్మ ముందే పరిగెత్తుకొచ్చింది, "బావ వస్తున్నాడు" అనుకుంటూ. పద్మ మంచం మీదించి లేచి నుల్చుంది. వీరయ్య తూలుతూ వచ్చాడు. పూర్తిగా తాగినట్టు లేదు. మనిషి తూలుతున్నాడు గాని, నిదానం తప్ప లేదు. మాట స్పష్టంగా వస్తోంది.

"ఎందుకూ నిలబడ్డావ్? కూచో—" అంటూ అతను, ముక్కాలిపీట మంచానికి రెండు గజాల దూరంలోకి లాక్కుని కూర్చున్నాడు. అతని కళ్ళు జ్యోతులల్లే వున్నాయి.

ఆమె కూచోకుండా, బహుశ అతనికి అందకుండా తప్పించుకోటానికి వీలైనచోట నిలబడి చూస్తోంది. ఇప్పటి అతని వాలకాన్ని చూస్తే ఆమె అనుమానం స్థిరపడుతోంది. వీరయ్య "ఇంకా బెదురు పోదల్లా" అన్నాడు. ఆమె పిరికితనం, అమాయకత్వం అతనికి జాలి కలిగించాయి.

"నీ పేరేం ఏమిటి!..." అని అడిగింది, తెలిసే.

వీరయ్య పకపక నవ్వాడు. సిగరెట్టు ముట్టించాడు. "వుద్దే కమా! తెలీటంలా?" అన్నాడు.

"అట్లాంటిదాన్ని కాదు. ఎక్కడున్నా వంట చేసుకుని బతుకుదామని వచ్చాను. నీకు పుణ్యం వుంటుంది" అందామె కళ్లనీళ్లు తక్కువగా.

"వంట చేస్తా? ఎవరింట్లో?" ఆశ్చర్యం ప్రకటించాడు. వీరయ్యకి జంకు తగిలింది—పెద్దింటి పిల్లేమో, పీకలమీదికి రావచ్చు! అయితే అతనిలో మొండిధైర్యాన్నిచ్చే మధుపానం, పనిచేస్తున్నది. అతని బలహీనతను పద్మ కొద్దిగా గుర్తించింది. "ఎవరింట్లోనన్నా వంటపని కుదర్చండి" అంది మర్యాదగా, బతిమాలుతున్నట్టుగా.

వీరయ్య తిరిగి నవ్వాడు. "నేను కుదిరించాలా! భేషుగ్గా వుందిలే! మరి నీకు మొగుడుండాడా?" నూరమ్మ ఇంతలో ఒక కోడిగుడ్డు లాంతరు వెలిగించి పట్టుకొచ్చింది. గదిలో వెలుగు ప్రసరించేవరకూ, ఉభయులూ ఒకర్నొకరు చూసుకున్నారు పరీక్షగా.

పద్మకి ఏమనటానికీ తోచటంలేదు. ఎవరింటిలో వంటపనికి నప్పుకోవాలన్నా కొన్ని ప్రశ్నలకి జవాబివ్వాలిగదా—అని ఆలోచిస్తోందామె. వీరయ్య, "చెప్పవేం? నీకు మొగుడు లేడూ?" అని అడిగాడు.

"లేడు" అంది పద్మ.

"ఇం కెవరున్నారు?"

"ఎవరూ లేరు" పద్మ ఈ మాటన్నందుకు పస్తాయించింది తర్వాత. వీరయ్యకింక ధైర్యం చిక్కింది. "నిన్నెవడు, వంట పనికి పెట్టుకుంటాడంటా? ఒకవేళ పెట్టుకున్నా వాడూ పెద్దమనిషేగా! ఎప్పుడో సీకట్లో నిన్ను చెయ్యిపట్టుకు లాగుతాడు ఏంచేస్తా?"

నిజమే నేమో! అందరూ, మగవాళ్ళు, పెద్దమనుష్యులే అయిరి. ఎట్లా ఇక?

వీరయ్య ముక్కాలిపీటమీదనుంచి లేచి నిలబడ్డాడు. "అమ్మాయీ! పిచ్చిదానా, భయపడుతున్నావుగాని, నీకు ఇదే కొంప—ఆలోచించు" అంటూ, అటూ ఇటూ పచారు చెయ్యసాగాడు.

ఏమిటది? తెలుస్తూనేవుంది! కాని—కాని—ఆమెకి తల బ్రద్దలైపోతూవుంది ఈ సమస్యతో. అవకంగా పారిపోతే? మైల మాత్రం—"రా అమ్మా" అని ఆదరించేవా రెవరున్నారు? స్వార్థం లేనిదే ఎవరూ ఇతరులకి ఉపకారం చెయ్యరు. ఇక ఆలోచించటాని కేముంది? ఆమె వెళ్ళి, వీరయ్య చేతులు పట్టుకుంది; కళ్లలో నీళ్లు నిండాయి.

"అటువంటిదాన్ని చూస్తే ఇంకో ఉద్దేశం రాదా నీకు!" అంది గుండెలు కరిగిపోయేట్టు.

వీరయ్య నిలబడిపోయాడు, పచార్లు మానేసి. ఏం చెప్పాలి? ఎట్లా చెప్పాలిమె? "ఇక్కడి వుంటానంటే సరే, రాణిలా గుంటావు. లేదా, ఎట్లాగో రాత్ తేసుకుంటా. వీరయ్యని తప్పించుకుని యాడికిపోతా, ఈ బంగరులో?" చివరి ఆయుధం వెదిరించి అది ప్రయోగించాడు. ఆమెకి ముచ్చెమటలు పోశాయి...

**36**

సుందరంగారు కథలేఖలు అచ్చేయించాడు. పెళ్లి వైభవం మానంలో. శ్రీమన్నారాయణరావు తరఫున పాండురంగారావు మిత్రులు ... [illegible]

బంధువులు చాలామంది వచ్చారు. పెళ్లి ఒక్కరోజే నిరాడంబరంగా జరిగినా, చాలా ఉత్సాహంగా జరిగింది. వున్నంతలో సుందరంగారు ధారాళంగా ఖర్చుచేశాడు.

పెళ్లికొడుకుతరఫున లాంఛనాలకోసం పోట్లాడ్డానికి పాండురంగారావు నడుము కట్టుకున్నాడు. "ఒరేయి, భాస్కరం, అలకపాన్పుపైన ఏం అడుగుతావు? చెప్పు?" అని ప్రశ్నించాడు.

"ఏమీ తోచడంలేదురా. నీకు పెళ్ళయిపోయిందిగా, అనుభవజ్ఞుడివి. నువ్వే అడుగు."

"నీ మొఖం! నీపెళ్లికి - నేను అడగడం ఏమిటిరా? - బాగా ఆలోచించి అడుగు. మామ అన్నవాడు, అలకపాన్పుపై అల్లుడి కోర్కె తీర్చటానికి, ఏడులోకాలూ తిరిగి మూడుచెరువుల నీళ్లు తాగాలి అని మన ఆచారం."

బైట సన్నాయిమేళం కల్యాణిరాగం మంగళకరంగా వినపడుతోంది.

అలకపాన్పుగదిలో ఆడవాళ్లు కుమిగూడి నవ్వుతూ కేరింతాలతో పెళ్లికొడుక్కి వూపిరాడకండా చేస్తున్నారు.

పాండురంగభార్య లీలకి 18 ఏళ్లుంటాయి. ఆమె అందుకుంది. "అడుగు అన్నాయి! నీయిష్టం వచ్చింది. సైకిలూ, వుంగరం, రిస్టువాచీ..." అని చెప్పబోతోంది. ఆమె.

భాస్కర్రావు, ఊహుం...ఊహుం...ఊహుం ... అంటున్నాడు.

"మరేమిటెరా!" అన్నాడు పాండురంగ. "కొంపతీసి, ఏనుగులూ, గుర్రాలూ, కావాలేం." అన్నాడు.

"ఎబ్బె. కాదురా. వుండు. బాగా ఆలోచించనీ." అందరూ రెండునిమిషాలు నిశ్శబ్దంగా నిల్చున్నారు.

"పాండూ! నాకోరిక నెరవేర్చి అలక తీర్చేదెవరన్నావు?"

"అదీ తెలీదురా? మీ మామగారే!"

"అయితే మా మామగారితో చెప్పు. చెబుతావా?" గ్యారంటీకోసం నిరీక్షిస్తూ ప్రశ్నించాడు భాస్కరం.

"ఏమిటిరా అది! ప్రాణాలు తోడేస్తున్నావు? చెప్పు— నేను స్వయంగా మీ మామగారితో చెప్పి—వూరికే చెప్పిగాదు, పోట్లాడి నీ కోర్కె నెరవేర్చేటట్టు చేస్తాను."

ఈ సంభాషణంతా సుందరంగారు గది బైట నిల్చుని వింటున్నాడు, ఆనందంగా, కొంత ఆందోళనతో. భాస్కర్రావుతో ఆయన కెంత పరిచయంవున్నా, అతనిపై ఎంత స్వతంత్రం వున్నా, ఇప్పుడతను అల్లుడు. ఏమడుగుతాడో! హిరణ్యాక్షవరాలేమి కోరడు అనే ధైర్యం వుందాయనకి. లోపలగదిలో గంధం, మల్లెపూల వాసనలు గుమాయిస్తున్నాయి. పట్టుచీరెల రాపిడీ, కొత్తచీరెల వాసనా, పెళ్లింటి కళని సమకూరుస్తున్నాయి. ఈడువచ్చి పెళ్ళికాని పడుచులూ, పెళ్లైన పెద్ద యువతులు, ముత్తైదువలూ, భాస్కర్రావు ఏంకోరతాడో అని చాలా ఆసక్తితో, ఒకర్ని ఒకరు చూసుకుంటూ గొణుక్కుంటున్నారు.

"నా గుమాస్తా వుద్యోగం ఖాయం చేయించమను" అన్నాడు భాస్కర్రావు, హఠాత్తుగా. పాండురంగ కొయ్యబారిపోయాడు. అదేమిటో అర్థంకాని పడుచులు గొల్లుమన్నారు. పెద్ద ముత్తైదువలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

బైట నిలబడి నిరీక్షిస్తున్న సుందరంగారికి ఈ మాట వినపడింది. ఎంత యధార్థమైన కోరిక! తను పెళ్ళి చేసుకున్న కొత్తలో వుద్యోగం వుంటుందో వూడుతుందో అన్న సందిగ్ధంలో పడి కొట్టుకులాడిన రోజులు జ్ఞాపకం వచ్చాయి ఆయనకి. ఈ యువకుడి ముందు జీవితం, అనంతంగా పరుచుకుని వుంది. జీవనయాత్ర సాఫీగా నడవాలంటే అటువంటి గ్యారంటీ అవసరమే. ఎంత దారుణమైన నిజం! సుందరంగారి కళ్ళు చెమ్మగిల్లాయి. గోడకి చేరగిల పడిపోయినాడాయన. ఉంగరం, సైకిలు, రిస్టువాచీ వంటివి ఈ కోర్కె ముందు, అత్యల్పం...జూనియర్ గుమాస్తా హృదయాందోళన, తాపత్రయం, సీనియర్ గుమాస్తాగారికి బాగా అర్థమైంది. మనసు కరిగింది.

పాండు రెండునిమిషాలకి తేరుకున్నాడు. పడుచుల నవ్వులతో అతని చెవులు, గింగురుమంటున్నాయి; కాని లోపల్లోపల, భాస్కర్రావు కోర్కెలో ధ్వనిస్తున్న యధార్థం, భవిష్యత్తు గురించి ఆ యువకుని కున్న భయం అతన్ని, హృదయాన్ని కదిలించివేశాయి. భాస్కర్రావు ఇంకేం కోరినా, పాండు హడావిడి చేసి వుండేవాడు; ఇప్పుడు, మాటుమాట లేకండా గదివిడిచి బైటికి వచ్చాడు; సుందరంగారి చెమ్మగిల్లిన కళ్లుచూశాడు, తన మొహమూ వివర్ణం మయిందని తెలుసతనికి. పాండురంగని చూడగానే సుందరంగారు, చిరునవ్వునవ్వాడు. ఆనందం, విషాదం కలిసినవ్వది. "అట్లాగే నాయనా. నా చేతనయినంతవరకూ ప్రయత్నించి, ఆ వుద్యోగం ఖాయం చేయిస్తానని చెప్పు. భోజనాలకి వేళయింది, లేచి రమ్మను అల్లుణ్ణి. ఇదిగో ఈ వుంగరం వేలికి పెట్టుకోమను" అన్నాడు రుద్ధమైన కంఠంతో.

పాండు భాస్కర్రావుకి వుంగరమిస్తూ, ఆమాటలు చెప్పాడు. భాస్కర్రావు అలకపాన్పు దిగి బైటికివచ్చాడు. మామగారు వెళ్లిపోతోంటే పిలిచి, "ఎందుకు మామయ్యా ఈ వుంగరం ఒకటి!" అన్నాడు, యధార్థమైన సానుభూతితో.

"మీ అత్తయ్య ముచ్చటపడింది, చేయించాను. ఇక దాని వుపయోగం అంటావు! ఏదైనా ఇబ్బందీ సబ్బందీ అంటే తప్పక వుపయోగిస్తుంది నాయనా వేలిన వుంగరం; అంతకంటే మరేమీ లేదు" అన్నాడాయన.

భాస్కర్రావు, "వీళ్లంతా నన్ను ఊగొప్పపెట్టి, కోరికంటూ కోరితేగాని వీల్లేదన్నారు మామయ్యా. నా నిజమైన కోర్కె అదే; చెప్పేశాను" అన్నాడు నిష్కల్మషంగా నవ్వుతూ.

పాండు ఇప్పటికి తేరుకున్నాడు. "వోరి పోరా బుద్ధాయి, ఈ క్షణాన దేవుడు ప్రత్యక్షమై నీ కేంవరం కావాలన్నా, ఆ గుమాస్తా బుద్ధిపోదలకే—అదే కోరేట్టున్నావు!" అన్నాడు ఎగతాళిగా.

సుందరంగారు అందుకుని, "అవును నాయనా నిజమే అంతే! ఆకలి అయ్యేవాడు దేవుణ్ణిమాత్రం ఏమడుగుతాడు, అన్నంగాక! భాస్కర్రావు కోర్కె చాలా సబబయినది. జీవితంలో మెడకో డోలు కట్టుకుని ప్రవేశించేవాడికి ఆ భయం సహజమే" అన్నాడు.

తర్వాత అందరూ కులాసాగా నవ్వుతూ భోజనాలకు వెళ్లారు.

భోజనాలయినాక అంతా తాంబూలాలేసుకుంటూ కూర్చున్నారు. షావుకారు పంపించిన గ్రామఫోను వాగుతోంది. పాండురంగ అన్నాడు, "ఏమిరా భాస్కరం పెళ్లయిందిక సరేగాని, ఇప్పుడున్న ఇంట్లోనే వుండదలిచావా, మారతావా?"

"ఆయిల్లు మార్చాలిరా. నాకు నచ్చటంలేదాయిల్లు. మా అత్తయ్యకి బొత్తిగా ఇష్టంలేదు."

"పైనెల ఈయింట్లో ఇంకోపోర్షను ఖాళీ అవుతుంది. అందులో పెడుదువుగాని నీకాపరం. సరా" అన్నాడు సుందరంగారు.

పాండురంగ భాస్కర్రావు భుజంతట్టి "భలే మామగార్ని పట్టేశావురా అబ్బి. అదృష్టవంతుడివి." అన్నాడు.

"నిజమే," అన్నాడు భాస్కర్రావు. "నీకొచ్చినలోటేమిటి, నన్ను అదృష్టవంతుడివని పొగడుతావా, ఇక?"



# మంచీ - చెడూ



"లోటేమిటో? పెద్ద లోటేరా! మా మామ, కూతురికి కోరుకుని పెద్దది చేశాడురా గారాబం ఎక్కువచేసి; నా తాడు తెగ తోంది." లోపల ఎక్కడో ఆడవాళ్ళల్లో అలజడీ నవ్వులూ వినవస్తాయి.

అందరూ గొల్లున నవ్వారు. "మనవాళ్ల సంగతి నాలుగురోజులు పోతేగాని తేలదు" అన్నాడు భాస్కరరావు. అందరూ తిరిగి నవ్వారు.

## 37

అల్లుడికీ కూతురికీ మందిప్పించి వ్యాధి కొంతవరకు నయం చేయించాడు సుదర్శనంగారు. శేఖరం తీరిగ్గా ఆలోచించాడు. ఇంతవరకూ తనకు స్వతంత్రం లేదీ ఇంట్లో. కానీ కావాలన్నా పెళ్ళాన్నో, మామనో అడగవల్సివస్తోంది. ఇట్లా కాకుండా తనేదైనా స్వంతంగా వ్యాపారం పెడితే? హాయిగా స్వంతంగా ఖర్చు పెట్టుకోవచ్చు, అని ఆలోచించుకున్నాడు. బెజవాడంతా తిరిగి వచ్చాడు ఆపూట. రాత్రి భోజనాలయినాక, మామగారూ భార్య వుండగా మెల్లిగా సంభాషణ లేవనెత్తాడు. "మావయ్యా, నేను..." నీళ్లు నమలసాగాడు;

"ఏదో చెప్పరాదా! ఎందుకట్లా నానుడుబేరం చేస్తావు?" అన్నాడు సుదర్శనంగారు. ఇటువంటి సంభాషణ పర్యవసానం డబ్బేనని ఆయనకి బాగా తెలుసు.

"నేను వ్యాపారం పెడ్తానండి..." అల్లుడు కొంత గొణుగుడుగా అన్నాడు.

"ఏమిటీ? వ్యాపారమా? ఏంవ్యాపారం?" మామగారి గొంతులో సందేహం, ఆగ్రహం ఒక్కసారి ప్రతిధ్వనిస్తున్నాయి.

"గవర్నర్ పేటలోనండి..." అల్లుడు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని మాట్లాడతాడు.

"గవర్నర్ పేటకేం వొచ్చింది భాగ్యాగాలం! బాగానే వుందిగా"

"అది కాదండి. గవర్నర్ పేటలో ఎక్కడా కవరింగ్ గోల్డ్ నగలకొట్టులేదు. ఆ బేరం పెడితే బాగా సాగుతుందండి"

"అయితే ఏమంటావయ్యా?"

"ఏదో బేరం చేసుకుంటూ నెమ్మదిగా కాలక్షేపం చేస్తానండి. అదీ నా వుద్దేశం."

సుదర్శనంగారు ఆలోచించసాగాడు; అల్లుడికి ఏదో సద్బుద్ధి కలిగినట్టున్నది. బేరం అంటూవుంటే ఒకచోట పడివుంటాడు. మంచిదే. కాని కొన్నివేలు ఈ ఫకీర్ వెధవని నమ్మి చేతికియ్యటం ఎట్లా? ముందు కొట్టు చూసుకురమ్మని, తర్వాత ఆలోచిద్దాం అనుకున్నాడాయన.

మామగారు ఏమంటాడో అనుకుంటూ భార్యవంక జాలిగా చూశాడు, శేఖరం తనను బలపర్చమన్నట్టుగా.

సరోజని అతని బాధ గ్రహించింది. అతని వుద్దేశం ఆమెకీ నచ్చింది కూడా. అవును, చెడుతిరుగుళ్ళు మానేసి ఒకచోట పడి వుంటాడనుకుందామె.

"ఆయన అన్నమాట నిజమే నాన్నా. ఆలోచించు" అంది కూతురు.

"అట్లాగేలే అమ్మా. ముందు కొట్టు ఎక్కడో చూశావా?" అన్నాడు అల్లుడివంక తిరిగి.

"ఆ." అన్నాడు శేఖరం.

"ఎక్కడా?..."

"గవర్నర్ పేట సెంటర్ కి ఫర్లాంగుదూరంలో వుంది."

"అద్దె ఎంత?"

"పాతిక రూపాయలు"

"కొట్టు విశాలంగా వుందా?"

"ఆ!"

"అయితే, కవరింగ్ గోల్డు నగలు ఏ కంపెనీ—ఏవూరుది.... వివరాలు సేకరించావా?"

"అవన్నీ సిద్ధంగా వున్నాయండి. బీర్వాలు చేయించి, ఓక టేబులూ, రెండు కుర్చీలు కొంటే సరిపోతుందండి"

"పెట్టుబడి ఎంత వుండాలి?"

"నగలమీద ఓ వెయ్యి రూపాయలు; ఫర్నిచర్ కీ ఇతర ఖర్చులకీ ఓ ఐదు వందలూ ఐతే చాలు"

"ఐతే—మంచిరోజు చూసి ప్రారంభిద్దాం. నగలకు ఆర్డర్ ఇవ్వు. నగలు ఏ వూళ్లో కొంటానన్నావు?"

"బందర్లోనండి. అక్కడ మంచి కంపెనీలున్నాయి"

"నేనూ కనుక్కుంటానులే. రేపు ఉదయం పంచాంగం చూసి మాట్లాడదాం. పోయి పడుకో" అన్నాడు మామగారు.

శేఖరం వికసిత వదనంతో గదినుండి నిష్క్రమించాడు. అతను వెళ్లాక తండ్రి కూతురుతో "ఈ ఫకీర్ వెధవ స్థిమితంగా కూర్చుని వ్యాపారం చేస్తాడంటావా?" అని అడిగాడు.

"ఎందుకు చెయ్యడు నాన్నా? అదేమన్నా వొళ్ళు అలిసే నౌకరీయా ఏమన్నానా! కూర్చుని అమ్మటమేగా? ఆయనకీ సంపాదనంటే ఏమిటో, డబ్బంటే ఏమిటో తెలిసివస్తుంది. అంతగా, కష్టకాలం వచ్చి—కీడెంచి మేలెంచమన్నారు, వ్యాపారం మునిగిపోతుంది! పోనీ; చూడు నాన్నా—నాకోసం, ఈ ఒక్క పనీ చెయ్యలేవా?" అన్నది కూతురు గారాబంగా.

"ఓసి పిచ్చిపిల్లా! నేను డబ్బుకి జంకుతున్నాననుకుంటున్నావా? కాదు. ఈ ఫకీర్ వెధవ ఈ డబ్బ్బా సానికొంపల్లో తగలేసుకుంటాడేమో నని—నా బెంగ. ఇప్పటికి అనుభవిస్తున్నాం చాలదూ?"

సరోజని నవ్వుతూ, అంది: "పో నాన్నా, ఎప్పుడూ, ఆయన్ని నువ్వు ఫకీరు, ఫకీరు అనకు. నాకు కోపం వస్తుంది."

"అననులే అమ్మా. ఎంత ఫకీరైనా మొగుడాయె నీకు. ఇంక అననులే" అంటూ ఆయనా నిష్క్రమించాడు గదినుంచి. ఆయన వెళ్లాక సరోజని గదిలో పెద్ద బల్బు ఆర్పేసి, ట్రాన్స్ఫార్మర్ బల్బు వెలిగించి, పడుకుంది. పైకి ఆమె వొళ్ళు నయమైనట్టు కనిపించినా లోలోపల బాధ తప్పటంలేదు. తండ్రి, పినతల్లి బాధపడతారని మూలుగటంకూడా మానేసింది. జీవితంలో ఇంత డబ్బుంది కూడా, తనేమీ తప్పు చెయ్యకుండా కూడా, ఈ నరకబాధ ఏమిటా అని కుమిలిపోతుందా అమాయకురాలు. తనకీ ఇష్టమే—భర్తమీద. కాని ఈ ఘోరం ఏమిటి? ఆమె ఆలోచిస్తూ మగత నిద్రలో పడింది.

శేఖరం, తనగదిలో పడుకుని ఆలోచిస్తున్నాడు. బందరు వెళ్ళితే చాలా బాగుంటుంది. ఒక మిత్రుడు చెప్పాడు. అక్కడ సాలులో చక్కని పిల్లలుంటారట. అందరాని అందగత్తెలు. వెళ్లాలక్కడికి తప్పకండా..." ఇవే ఆలోచనలతో నిద్రపోయాడు శేఖరం. కలలోకూడా బందరే జ్ఞాపకం వచ్చింది.

[ఇంకా వుంది]




కొమ్మూరి
వేణుగోపాలరావు

"నీకో విషయం చెప్పాల్సివస్తున్నందుకు చాలా విచారంగావుంది. ఏంచేయను? అవసరం వల్ల చెప్పవల్సివస్తుంది. ఇప్పటి విషయంకూడా కాదు యిది. రెండుసంవత్సరాల క్రితం సంగతి. సరిగ్గా యిదేవేళకు జరిగింది. బాగా ఆలోచిస్తే బహుశా నీకే గుర్తురావచ్చు" అన్నాడు విశ్వనాథం నడుస్తూ.

సత్యం అతనిప్రక్కనే నడుస్తున్నాడు. విశ్వనాథం యిలా అనటం అతనికి చాలా ఆశ్చర్యం కల్గించింది. ఈ ధోరణి...తనకు, విశ్వనాథానికి మధ్య ఎప్పుడూ రానిది. అటువంటిది, అకస్మాత్తుగా, తనకు బాధ కలిగించే పద్ధతిలో యిలా మాట్లాడుతున్నాడంటే సహించరానిదయింది.

"నే నెంతగానో ఆలోచించాను. ఏం తెలియలేదు. అందులోనూ నువ్వు చెప్పాల్సివస్తున్నందుకు విచారించే విషయం అంతకన్నా కనబడలేదు." అన్నాడు సత్యం.

విశ్వనాథం ఆశ్చర్యంగా ఆగిపోలేదు. అతనసలు ముఖం ఆశ్చర్యంగా పెట్టనూ పెట్టలేదు. చాలా మామూలుగావున్నాడు. ప్రక్కనుంచి చాలా దగ్గరగా పోయిన కారుని మెలకువగా తప్పుకున్నాడు సత్యం.

"అయితే గుర్తురాలేదన్నమాట?"

"ఊహూ."

"ఈరోడ్డు చాలా రద్దీగావుంది. అలా పోదాంపద."

ఇద్దరూ ప్రక్కసందులోకి తిరిగి ప్రశాంతంగా వున్న యిళ్ళ మధ్య నుంచి నడవసాగారు.

సత్యం చాలా ఆదుర్దా పడుతున్నాడు. కొద్దిగా చికాకూ, భయం అతని కళ్ళలో స్పష్టంగా కనబడుతున్నాయి.

"త్వరగా చెబుదూ!"

"చెప్తుంటాగా?"

విశ్వనాథం సంశయాన్ని చూస్తే సత్యానికి అతికోపం నెత్తికెక్కింది. ఏమిటిది? ఎటూ తేల్చకుండా? ఏదో విషయం అమాంతంగా ఎత్తుకువచ్చి, తనను సందిగ్ధంలో పెట్టి మళ్ళీ మూర్తిగా చెప్పకుండా బాధ పెట్టటం ఎందుకు?

సత్యం మాట్లాడకుండా ఒకసారి తీవ్రంగా విశ్వనాథం ముఖంవంక చూశాడు.

"చెబితే నువ్వు బాధపడతావేమోనని."

"పడను."

"చివరికి యీ విషయం నేనే ఎత్తవల్సి వచ్చినందుకు."

"ఏవిషయం?" సత్యానికి చిరాకు వేసింది.

విశ్వనాథం తటపటా యిస్తున్నాడు. సత్యం తన ప్రాణస్నేహితుడు. అతనితో యీ విషయం ఎలా చెప్పటమూ? అన్నట్టుగావుంది అతన్ని చూస్తే.

"కూర్చుందాంపద" పార్కులోకి వచ్చాక అన్నాడు. కూర్చున్నారుపోయి.

సత్యానికి చాలా ఆత్రంగావుంది "చెప్పు చెప్పు" అంటున్నాయి అతనికళ్లు.

ఎలా చెప్పేదా అనుకుంటున్నట్టుగా వుంది విశ్వనాథం పరిస్థితి. మళ్ళీ రెండు నిమిషాలు తటపటాయించాడు. ఏమనుకున్నాడో ఏమో చివ్వరికి చెప్పటానికే నిశ్చయించుకున్నట్లున్నాడు.

"రెండేళ్ళక్రితం యీ పార్కులో మనిద్దరికీ జరిగిన సంభాషణ గుర్తున్నదా?" అన్నాడు మెల్లిగా.

"ఏ సంభాషణ?"

విశ్వనాథం మళ్ళీ చిక్కులో పడ్డాడు. "నువ్వలా అంటే ఏం చెప్పేది? ఆ విషయం మాట్లాడ్డం యిష్టంలేదని మొదటనే చెప్పాను. అవసరంకొద్దీ సగం తెచ్చి ఆపుకున్నా నన్నమాట. అటువంటప్పుడు నువ్వు కొంచం గుర్తుతెచ్చుకుని మాట్లాడాలి" అన్నాడు మెల్లిమెల్లిగా.

"ముందు విషయమేమో తెలిస్తే గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు సత్యం చాలా మామూలుగా వుండటానికి యత్నిస్తూ.

"అయితే నీకేం గుర్తులేదన్నమాట?"

"ఊహూ"

"సరిగ్గా రెండేళ్ళక్రితం యీపార్కులో కూర్చుని..." విశ్వనాథం ఆపాడు.

"చెప్పు"

విశ్వనాథం జేబులోంచి సిగిరెట్టు పెట్టె తీసి ఒకటి సత్యానికిచ్చి, ఒకటి తను తీసుకున్నాడు. వెలిగించారు.

"నువ్వు నన్ను ఒకవిషయం అడిగావు."

"ఏ విషయం?"

"మనం మళ్ళీ మొదటికి వస్తున్నాం."

సత్యం విసుక్కుని "అందుకనే అంతా ఒకసారి చెప్పమని చెప్పానుగా" అన్నాడు. అతని వాలకం చూస్తే కొద్దిగా భయపడినట్టు కనబడినా ఎక్కువ ప్రమాదాన్ని వూహిస్తున్నట్టు లేదు.

"సరే సూటిగా చెప్పేస్తున్నాను" విశ్వనాథం గొంతు సర్దుకోబోయి మళ్ళీ అసాధారణంగా కనబడవచ్చునని మానేశాడు

"నువ్వు నన్ను వందరూపాయలు అడిగావు?"

సత్యం ఉలుక్కిపడ్డాడు "నేనా?"

"అదుగో. అలా అంటే ఏంచెప్పేది?" అన్నాడు విశ్వనాథం చెదిరిపోయి.

సత్యం సర్దుకుని "చెప్పు" అన్నాడు.

"వందరూపాయలు అడిగావు. ఎందుకని గూడా చెబుతాను. అత్తారింటికి పోయేందుకు డబ్బు లేదు. అక్కడకు అదీఇదీ కొనుక్కొని తీసుకుపోవాలి" అని అడిగావు. నే నెక్కడ్నుంచో అవస్థపడి తెచ్చి యిచ్చాను.

సత్యం చాలా బాధపడి "నేనెంత బుర్ర బద్దలు కొట్టుకున్నా గుర్తురావటం లేదే" అన్నాడు జుట్టు పీక్కుంటూ.

విశ్వనాథం ఏం మాట్లాడలేదు. చూస్తూ వూరుకున్నాడు.

అత్తారింటికి భార్యను తీసుకువచ్చేందుకు పోయేందుకు డబ్బువిషయం బాధపడిన మాట వాస్తవమైనట్లు లీలగా గుర్తుకువస్తున్నది సత్యానికి. కాని తను ఆ డబ్బుకోసం విశ్వనాథాన్ని అడిగాడా? అతనిదగ్గర తీసుకుని యిన్నాళ్ళు యివ్వకుండా వూరు [illegible]



# బాకీ



"నీకు మతిమరుపు అనేది అందరికన్నా ఒకపాలు ఎక్కువని ఒప్పుకుంటావా?" అన్నాడు విశ్వనాథం ఒకనిమిషం ఊరుకుని.

"ఆ విషయం నీకన్నా నాకే ఎక్కువ తెలుసు."

"నీ యిష్టం. నేనంతకంటే ఎక్కువ చెప్పను, నీకా విషయం గుర్తువచ్చేందుకు ఋజువులు అంతకన్నా చూపేందుకు ప్రయత్నించను. అది మన స్నేహానికి కళంకం. నేనసలు అడక్కపోయేవాణ్ణే కాని నాకలాటి అవసరం రాబట్టే ...అంటూ ఆగిపోయాడు.

సత్యానికి ఏంమాట్లాడాలో తోచక మాట్లాడలేదు.

"నేనబద్ధం చెప్పానని అపనమ్మకం లేదుగదా."

ఈ మాటకు సత్యానికి నిజంగా కోపం వచ్చింది. "నువ్వింత అసహ్యంగా మాట్లాడతావని అనుకోలేదు, నేను అంత నీచుణ్ణి అనుకున్నావా? అవేశాడు.

విశ్వనాథం రెండునిమిషాలు ఆలోచించి "తప్పదు గనక అలా అనవల్సివచ్చింది. పగం వచ్చి నేనడిగాను యీ విషయం. తరువాత నీ యిష్టం ఇక పోదాంపద" అని లేచాడు.

ఇద్దరూ లేచి నిల్చున్నారు.

సత్యం ఏం మాట్లాడటంలేదు. అతని ధోరణిమాత్రం బాగా ఆలోచిస్తున్నట్టుగా వుంది. విశ్వనాథం తను తిరిగి పోయేసందు వచ్చాక "ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకుని బాధపడకు నువ్వు యివ్వగలిగితే నే యియ్యి అయితే ఒక్కటి ఇస్తే రేపు సాయంత్రానికే యిచ్చే ఏర్పాటుచూడు. ఆ తర్వాతయిచ్చినాకూడా ప్రయోజనం వుండదు" అని బుజంతట్టి వెళ్లిపోయాడు.

సత్యం యింటికి చేరుకున్నాడు.

తలనిండా ఆలోచనలు. రెండుసంవత్సరాలక్రితం తను విశ్వనాథం దగ్గర ఎప్పుడు డబ్బుతీసుకున్నదీ గుర్తు తెచ్చుకోవ్వాలని మహాప్రయాసపడుతున్నాడు.

ఆలోచనలతో అమితంగా బాధపడి ఆ పూట భోజనంకూడా సరిగ్గా చెయ్యలేకపోయాడు.

"ఏమిటి అంతతీవ్రంగా ఆలోచిస్తున్నారూ?" అనడిగింది భార్య అన్నం తింటుంటే.

"ఏంలేదు."

"ఏం లేకపోవటమేమిటి? అన్నమంతా వదిలేస్తూ..."

సత్యం విసురుగా కంచందగ్గర్నుంచి లేచిపోయాడు. ఆమె తెల్లబోయింది.

ఈజీఛైర్ లో కూచుని కళ్ళుమూసుకుని సతమత మవుతుంటే మళ్లీవచ్చి ఏమిటంత యిదవుతున్నారు? నాక్కూడా చెప్పరూ!" అనడిగింది.

సత్యం కొద్దిగా విసుక్కుని "నన్ను చంపక యిక్కడినుంచి వెళ్ళిపోకూడదా?" అన్నాడు. "పెరుపాటిచేసి రారూ!" అని పిలవటం అతనింకా అలవాటుచేసుకోలేదు.

ఆమె ముఖం ముడుచుకుని అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

"విశ్వనాథం యివాళ చాలావిచిత్రంగా మాట్లాడాడే" అనుకున్నాడు, సత్యం. నిజంగా తను అతనిదగ్గర అప్పుచేసిన మాటే వాస్తవమైతే యిన్నాళ్ళనుంచీ యివ్వకుండా వూరుకోవటం క్షమించరాని నేరమే. అందులోనూ అయిదూ పదీ కాదు. వంద రూపాయలు.

విశ్వనాథం తనతో అబద్ధం చెప్పడుగదా. ఆమాట అతను అన్నందుకే యిందాక తనెంతో కోపం తెచ్చుకున్నాడు. మళ్ళీ ఆ పాయింటును గురించే ఆలోచించటం తనకే పాపం.

కాని ఎంత తన్నుకున్నా తనకు డబ్బు అప్పు పుచ్చుకున్నట్లే గుర్తురావటం లేదు.

లీలగా, తనకు రెండేళ్ళక్రితం అవసరం రావటంమట్టుకు గుర్తువున్నది. అయితే తను ఆ డబ్బుకోసం విశ్వనాథాన్ని అడిగినట్లూ, అతను యిచ్చినట్లూ మటుకు గుర్తురావటంలేదు. కానివిశ్వనాథంచెప్పింది అబద్ధం అయేందుకు వీలులేదు.

రెండేళ్ళక్రితం......

వచ్చి భార్యను తీసుకుపోవాల్సిందని మామగారు వుత్తరం రాశాడు. తనదగ్గర అప్పుడు డబ్బులేకపోవటం సంభవించింది. అందుకోసం ఏంచేశాడు? ఎవర్ని అడిగాడు?......తనకు బాగా స్నేహంవున్నదల్లా విశ్వనాథంతోనే. ఇద్దరిమధ్యా రహస్యాలుకూడా వుండవు. ఆ రోజు రాత్రి ఎనిమిదగంటలకే అని గుర్తు...కొంచం కొంచం గుర్తువస్తున్నది. విశ్వనాథం యింటికిపోయి తలుపు తట్టాడు. అక్క[illegible]డ్నుంచీ యిద్దరూ... పార్కు [illegible]దారి తీశారు. అక్కడ కూర్చున్నాక అడిగాడు తను ఎలాగయినా వందరూపాయలు సర్దమని. అతను సర్దుతానని మాటకూడా యిచ్చినట్లున్నాడు ఇచ్చినట్లున్నాడేమిటి? ఇచ్చాడు.

ఆ తరువాత...

సత్యం చాలా కష్టంమీదగుర్తు తెచ్చుకుంటున్నాడు.

అప్పుడేం జరిగింది? తను...[illegible]యింటికి వచ్చేశాడు... విశ్వనాథంమీద ఎక్కువ ఆశ పెట్టుకోలేదు. అతనుకూడా తనలాంటి వాడే. అప్పటికప్పుడు ఎలా పుట్టుకు వస్తాయి వందరూపాయలు? కాని...కొద్ది కొద్దిగా జ్ఞాపకం వస్తున్నది. ఆ రాత్రి పదింటికి గావును అతను వచ్చి తలుపు తట్టాడు. వందరూపాయలు ఇంకా... బాగా చెప్పవలసివస్తే పది పదిరూపాయల నోట్లు తనచేతిలో పెట్టాడు. తను ఎంత సంతోషించాడప్పుడు?

ఇప్పుడు అంతా జ్ఞాపకంవచ్చింది, రెండు

"ఏం బ్రదర్! ముఖం వేల వేసుకుని కూర్చున్నావ్! ఏం జరిగిందేమిటి?

"వారంరోజుల క్రితం నేను మా ఆవిడతో ఒక మాటన్నాను అప్పటి నుంచి ఆవిడ నాతో మాట్లాడ్డం మానేసింది."

"అయితే ఆమాటేదో నాతో చెప్పి పుణ్యం కట్టుకుందూ! నేను కూడా మా ఆవిడతో-అనేస్తాను.

ఎస్. బాలకృష్ణారావు. (జయపురం)

* * *

రాత్రి పదిగంట లైంది. భార్య భర్తని పిలిచి "ఏమండీ! శ్రోతలు కోరిన పాటలు వస్తాయి గావును. రేడియో కాస్త బిగ్గరగా పెట్టండి" అన్నది.

"ఇప్పుడెందుకే. పక్కింట్లో అంతా నిద్దర్లు పోతున్నారు. వాళ్ళేమన్నా అనుకుంటారు."

"మరేం ఫర్వాలేదు. వాళ్ళకీ మనకీ పడదుగా" అంది భార్య.

సంవత్సరాల క్రిందటి ఆ సంఘటన కళ్ళకు గట్టినట్లయింది.

విచారంగా నిట్టూర్చాడు.

ఎంత మతిమరుపు తనకు! అంత పెద్ద విషయాన్ని ఎలా మరిచిపోగలిగాడు? పైగా గుర్తులేదన్నట్లు విశ్వనాథాన్ని దబాయించాడు. ఎంత చిన్నబుచ్చుకున్నాడో ఏమో అతను.

తన ప్రవర్తనమీద తనకే సిగ్గువేసింది సత్యానికి.

అంత ప్రాణంగావుండే విశ్వనాథమే తెగించి డబ్బు అడిగేశాడంటే అతనికి ఎంత అవసరం వచ్చివుంటుంది! లేకపోతే అంత తేలిగ్గా బయటపడే మనిషి కాదు అతను. రేపు సాయంత్రానికే కావాలన్నాడు. ఎంత యిబ్బందో?

అయితే వెంటనే ఎలా యీ బాకీ తీర్చడం.

సత్యానికి తాత్కాలికంగా యిదో క సమస్యలాగానే కనిపించింది. కాని తన యిబ్బందులకోసం మరొకర్ని యిరుకులో పెట్టే స్వభావంకాదతనిది. మనసులో ఏదో నిశ్చయించుకున్నాడు. లేచాడు.

ఇతను లోపలకు రావటంచూసి శారద లేచి నిల్చుంది, మంచంమీదనుంచి.

సత్యం కొంచంగా తటపటాయించాడు. "నీతో ఒక పనుంది. నువ్వు నాకు సాయం చేస్తావనే నమ్మకంతోను" అన్నాడు విషయం ముందే బయటపెట్టకుండా.

"చెప్పండి"

సత్యం ముఖంలోకి చూసింది ఆమె. అతనుమట్టుకు ఆమె ముఖంలోకి చూడలేక పోయాడు. ఇందాక విసుక్కున్న విషయం యిప్పుడే గుర్తుకు వచ్చినట్లుంది.

"చాలా అవసరం. ఒక స్నేహితుడికి బాకీపడ్డాను. వెంటనే తీర్చెయ్యాలి. నీచేతి గాజులు..."

సిగ్గులాంటిది అది ఏదోవేసి మిగిలిన విషయం చెప్పలేకపోయాడు. అయినా అంతవరకూ చెప్పాక మిగిలింది చెప్పనూ అక్కర్లేదు.

రెండునిమిషాలవరకూ అతను ఆమెవంక చూడలేదు.

"తీసుకోండి" అన్న శబ్దం వినిపించిన తర్వాత తల ఎత్తిచూశాడు. శారద చేతులు ముందుకు చాపి - తనకు చాలా దగ్గర్లో వున్నాయి. వాటిల్లో గాజులు.

సత్యానికి ఆమెవంక చూడటానికి భయంవేసింది. వణుకుతున్న చేతుల్తో చూడకుండానే వాటిని అందుకున్నాడు. మనసులో తనని తను తిట్టుకున్నాడు — ఈ శారదనే తను యిందాక విసుక్కుంది.

ఆమెకి ఎలా కృతజ్ఞత చెప్పాలో తెలియలేదు. రోజా విషయం వేరు. ఎప్పుడూ మాట్లాడినంత స్వేచ్ఛగా యీ క్షణంలో అతను ఆమెతో మాట్లాడలేదు. "రక్షించావు శారదా" అన్న మాటలు మాత్రం అతని పెదాలు దాటి బయటకు వచ్చాయి, సిగ్గు విడిచి.

వెనక్కి తిరిగి రెండడుగులు వేశాడు. మళ్ళీ ఏదో స్ఫురణకి వచ్చి ఆగిపోయాడు. "ఒక గంటలో వస్తాను. జరిగిందంతా తర్వాత విపులంగా చెబుతాను. ఏం అనుకోకేం?" అంటూ శారద కళ్ళలోకి చూశాడు. ఆమె కళ్ళు వినక కొంచంగా నీరు చిమ్మిన సంగతి అతను గ్రహించలేదు. గాజుల్ని జేబులో వేసుకుని, తలుపులు తీసుకుని, బయటకు......చీకట్లోకి వెళ్ళిపోయాడు.

* * *

ఆ రాత్రే పోయి విశ్వనాథానికి వంద రూపాయలూ యిచ్చివచ్చాక సత్యంమాత్రం ఆరోజునుంచీ చాలా కులాసాగావున్నాడు. ఎటొచ్చీ విశ్వనాథమే బెదిరిపోవటం మొదపెట్టాడు. తన కతనిమీద ఏ కోపం లేదు. అతను గ్రహించాలని సత్యం తాపత్రయం అందుకని అతను ఎప్పటికంటే ఎక్కువ విశాల హృదయంతో ప్రవర్తించసాగాడు కాని అతనితో స్వేచ్ఛగా మాట్లాడటానికి విశ్వనాథమే భయపడుతున్నాడు.

సత్యం యిది అర్థంచేసుకోలేకపోయాడు. తను అతనిమీద కోపం పెట్టుకున్నానని అతను నమ్ముకుని అలా ప్రవర్తిస్తున్నాడా? ఈ విషయంగురించి విశ్వనాథాన్ని అడగలేదు. కాని, ఆరాత్రి - "నా మతిమరుపు ఎంతటిదైనా యిప్పటికైనా గుర్తువచ్చిందిరా" అని తను అన్నప్పుడు అతను చూపించిన హావభావాల్లో దాగొన్న పిరికితనాన్ని మాత్రం సత్యం మరిచిపోలేకుండా వున్నాడు. "జరగవలిసిన విషయం జరుగుతుంటే విశ్వనాథం ఎందుకంత భయపడతాడు?" అని తనే విస్తుపోయాడు.

ఆరోజు సాయంత్రం సత్యం కాఫీతాగి బయటికి వస్తున్నాడు. విశ్వనాథం గుమ్మంలోనే ఎదురయ్యాడు.

"ఓ రా. కూర్చో" అన్నాడు సత్యం.

విశ్వనాథం వచ్చికూర్చున్నాడు. రోజూ కన్నా అతని కళ్ళలో బెదురు ఆరోజు మరీ ఎక్కువగా వుంది.

"కాఫీ తెస్తాను" అంటూ సత్యం లోపలికి పోబోయాడు.

కాని విశ్వనాథంవారిస్తూ "వద్దు వద్దు" అని ఆపాడు. ఈమధ్య అతను ఇలా అనటం అలవాటయిన విషయమే గనుక సత్యం ఎక్కువగా ఆశ్చర్యపడకుండా వచ్చి అతనికి ఎదురుగా కూర్చున్నాడు.

"బయటికి పోదామా?"

ఈ ప్రశ్న అడిగింది సత్యం.

"వద్దు. నీతో చాలా చెప్పాలని వచ్చాను" అన్నాడు విశ్వనాథం క్రొత్త గొంతుకతో.

"మాట్లాడు. కాని నేనుకూడా నీతో మాట్లాడదామనుకుంటున్నాను."

"ఏమిటి?"

"నీ ప్రవర్తన గురించి. నువ్వా రోజు నుంచి చాలా మారిపోయావు. నువ్వెందుకో చేసిన తప్పేమిటో నా కర్థంకావటంలేదు. నేను ఎన్నిసార్లు మాట్లాడదామని వచ్చినా తప్పించుకుపోయావు. నాకు మొహం కనిపించకుండా వుండాలని కూడా చాలా సార్లు ప్రయత్నించావు. ఎవ్వనా?" అన్నాడు సత్యం.

విశ్వనాథం కళ్లలో నీళ్లు తిరిగాయి. "నేను నీకు చాలా ద్రోహం చేశాను సత్యం" అన్నాడు గద్గదికంగా.

సత్యం ఆశ్చర్యపోయాడు. "ద్రోహమా? అదేమిటి?"




# స్త్రీలు - ఉద్యోగాలు: కొన్ని విమర్శలు

వి. వి. కుటుంబశాస్త్రిగారు (హైదరాబాద్) ఇలా వ్రాస్తున్నారు:

"ఉద్యోగం పురుషలక్షణం" అనే ఆర్యోక్తి పుట్టేనాటికి స్త్రీలు కూడా ఉద్యోగాలు చేస్తారు, చెయ్యవచ్చు అనేది ఊహకందని విషయం. శ్రమ విభజన సిద్ధాంతం ప్రకారం ఇల్లు చక్కదిద్దుకోవటం, పిల్లల్ని సాకటం మొదలైన గృహవిషయాలు గృహిణిపాలపడ్డాయి. పురుషుడు ఇంటికి కావలసిన వస్తువులు సమకూర్చటంలో సతమతమవుతూ వచ్చాడు. ఆ పరిస్థితుల్లో ఆనాటికి విద్య అవసరమని గాని ఉపయోగమని గాని అనుకోటానికి వీలు లేకపోయింది. అయితే ఆధునిక కాలప్రభావం స్త్రీలపైన కూడా పడింది. మానవుడు స్వాతంత్ర్యము, వ్యక్తివికాసాలకు పోరాడే రోజుల్లో, స్త్రీ కొన్ని హక్కులకు పోరాడటం జరిగింది, జరుగుతోంది. రాజకీయార్థిక, సాంఘిక సమస్యలలో స్త్రీ చైతన్యం కనబడింది. స్త్రీల హక్కులను పురుషులుకూడా బలపరచి సమర్థించటం జరిగింది. కాని స్త్రీలు చదువులు చదివి ఉద్యోగాలు చెయ్యాలా; ఏయే పరిస్థితులలో ఏయే ఉద్యోగాలు చెయ్యాలి అనేది ప్రస్తుత వివాదాంశం.

"మానవజీవితం అంటే సంఘజీవనం. అలాంటి సంఘజీవనానికి అట్టడుగు సంసారం; కారణం అనేక సంసారాల కలయికే సంఘం కాబట్టి. సంసారాలు ఎంత ఆహ్లాదకరంగా వుంటే సంఘం అంత ఆరోగ్యకరంగా వుంటుంది. సృష్టిలో స్త్రీపురుష జాతుల మధ్య సహకార సమన్వయం వుంది గాని పోటీ ప్రవృత్తులు లేవు. కాబట్టి స్త్రీ

---

**కొమ్మూరి ఉషారాణి**

---

పురుషుల విద్యావిధానం కూడా ఆయా అంశాలపై ఆధారపడివుండాలి. సృష్టిలో స్త్రీ స్థానం ప్రత్యేకం, ఉత్కృష్టం, సున్నితంకూడాను. కాబట్టి పురుషుడుచేసే ప్రతిపనిలోను స్త్రీ జొరబడటం అవివేకం, అపాయకరం. ఇలాంటి పరిస్థితుల్లో మగవారితోపాటు అన్ని చదువులు చదివి, అన్ని ఉద్యోగాలు స్త్రీలు చెయ్యాలని ఉబలాటపడటం ఆత్మవంచనే కాగలదు. పైగా వాటి ఫలితాలు సంసారంమీద సంఘంమీద అపారం. భారతదేశంలో, ముఖ్యంగా హైందవులలో, సంసారమనేది విడిబడని, విడబడజాలని భార్యాభర్తల, వారి సంతతుల కూటమి. పాశ్చాత్య నాగరికతాప్రభావం నానాటికి ప్రబలుతున్నా, విడాకులు మొదలైన విషయాలు మన సంఘం పూర్తిగా సహించలేనివి. అలాంటప్పుడు స్త్రీ మగవానితోపాటు చదువుకొని తన హక్కులను భుక్తపరముగా సేతువేగంతో ఉద్యోగాలలో ప్రవేశిస్తే అది సంసారవిచ్ఛిత్తికి దారి తీయవచ్చు. స్వర్గంలో జరిగిన వివాహాలు కోర్టులలో విడిపడి ఇతరత్రా ముడిపడటానికి రిజిస్ట్రేషన్ ఆఫీసులకు పరుగెత్తే అగత్యం కలుగవచ్చు. స్త్రీ పురుషులు సహనాన్ని ప్రదర్శించి అలాంటి ప్రమాదాన్ని నివారించినా, పిల్లల విషయంలో చాల అన్యాయం జరుగుతుంది. పిల్లలను కనటం ఒకరివంతు, పెంచటం మరొకరివంతు అయితే సంఘజీవనం క్షేమకరం కాదు. అలా జరిగితే స్త్రీలో మాతృత్వం కేవలం నశించకపోయినా క్షీణించే ప్రమాదంవుంది. (పెళ్లి చేసుకోకుండా ఉద్యోగాలు మొదలైనవి చేసే స్త్రీలు ఇలాంటి విషయాలకు అతీతులు, మన చర్చకు అనర్హులు). స్త్రీలు ఇంట్లో పని చూసుకొంటూ పిల్లల్ని పోషించుతూ, భర్తకు సాహాయ్యం చేస్తూ, ఉద్యోగంకూడా చేయగలరంటే, అలాంటివారు బహు కొద్దిమంది



## ★ స్త్రీలు - ఉద్యోగాలు ★

వుంటారు. వారైనా కొద్దికాలంపాటే చేయగల్గుతారు. సంసారం పెరిగినకొద్దీ, శక్తి తగ్గినకొద్దీ ఇవన్నీ సమర్థించుకోటం చాల కష్టసాధ్యం. అనేక వ్యావృత్తులు పెట్టుకుంటే ఆరోగ్యం చెడుతుందనేది సర్వజన విదితమైన విషయం.

"మనం తిరిగే వాతావరణం మన జీవన విధానంపై కొంత ప్రాబల్యం కలిగి వుంటుంది. సంఘంలో ఏ సాకుతోనైనా సరే స్త్రీ పురుషులు విచ్చలవిడిగా తిరిగే అవకాశం లభిస్తే మానవులలో అణిగి మణిగి వున్న అనేక గుప్తశక్తులు, వాంఛలు వెర్రితలలు వేసే ప్రమాదం వుంది. మనదేశ శీతోష్ణ పరిస్థితుల్లో ఇది మరింత ప్రమాదకరం. ఇది వాంఛనీయం కాకపోయినా నిర్లక్ష్యం చేయతగినది కాదు. పరిస్థితుల ప్రభావానికి లొంగిపోయి ఆత్మనింద పరనిందచేసి ప్రయోజనం వుండదు.

"అయితే నేటి ఆర్థిక పరిస్థితులలో స్త్రీలుకూడ సంపాదించటం ఎంతవరకు సమంజసం అనేది ఒక సమస్య. కొద్దిపాటి జీతాలలో బడుగుజీవితాలను గడపటం అనేక మధ్య తరగతి కుటుంబాలకు కష్టసాధ్యంగా వున్నది. అలాంటి కుటుంబాలలో స్త్రీలుకూడ సంపాదించ గల్గితే సంసారం ఆర్థికంగా సాఫీగా నడచిపోగలదనే వాదనలో కొంత సత్యం లేకపోలేదు. కాని సంసార క్షేమంకోసం, భర్త, బిడ్డల ఆర్థికసహాయంకోసం, ఎంతమంది చదువుకొన్న స్త్రీలు ఉద్యోగాలు చేస్తారు అన్నది క్లిష్టసమస్య. చదువుకొన్న స్త్రీ తక్కువ సంపాదనతో ఆస్తిపాస్తులు లేక సతమతమవుతున్న పురుషుని వివాహమాడటానికి సిద్ధపడే సందర్భాలు బహు అరుదు.

"నేటి మన విద్యావిధానం మిడిమిడి జ్ఞానమాత్రం ప్రసాదిస్తోంది. విద్యాధికుల మనుకొనేవారి ఊహలు స్వైరవిహారం చేస్తుంటాయి. ఇది స్త్రీలలో మరింత సహజం. కాబట్టి స్త్రీ ఉద్యోగాలకు కేవలం స్వార్థంతో చొరబడుతుందిగాని, పురుషులవలె సంసార సంపాదనాభారం మోయటానికి కాదు. (అంటే కేవలం అత్యవసరాలకు ఆదుకోవటం మాత్రం కాదని మనవి.) సహనస్వరూపిణి స్త్రీమూర్తి నిజంగా సంసారక్షేమం కోరి సంపాదనకు దిగదలచుకొంటే అదెంతవరకు సాధ్యమనేది తర్వాత ప్రశ్న. నేటి మనదేశ పరిస్థితుల్లో నిరుద్యోగం పెద్ద గడ్డుసమస్య. అనేక రంగాలలో పట్టభద్రులైన నిరుద్యోగుల దీన పరిస్థితి అందరికీ తెలిసినవిషయమే. ఇందులో స్త్రీలసంఖ్య బహు స్వల్పం. కారణం చదువుకొన్న ప్రతి స్త్రీ ఉద్యోగంకోసం ప్రాకులాడకపోవటమే. చదువుకొన్న ప్రతి స్త్రీ పురుషునితోపాటు ఉద్యోగానికి ఎగబడితే నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోతుంది. సమానహక్కుల సిద్ధాంతప్రకారం కొన్ని ఉద్యోగాలు స్త్రీలకు కేటాయించో, లేక పురుషులతోపాటు విద్యాధిక్యతనుబట్టో స్త్రీలనుకూడ నియమించితే ఉద్యోగాలు పొందగలిగిన పురుషులసంఖ్య వాటిని పొందిన స్త్రీలసంఖ్య మేరకు సన్నగిల్లుతుంది. అప్పుడు ఆయా సంసారభాగాలు ఆర్థిక దుస్థితికి ఘోరంగా గురి అవుతాయి. అట్లాగాక ఉద్యోగులైన స్త్రీలు నిరుద్యోగులైన పురుషులను వివాహమాడి సంసారం నడుపుతారని అంటే అది కేవలం అర్థరహితం, హాస్యాస్పదం. అట్లాగాక దేశాభివృద్ధి ప్రణాళికల ధర్మమా అంటూ నిరుద్యోగ సమస్య పూర్తిగా నివారించబడి ఆర్థికంగా దేశం అభివృద్ధిచెంది, సిద్ధపడిన ప్రతివారికి ఉద్యోగం లభించే అవకాశమే ఏర్పడితే, అప్పుడు సంసార స్త్రీలుకూడ ఉద్యోగాలు చేయవలసిన అవసరం ఉండక పోవచ్చు. అవకాశం ఎప్పుడూ అంతంత మాత్రమే. గృహంలో స్త్రీ నిర్వహించవలసిన భారం రోజులో ఏ కొద్దిసేపు మాత్రమో కాదు. కాబట్టి అనేక కారణాల వలన స్త్రీ అన్నిఉద్యోగాలలోను ప్రవేశించటం ఏమాత్రం వాంఛనీయం, భావ్యం గాదు. కాని కొన్ని మితపరిస్థితులలో అమిత శ్రమ ప్రయాసలులేని కొన్ని రకాల ఉద్యోగాలు చేసినా ఎక్కువ ప్రమాదం ఉండకపోవచ్చు. కాని అలాంటి సదవకాశ సందర్భాల సమన్వయం కేవలం దుర్లభం కాకపోయినా బహు కష్టసాధ్యం."

—స్త్రీ మగవానితోపాటు చదువుకొని తన హక్కులను భుక్తపరచుకొనే ఆవేశంతో ఉద్యోగాలలో ప్రవేశిస్తే అది సంసారవిచ్ఛిత్తికి దారి తీస్తుందనడం అన్యాయం. స్త్రీలు ఉద్యోగాలు చేసినంత మాత్రాన ఏ సంసారాలైనా విచ్ఛిన్నమౌతాయంటే, ఆ దోషం స్త్రీలదే కాదు పురుషులదికూడా ఔతుంది. అసలు స్త్రీలు ఉద్యోగాలు చెయ్యవలసిరావడం సంసారాలను విచ్ఛిన్నంచెయ్యడంకో సమసీ పురుషుల ప్రమేయంలేకుండా స్వతంత్రించి బ్రతకడానికనీ ఎందుకనుకోవాలి? మనం ప్రత్యక్షంగా అనేక సంసారాలను చూస్తున్నాం, సంసారమంటే భార్యాభర్తలిద్దరేకాదు. బిడ్డల భవిష్యత్తుకూడా ఉభయుల బాధ్యతేను. భర్త సంపాదన బొత్తిగా జరుగుబాటుకే చాలక బిడ్డల భవిష్యత్తు మంటగలుస్తూవుంటే ఏమీ చెయ్యలేక దుఃఖిస్తున్న భార్యాభర్తలెంతమంది లేరు? సమాజంలో నానాటికి దిగజారిపోతున్న సంసారాలెన్ని లేవు? బిడ్డల భవిష్యత్తుకోసమే మధ్యతరగతి స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలనేది. స్త్రీపురుషులు జీవితంలో అన్నివిధాలా సహకరిస్తూ, పరస్పరం ఆధారపడుతూ, సహానభావంతో సరిదిద్దుకుంటూ కష్టసుఖాలలోపాలు పంచుకున్నప్పుడే సంసారానికి నిజమైన పునాది ఏర్పడుతుంది. అప్పుడు స్వర్గంలో జరిగినా రిజిస్ట్రార్ ఆఫీసులో జరిగినా వివాహబంధబలం ఆయా వ్యక్తుల సంస్కారాన్నిబట్టే ఉంటుంది కాని స్త్రీలు ఉద్యోగాలుచేస్తే ఊడిపోవు.

మాతృత్వం ఏదో నశించిపోతుందన్నారు. స్త్రీ ఉద్యోగం చెయ్యనీయండి, మరేమైనా చెయ్యనీయండి మాతృత్వ ప్రకృతి ఎన్నటికీ నశించదు. ప్రపంచంలో ఎన్నెన్ని విధాల నాగరికత పరిణామం చెందినా స్త్రీల ఈ ప్రకృతిలో మాత్రం మార్పురాలేదు. మాతృత్వమనేది నాలుగు గోడలమధ్య మ్రగ్గిపోయే స్త్రీల సొత్తు అనుకోవడం స్త్రీ జాతికి అవమానకరం.

సంఘంలో ఏ సాకుతోనైనా స్త్రీ పురుషులు విచ్చలవిడిగా తిరిగే అవకాశం లభిస్తే దుష్టశక్తులు విజృంభించే ప్రమాదం ఉందన్నారు. స్త్రీల ఉద్యోగ సమస్యను ఈవిధంగా కొందరు పురుషులు అర్థంచేసుకోడం శోచనీయం. విచ్చలవిడిగా తిరగాలనేవారికి ఎటువంటి పరిస్థితులలోనూ ఏవో సాకులు దొరుకుతూనే వుంటాయి. స్త్రీ ఉద్యోగసమస్యను ఇటువంటి సాకుగా అర్థంచేసుకునేవారికి చరిత్రే సమాధానమిస్తుంది. సమాజం అభ్యుదయానికి తలపెట్టిన ప్రతి కార్యక్రమానికీ ఇటువంటి అపార్థాలు తీసేవారు ఏనాడూ ఉన్నారు. కాని, వారి నిందలవల్ల అభ్యుదయం ఆగిపోదు.

స్త్రీ ఇల్లుదాటి ఆఫీసులో అడుగుపెట్టితే పిల్లలకు అన్యాయం జరిగిపోతుందని,



సమాజం అధోగతి పాలౌతుందని ఇటువంటి వాదాలు ఆదినుంచీ సంస్కరణోద్యమాలలో వినవస్తూనే వున్నాయి పిల్లల పెంపకం అంటే అన్నం వండి పెట్టి నీళ్లుపోసి పడుకోబెట్టడంతో అయిపోదు. అందరూ శివాజీ వంటి మహానాయకుల తల్లులనుగురించి ప్రశంసిస్తారు అటువంటి సంస్కారం మన సమాజంలో తల్లులకుకూడా ఈ నాడు లభించాలంటే సమాజాభ్యుదయంలో స్త్రీలు పూర్తిగా పాల్గొనడం అవసరం స్త్రీలు ఉద్యోగాలు చెయ్యడం అభ్యుదయానికి ప్రతిబంధకం కాదు సరికదా పిల్లల మానసిక వికాసానికి ఎంతో తోడ్పడుతుంది

సృష్టిలో స్త్రీ పురుషుల మధ్య సహకార సమన్వయం వుందికాని పోటీప్రవృత్తులు లేవని ఇదో సృష్టిరహస్యం అన్నట్లు చెప్పారు ఇటువంటి సృష్టిరహస్యాలు మానవ నిర్మితాలు. సహకారం సమన్వయం స్త్రీ పురుషుల మధ్యనేకాదు సంఘంలో అన్ని వర్గాలమధ్య అందరిమధ్యా అవసరమే. సహకారం, పోటీ అనేవి వెలుగు నీడల్లాగా సమాజంలో ఎప్పుడూ వెంటవెంటనే ఉంటాయి. సమాజ జీవనంలో ఎవరికీ అపకారం జరగనిరీతినే నియమాలుండాలి సమాజ క్షేమానికి మించిన రీతి నీతు లుండరాదు పోటీ సహకారం అనేవికూడా ఇందుకు లోబడినవే పోటీ అనేది ఉద్యోగాల సందర్భంలో పురుషులమధ్య ఒకటీ స్త్రీపురుషులమధ్య ఒకటీ కాదు. అప్పటప్పటి సామాజిక పరిస్థితుల్నిబట్టి ఇటువంటి నియమాలు ఏర్పడుతున్నాయి నేటి సమస్యా స్వరూపమే పరిష్కార మార్గానికి సూచన.

## శ్రీ పాద గాయత్రి గారు (మద్రాసు) యిలా వ్రాస్తున్నారు

"పురుషులకి మన విషయంలో విశాల దృక్పథం లేదనే అనుకుందాము ఐతే వారికంటె నైతికంగా బలవంతులనుయిన మనం చెయ్యవలసిన పనేమిటి? వారి దృక్పథాలలో మార్పు రావాలంటూ వారిని దుయ్యబట్టడమేనా? వారి అపోహాలని పోగొట్టవలసిన బాధ్యత మనమీద లేదూ? వనితాలోకం పురుషులమీద కసితీర్చుకోవటానికి ఏర్పడలేదని రచయితలు దృష్టి ఉంచుకుని వ్రాస్తే బాగుంటుం దనుకుంటాను.. 'తన ప్రవర్తనలో మార్పు తెచ్చే పరిస్థితులనీ, సంసారంపట్ల తన బాధ్యతకు అడ్డువచ్చే అన్ని పరిస్థితులనీ తెలివిగా ఎదుర్కొని నలుగురిలో మంచిపేరు తెచ్చుకోవలసిన బాధ్యత స్త్రీ పైన వుంది' అని అతి ముఖ్యమైన సమస్యని ఉషారాణిగారు ఒక్క వాక్యంలో తేల్చేసేరు. ఆ సమస్యలేమిటో, వాటిని ఎలా ఎదుర్కోవాలో చెప్పవలసిన బాధ్యత మీ మీదా, అనుభవజ్ఞులైన స్త్రీ పాఠకుల మీదా వుంది "

—'పురుషులకంటె నైతికంగా బలవంతులయిన' స్త్రీలు కేవలం పురుషులని దుయ్యబట్ట కసితీర్చుకునీ వారి అపోహాలని పోగొట్టటానికి ప్రయత్నించటం అవివేకమే. స్త్రీలు ఎదుర్కొనే సమస్యలని పేర్కొంటూ కొందరు పురుషులకి విశాల దృక్పథం ఏర్పడితే స్త్రీల చిక్కులు ఎలా తొలగిపోతాయో వివరించా నంతే. వారి అపోహాలు పోగొట్టే బాధ్యత మనమీద ఎంత వున్నా, సాంఘిక జీవితంలోనూ, వాతా



పొద్దున్నే పొలానికి

—ఫొటో: వి. ప్రమోదకుమార్, తణుకు.

# స్త్రీలు - ఉద్యోగాలు

వరణంలోనూ మార్పు వస్తేగానీ అవి అంత సులభంగా తొలగిపోవు. ప్రతివ్యక్తికీ ఎదురయే సమస్యలని స్వశక్తితోగానీ, స్వానుభవంతోగానీ యితరుల సలహాతోగానీ అప్పటి పరిస్థితినిబట్టి తెలివిగా పరిష్కరించుకోవాలి. ఆసమస్యలేమిటో, అవి ఎప్పుడు కలుగుతాయో వాటిని ఎలా పరిష్కరించాలో సూత్రాలకింద చెప్పటం ఎటా సాధ్యపడుతుంది?

### సి. రామలక్ష్మిగారు (నంద్యాల) యిలా వ్రాస్తున్నారు:

"...స్త్రీలు ఉద్యోగాలకి అనర్హులు అనను కాని వారు ఉద్యోగాలు ఎందుకు చెయ్యాలనేదే నా ప్రశ్న. మగాళ్ళకే ఉద్యోగాలు దొరక్కుండావుంటే, ఉన్న కొద్ది ఖాళీలకు స్త్రీలు ఎందుకు పోటీ కెళ్ళాలి? నిజంగా ఉద్యోగాలు చేయడం పెళ్ళికాని ఆడాళ్ళకు పెళ్ళికి అర్హతలేని స్త్రీలకు మాత్రమే సబబైనది..."

—మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీలు ఉద్యోగాలుచేస్తే వారి ఆర్థిక చిక్కులని చాలామటుకు పరిష్కరించుకునేఅవకాశం కలుగుతుంది. స్త్రీలు ఉద్యోగాలుచేస్తే పురుషుల నిరుద్యోగసమస్య ఎక్కువవుతుందనటములో అర్థములేదు. ఈ రోజుల్లో ఎం. ఏలూ, బి. ఏలూ చదివిన యువకులకి ఉద్యోగాలు దొరక్కపోవటానికి కారణం స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటమేనా? పురుషులతో పోటీ లేకుండా స్త్రీలు చెయ్యదగిన ఉద్యోగాలూ అనేకం వున్నాయి. ఉద్యోగాలు చెయ్యటం పెళ్ళికాని ఆడాళ్లకు పెళ్ళికి అర్హతలేని స్త్రీలకే సబబన్నారు. వివాహానికీ, ఉద్యోగానికీ అనవసరంగా ముడిపెట్టి – ఉద్యోగంచేస్తే వివాహం మానెయ్యాలనీ, వివాహం చేసుకుంటే ఉద్యోగం మానెయ్యాలనే వాదనతో నేను ఏకీభవించను. వివాహితలయిన స్త్రీలకి ఉద్యోగాలుచేసే అవకాశాలు తక్కువంటే ఇంకా బాగుంటుందేమో. వివాహమయినా కాకపోయినా స్వతంత్ర ఆర్జన అనేది స్త్రీకి ఎప్పటికయినా ఉపకరిస్తుంది; కొన్ని సమయాలలో తప్పక అవసరమవుతుంది కూడా.

### దంతులూరి సుభద్రగారు (అమనాం) యిలా వ్రాస్తున్నారు.

"స్త్రీ చదువు పూర్తియైన పిమ్మట వివాహప్రసక్తి తీసుకురాకుండా ఉద్యోగంలో ప్రవేశించి, కట్నం లేకుండా కాలంలో పెళ్ళిళ్ళు జరగటం అసంభవం గనుక కాబోయే పెళ్లికి వరునకు యివ్వబోయే కట్నం నిమిత్తం తగిన ధనం సంపాదించవచ్చును. ఈ విధంగా వివాహసమస్య తీరిపోతుంది. కనుక స్త్రీలు వివాహమయ్యేవరకూ ఉద్యోగాలు నిర్వహించవచ్చునని నా అభిప్రాయం..."

—కట్నం సమస్య పరిష్కరించటానికీ వరునికి యివ్వవలసిన ధనం కూడబెట్టటానికీ స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలంటే నాకెంతో విచారంగావుంది. చదువుకున్న స్త్రీలకి, అసలు వివాహానికి పూర్వం ఉద్యోగం చెయ్యవలసిన అవసరమంటూ కుటుంబానికి కొంత సహాయం చెయ్యటానికో లేక స్వతంత్రంగా బ్రతకటానికో కలుగుతూంటుంది. అలా గాకుండా ఏ చదువుకున్న స్త్రీగూడా సంపాయించిన డబ్బు గాచుకుని రాబోయే వరుడికి ముడుపు చెల్లిస్తానంటూ నోట్లు లెక్కపెట్టుకుంటూ కూర్చుంటుందంటే నేను నమ్మను. స్వతంత్రజీవనోపాధి కల్పించుకుని తలితండ్రులకి కొంతభారం తగ్గించడం పోయి, కేవలం కట్నం సమస్యను ఎదుర్కొవటానికి స్త్రీలుఉద్యోగాలు చెయ్యవచ్చుననటం అంత న్యాయంగా కనుపించటంలేదు వివాహమయేవరకూ సంపాయించిన డబ్బుని కట్నంకోసం కూడబెట్టాలంటే ఆమె ఎంతకాలం వేచివుండాలంటారు? పోనీ ఆ డబ్బుని వరుడి చేతిలో పోసి తన చేతులు దులుపుకుని వివాహానంతరం ఉద్యోగం మానేస్తే, ఆ పురుషుడిమీద ఆమెకి ఎంత గౌరవం వుంటుంది?

### వి. పద్మావతిగారు (తెనాలి) యిలా వ్రాస్తున్నారు:

"...ధనవంతులు కేవలం వేడుకకోసం చదువుతారు గనుక వారి ప్రసక్తి అవసరం లేదనటంలో పొరపడ్డారని నా అభిప్రాయం. అనుమానాలతో అపోహలతో నిండివున్న స్త్రీల ఉద్యోగాల సమస్యలో ధనికవర్గానికి చెందిన యువతులు ముందడుగు వెయ్యాలి. వారు తక్కినవారికి మార్గదర్శకులు కావాలి..."

—ఆర్థికస్తోమతు వున్న స్త్రీలు మనకు ఏవిధంగా మార్గదర్శకులయి తోడ్పడగలరో నాకు బోధపడటంలేదు. అవసరమూ అవకాశమూ వున్న మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీలే కొంతమంది జంకుతున్నప్పుడు ధనికవర్గానికి చెందిన స్త్రీలని ఉద్యోగాలు చెయ్యమనటం అన్యాయమేమో! వారిలోనూ సరదాకోసం ఉద్యోగాలు చేసేవారు లేకపోలేదు. కాని ఈ సమస్య మధ్యతరగతి కుటుంబీకులకే ఎక్కువగనుక, ధనికవర్గానికి చెందిన స్త్రీలసంగతి మనం వదిలిపెట్టేద్దాము.

### శ్రీ ఎ. వి. సూర్యనారాయణగారు (అనకాపల్లి) యిలా వ్రాస్తున్నారు:

"...స్త్రీలు తమ చదువును తెలివితేటలను సామర్థ్యాన్ని వినియోగపరచుకోడానికి ఉద్యోగం చెయ్యటం ఒక మార్గం. ఇంటినీ, పిల్లలనీ విడవకుండా స్త్రీలు మగవారికి ఆర్థికంగా సహాయపడుతూ తమ కాలాన్ని కూడా సద్వినియోగపరచుకోవచ్చు. అటువంటివారు ఏదైనా గృహపరిశ్రమ చేసుకుంటే బాగా వుంటుంది. గృహపరిశ్రమ అనగానే నూలు వడకటం బట్టలు నేయటం మొదలైనవి మనకు గుర్తుకువస్తాయి కాని ఇవిగాక ఎన్నో గృహపరిశ్రమలు వున్నాయి. అందులో ముఖ్యమైనవి (1) ప్లాస్టిక్ ఆటవస్తువులు (2) ఫౌంటెన్ పెన్నులు (3) సిరాలు పౌడర్ వగైరాలు తయారుచేయుట మొదలైనవి. ప్రస్తుతం ప్లాస్టిక్ మెషీన్లు చాలా తక్కువ ధరలకు దొరుకుతున్నాయి. విద్యుచ్ఛక్తి వున్న యిళ్ళలో అటువంటి మెషీన్లు పెట్టుకుని స్వతంత్రంగా జీవించడానికి ఎన్నో అవకాశాలున్నాయి. ఉద్యోగ సమస్య మధ్యతరగతి వారిదే. ఈ తరగతి స్త్రీలలో చదువుకున్నవారికైనా ఉద్యోగాలు చెయ్యడానికి చాలా ప్రతిబంధకాలలున్నాయి. ముఖ్యంగా సంప్రదాయానూ, కట్టుబాట్లనూ వీరు అతిక్రమించలేరు..."

—పెద్ద చదువులకి అవకాశం లేని స్త్రీలకూ, పిల్లలను ఒక్కక్షణం విడిచి వుండడానికి వీలులేని స్త్రీలకూ, మీరు సూచించిన గృహపరిశ్రమలు ఎంతో ఉపకరిస్తాయి. ప్రతిబంధకాలూ కట్టుబాట్లూ వున్నమాట నిజమే. మొదట్లో స్త్రీ విద్యకి వితంతువివాహానికి ఈ కట్టుబాట్లూ సాంప్రదాయాలూ అడ్డురాకపోలేదు! కాలక్రమాన అవసరాన్నిబట్టీ, సాంఘిక జీవితంలో మార్పులనుబట్టీ ఈ ప్రతిబంధకాలూ తొలగిపోతున్నాయి.



## బి. యస్. దేవిగారు
## (మద్రాసు)

స్త్రీలు-ఉద్యోగాలు అన్న శీర్షికలో కుమారి ఉషారాణిగారు వ్రాసిన వ్యాసం చూచి చాల సంతోషించాను. నేను ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్నాను కాబట్టి అందులో కష్టసుఖములు నాకు కొన్ని తెలుసు.

ఉషారాణిగారికి స్త్రీలందరూ ఉద్యోగం చెయ్యగలరా లేదా అన్న సందేహం ఉన్నట్లుంది. నేటి పరిస్థితులనుబట్టి ఆ సందేహం అందరికీ కలుగుతుంది. అయితే ఏపరిస్థితుల్లో ఉన్నా కొందరు కొందరు స్త్రీలు ఉద్యోగం చెయ్యడం తప్పకుండా అవసరమౌతుంది. సామాన్య సంసారాల్లో ఉన్న స్త్రీలకు అంటే గృహయజమాని భార్య కావచ్చు, కుమార్తె కావచ్చు, సోదరి కావచ్చు. తరుచు ఉద్యోగాలు చెయ్యవలసిన అవసరం వస్తోంది. మాటవరసకి ఒక గృహయజమానికి పదిమంది పిల్లలున్నారనుకోండి. అందులో ఆడపిల్లల సంఖ్య ఎక్కువనుకోండి. యజమాని సంపాదనవల్ల ఆ కుటుంబపోషణ జరగడం కష్టం. ఈ రోజుల్లో ఎంత లేనివాడైనా తన పిల్లలకు స్కూలుఫైనలుదాకా చదువు చెప్పిస్తున్నాడు. స్కూలుఫైనలు పాసయినవాళ్లు గుమాస్తాపని లేక టైపురైటింగు నేర్చుకుని ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంకా నర్సులుగాను టెలిఫోను ఆపరేటర్సుగాను పని చేస్తున్నారు. అవసరం ఎంత ఉన్నా చాలమంది ఉద్యోగాలు చెయ్యడానికి జంకుతున్నారు. కాని క్రమంగా పై ఉద్యోగాలు చేసేవారి సంఖ్య పెరుగుతోంది. క్రమంగా చదువుకున్న ఆడపిల్లలు కొంతకాలమైనా ఉద్యోగం చెయ్యడం అనేది అలవాటై సామాన్య విషయమైపోతోందని నా నమ్మకం. చిన్నతనంలోనూ లేక ఇద్దరు ముగ్గురు బిడ్డలు పుట్టిన తరవాతనూ భర్తలను పోగొట్టుకున్న స్త్రీలు అనేకమంది ఉన్నారు. వీరిలో చాలమంది భర్త గడించిన ఆస్తి పెట్టుకుని కాలక్షేపం చేస్తున్నవారున్నారు. కొందరు పిల్లలతోసహా తండ్రి పంచనిగాని అన్నదమ్ముల పంచనిగాని చేరుకుంటున్నారు. వాళ్లు పడే కష్టాలు వర్ణించతరంకాదు. ఇటువంటి స్త్రీలు తప్పకుండా ఉద్యోగం చెయ్యాలని నా ఉద్దేశం. ఒకవేళ వాళ్లకు చదువు లేకపోయినట్లయితే వృత్తులైనా నేర్పడం అవసరం.

పిల్లలు లేనివారు లేదా కొంచెం జ్ఞానం వచ్చిన పిల్లలుగల తల్లులు సులువుగా ఉద్యోగంచేసి తమ సంసారాల ఆర్థిక పరిస్థితులను చక్కబెట్టుకోగలరు. పిల్లలులేని దంపతులకు బహుశా పురుషుని సంపాదనే సరిపోవచ్చు. ఆ స్త్రీ ఉద్యోగం చేసినా చెయ్యవచ్చు మానినా మానవచ్చు. నాకు తెలిసిన కుటుంబం ఒకటి ఉంది. భార్యాభర్త లిద్దరు ఉద్యోగం చేస్తున్నారు. వాళ్లకి ముగ్గురు ఆడపిల్లలు ఒక మగపిల్లవాడు. పిల్లలు నలుగురు చదువుకుంటున్నారు. భార్యాభర్త లిద్దరు నెల మొత్తంమీద మూడు వందలు సంపాదించుకుంటున్నారు. ఏ లోపం లేకుండా సంసారం గడచిపోతోంది. ఇప్పుడు పిల్లవాళ్లు కొంచెం పెద్దవాళ్ళు అయేరు కాబట్టి తల్లికి వాళ్ళపూచీ అంత లేదు. ఆ ఇల్లాలు స్కూలుకి వెళ్లే ముందు వంటచేసుకుని తిని వెళుతుంది. సాయంత్రం ఎవరు ముందు ఇంటికి వస్తే వాళ్లే వంట ప్రారంభిస్తారు. ఆవిడకు కడగొట్టు బిడ్డ ఆరుసంవత్సరాలవాడూ కాబట్టి పిల్లల చికాకులు లేకుండా ఉద్యోగం చేస్తున్నాది. అయితే వాళ్లు పసిపిల్లలుగా ఉన్నప్పుడు ఆమె ఏంచేసింది అని అడగవచ్చు. ఆ ఇల్లాలు అప్పుడు చాలా అవస్థలుపడ్డది. పిల్లలూ చాల కష్టాలు పడ్డారు. ఆ ఇల్లాలు ఉపాధ్యాయినిగా ఉన్నది కాబట్టి అంత మరీ కష్టమైనపని ఉండేదికాదు. నవమాసమ్ముకం

సాలు వచ్చేవరకు ఏలాగో పనిచేసేది. కా
పుకి సెలవుపెట్టేది. ఎప్పుడూ పిల్లలకోసం
స్కూలుకి దగ్గరగా ఇల్లుతీసుకుని ఉండేది
ఆ భార్యాభర్తలకు బదిలీలు అదిలీలు లేవు
కాబట్టి ఆమె ఇప్పటిదాకా ఉద్యోగం
చేయగలిగింది. తల్లీపిల్లలూ కొన్నాళ్ళు
అవస్థలుపడ్డారు. పడితేం క్రమంగా వాళ్లే
అలవాటయినారు. తల్లీ తండ్రీ ఇద్దరూ
సంపాదిస్తున్నందువల్ల పిల్లలను తల్లిదండ్రు
లను దారిద్ర్యబాధ అంతగా పీడించలేదు;
పిల్లలపోషణలో గాని చదువులో గాని లోటు
రాలేదు. పిల్లల్ని ఎలా సంరక్షించడమా అని
బెంగపెట్టుకుని ఆతల్లి ఉద్యోగం మానివేసిం
దనుకోండి—అప్పు డేమయేది? పిల్లల
చదువులు చెప్పించే స్తోమతుకూడా ఉండేది
కాదు మొదట తల్లీ పిల్లలూ కష్టాలుపడి
తట్టుకోగలిగారు కాబట్టి ఇప్పుడు పిల్లలు
ఎంతదూరం చదివినా భరించగలుగుతు
న్నారు. క్రమంగా తల్లులుగూడా ఉద్యో
గాలు చెయ్యడంమన దేశంలో అలవాటయితే
చాలా సంకోచాలు తీరిపోయి సమస్యలు
వాటంతటవే పరిష్కారమౌతాయని నా







వనితాలోకం సీరియల్



# స్వయంసిద్ధ



సం ప్రపంచుడైన 'బాగులీ' జమీందారు హరినారాయణ గంగూలీ, ుర్వేద వైద్యుడైన కరాలీ చటర్జీగారి ర్ని - త్రాచులాంటి పిల్ల అయిన సిని చూడటానికి వచ్చాడు - ఈ ర్త పొక్కగానే శ్యామాపురంలో పెద్ద డి బయలుదేరింది. అంత అలజడికి ణాలు కూడా లేకపోలేదు.

శ్యామాపురం సంపత్సమృద్ధమైన గ్రామం. ంతా హరినారాయణబాబు ఏలుబడి ి పరగణా అతడు ఉత్త పేరుకి ందారు కాడు; ఇన్ని శాసనాలూ, పారస్వత్వాలూ ఉన్న ఈ రోజుల్లో డా ఆయనవిషయమై ప్రజలు పెదవి ప్పటానికి వీల్లేనంత ఉద్ధతుడు. అతడి నా తిక్క రేగినా, సంకల్పం కలిగినా అతడిమనస్సు మరల్చటం మన కాదు. హరినారాయణబాబు నోటి డి వచ్చిన మాటకి హరిహరాదులు దిగి నా తిరుగులేదు. ఈ గంగూలీవంశ తిపత్తీ, ప్రాభవం, ఐశ్వర్యం అన్నీ రాజుల ఛాయాలోవి. ఈ ప్రాంతాల్లో వాళ్ళ దగ్గిర్నుంచి - పండు ముదుసలుల ు ఎవరైనాసరే - ఆ జమీందారు పేరు తే భయంతో గజగజలాడటమే కాదు, తో తల వంచుతారు.

కరాలీ చటర్జీ పిల్లలుగలవాడు. ప్పకో - పుచ్చాకో మాత్రలు కట్టిఇస్తూ నిమీద వచ్చే సంపాదనతో అతడు లామందిని పోషించాలి. సజ్జనుడు, ధర్మనిరతుడు, ఆడితప్పనివాడూ అని సుప్రతిష్ఠ లున్నవాడు. కేవలం అతని డి సంపాదనతోనే సంసారం గడవాలి. దారిద్ర్యపిశాచం అతడి దరిదాపులకైనా రాకూడదు. అప్పు అన్నమచ్చ అతడికంట కూడదు. అతడి సహధర్మచారిణి బహు దొడ్డ గృహిణి. సంసార నౌకకి చుక్కాని పట్టగల నేర్పుకలదే కాకుండా - అందులో ఉన్న సులువు-బలువులు ఆకళించుకున్న ఇల్లాలామె. అంచేత చటర్జీ సాంసారిక విషయాల్లో చాలా సుఖవంతు డనటంలో విరోధులకి కూడా విప్రతిపత్తి లేదు.

ఈ సుఖ సంసారంలో ప్రస్తుతం గడ్డు సమస్యగా పరిణమించింది అతడి పెద్ద కూతురు - పెళ్ళికాని పిల్ల - చిరంజీవిని చండి...

ఎటొచ్చీ చండికి శ్యామాపురంతోనూ, తల్లిదండ్రులతోనూ సన్నిహిత సంబంధం ఏర్పడ్డం ఈమధ్యనుంచే. అంతకుముందు - అంటే చండి అయిదేళ్ళ పిల్లగా ఉన్నప్పుడు ఆమె మాతామహుడు కూతుర్నీ అల్లుణ్ణీ చూసిపోదామని శ్యామాపురం వచ్చాడు. ఆయ నప్పుడు పంజాబ్‌లోని ఓ ప్రసిద్ధ విద్యాలయంలో వ్యాయామ శిక్షకుడుగా పనిచేస్తూ ఉండేవాడు. అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. మనుమరాలిని చూసి, ఆ కుర్రదాని తెలివితేటలకి ముచ్చటపడి, "ఇది నాకు చాలా నచ్చిన పిల్ల. దీన్ని నేను నావెంట తీసుకెళ్ళి, పెంచి పెద్దదాన్ని చేసి, పది వస్నెం డేళ్ళు పోయాక మళ్లీ పంపిస్తాను. అప్పుడు మీరు దీన్ని చూసి నిజంగా ఆశ్చర్యపోవాల్సిందే - నాతో పంపించు" అని అడిగాడు అల్లుణ్ణీ.

మామగారి మాటను అల్లుడు మన్నించకుండా ఉండలేకపోయాడు. చండిని అతడికి అప్పగించాడు. ఆ వ్యాయామ ప్రవీణుడు ఆ పిల్లను తనతో పంజాబ్ తీసుకెళ్లి, తన అభిరుచుల కనుగుణంగా ఆమెను అన్ని విద్యలలోనూ పరిపూర్ణురాలిని చెయ్యటానికి కొంత ప్రయాసపడ్డాడు.

వీరేంద్రనాథుడు కేవలం వ్యాయామప్రవీణుడైన వస్తాదే కాదు; బహుభాషా కోవిదుడు కూడా. అనేక దేశాల ప్రసిద్ధ రచయితల గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివినవాడు. హిందూ ధర్మశాస్త్రాలన్నా, పురాణాలన్నా, సనాతన ధర్మమన్నా చెవి కోసుకునేవాడు. చండికి చక్కని శిక్షణనిచ్చి, విద్యావంతురాలినిగా తయారు చేసినట్లే, ఆరోగ్యానికి సంబంధించిన విధినియమాలను కూడా బోధించి, ఆమెని మంచి ఆరోగ్యవతినిగాకూడా చేశాడు. పంజాబ్‌లోని నైసర్గిక వాతావరణమూ, వ్యాయామ ప్రవీణుని శిక్షానైపుణ్యమూ, పట్టుదలతో కూడిన శిష్యురాలిసాధనా అన్నీ సార్థకమయాయే కాని, ఏదీ వ్యర్థం కాలేదు.

ఇంతలో వీరేంద్రనాథు డిహలోక యాత్ర చాలించి హఠాత్తుగా పరలోకానికి వెళ్లిపోయాడు. చండి కప్పటికి బాల్యావస్థ గడిచింది. ఆమె అవయవాలు యౌవనంతో వికసించసాగాయి. పరిపూర్ణమైన యౌవనం, సంపూర్ణమైన ఆరోగ్యం ఈ రెండింటి ఐక్యతతో ఆమె సౌందర్యం అనవద్యమైన దయింది...

తాతగారు పోగానే చండితండ్రిదగ్గరికి - శ్యామాపురానికి - తిరిగి రావాల్సివచ్చింది. కాని ఇక్కడి వాతావరణం ఆమెకి పసితనంనుంచి అలవాటైన అభిరుచులకి అడుగడుగునా అవరోధాలు కల్పిస్తున్నట్లు తోచసాగింది. ఆమె ఆహార - విహారాలు,

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ      అనువాదం : మద్దిపట్ల సూరి

ఆచార వ్యవహారాలు, ఒకటేమిటి అన్నీ ఆమెయొక్క ఆడపిల్లలందరికీ అతివింతగానూ, కొత్తగానూ కన్పించసాగాయి. తానెలాంటి అదుపాజ్ఞల్లో పెరిగిందో - అలాగే ఇక్కడి ఆడపిల్లలంతా పెరిగినట్లయితే ఎంతో బావుండేదికదా అని అనుకునేది చండి. ఆమె అలాంటి అభిప్రాయాలు వెల్లడి చేస్తున్నప్పుడల్లా ఇక్కడి ఆడపిల్లలు పొట్టలు చెక్కలయ్యేట్లు నవ్వేవాళ్ళు... "వ్యాయామం మగవాళ్లు చేస్తారు కాని ఆడవాళ్ళెక్కడైనా వాళ్లలాగా దస్తీలుపట్టీ, దండాలుతీసి, నెత్తిన బరువు లెత్తుకుని గంతులేస్తారా? ఛీ. ఛీ..." అనేవాళ్ళు.

ఇలాంటి పరిస్థితుల్లో ఆ మాటమీద - ఆ మాటమీద ఎప్పుడైనా తగాదా వచ్చిందంటే మాత్రం ఇరుగు పొరుగు ఆడవాళ్లు ఎంత ఇరకాటంలో పడేవాళ్ళో చెప్పటానికి వీల్లేదు. చండి నదురూ - బెదురూ లేకుండా - ఏదో మెలిక తిరుగుడు పెట్టి ఒక్క క్షణంలో వాళ్లని ఉక్కిరి బిక్కిరయ్యేట్లు చేసేది. తన యీడుపిల్లలనైనా, తనకంటె పెద్దవాళ్ళనయినా, రెండు చేతుల్లో చులాగ్గా పైకి ఎత్తేసి, వాళ్లని 'కుయ్యో' మనిపించేది. పైగా నవ్వుతూ "నేను మీలాగా నోరు మెదపలేకపోయినా, మీకంటె సులువుగా చేతుల్ని మాత్రం కదపగలను. కనుక మీరు నాతో పేచీలు పెట్టుకున్నారంటే చెడ్డచిక్కు" అనేది.

చండితో ఎవరైనా స్నేహం చేసుకుందామని వచ్చినా, ఆమె మాటలతీరు వాళ్ళని విస్తుపోయేట్లు చేసి, - దరికి చేరనిచ్చేదికాదు. సాధారణంగా పల్లెటి దిక్కున ఆడవాళ్లకి భయసంకోచాలు కలిగించేవన్నీ చండికి తృణప్రాయంగా కన్పించేవి. 'నీకు భయమనేది లేదా?' అని ఒకవేళ ఎవరైనా అడిగితే-'ఒంట్లో బలమనేదివుంటే-భయాలూ-గియాలూ మన చాయలకి రమ్మన్నా రావు' అనేది.

ఇరుగుపొరుగున చండిని గురించి ఇవా ఎంత చర్చ బయలుదేరేదో చెప్పలేం. ముసలివాళ్ళు మూతులు విరుచుకుంటూ "చటర్జీ కూతుర్ని చివరికిట్లా తయారుచేశాడేమిటే! ఇదెక్కడో గడేకారిలాగుంది. దీన్నెలా వదిలించుకుంటాడే మాయమ్మ!" అనుకునేవాళ్ళు.

నదురూ-బెదురూ లేని కూతురి ప్రవర్తన చివరికి తలిదండ్రుల మనస్సుల్లో కూడా కొంత భయాన్ని కలిగించింది. ఈడొచ్చిన పిల్ల, అందులోనూ రేపో - మాపో పరాయి ఇంటికి వెళ్ళి కాపురం చెయ్యాల్సిన పిల్లకి ఇంత జంకూ - గొంకూ లేకపోవటమనేది మంచిది కాదు. చండి ఇక్కడికి వచ్చి ఇంకా ఏడాదయినా తిరగకముందే ఆమెనిగురించిన వదంతులు ఊరంతా పాకిపోయాయి.

ఆమెనిగురించి అపప్రచారం ఎంతైనా జరిగింది. కాని నిజానికి నైతికంగా ఆమెలో తప్పు పట్టాల్సిన అపరాధం లవలేశమైనా కన్పించేదికాదు. యోగ్యుడైన గురువుదగ్గర ఆమె విద్యాశిక్షణ, ఆరోగ్యరక్షణమాత్రమే కాదు నేర్చుకున్నది - ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటంకూడా అలవరుచుకుంది.

అయినా చండి ఇరుగుపొరుగువారి మెప్పను ఈషణ్మాత్రమైనా సంపాయించలేకపోయింది. ఆమె బాగా ఆచి-తూచి ఆలోచించి చేసిన పనిలోనే ఎదటివాళ్లు తప్పుపట్టటానికి ప్రయత్నించేవాళ్ళు. నిరుపేదలైన వెనుకబడిన కులాల ఆడవాళ్లు కొందరు ఈప్రాంతాల్లో పండిన కూరగాయలు మొదలైనవి ఇంటింటికీ తిరిగి అమ్ముకుంటూ ఉండేవాళ్ళు. అదే వాళ్లకి జీవనాధారమైన వృత్తి. కాని ఇప్పుడు ఎక్కడినుంచో వచ్చిన హిందూస్తానీవాళ్ళు పట్నాల్లో దిగుమతిఅయ్యే విదేశీకూరగాయల్ని వాటినీ బళ్ళమీద తెచ్చి అమ్మటం మొదలెట్టారు. పాపం నిరాధారులైన ఈ దరిద్రుల నోటి ముందు కూడు పడిపోయింది. ఆపల్లీయులకీ విషయం పట్టినట్లేలేదు. వాళ్లు ఇతర దేశాలనుంచి దిగుమతి అయ్యే నకిలీ సరుకును, చౌక పారువస్తువుల్ని కొనటానికి అలవాటుపడి, ఈ పల్లెసీమని పండే పదార్థాలమీది మమకారాన్ని తేలిగ్గా త్రోసి పుచ్చుకున్నారు. దీన్ని చండి సహించలేకపోయింది. ఈ విషయంలో ఇతరుల సానుభూతి - సహకారం అపేక్షించకుండానే ఆ వ్యాపారస్తుల్ని ఏదో తికమక పెట్టి మళ్ళీ ఈ పొలిమేరలో అడుగు పెట్టకుండా చేసింది. కాని ఇలా చేసినందుకు చండి ఆ చుట్టుపక్కల మరింత చెడ్డపేరు తెచ్చుకుంది.

పల్లెటూళ్ళలో స్త్రీ విద్యాప్రచారానికై ఫాదిరీల సౌజన్యంవల్ల ఆ ఊళ్ళోనూ ఒక మిషనరీ బాలికాపాఠశాల వెలిసింది. అభమూ శుభమూ తెలియని ఆడపిల్లలు ఆ స్కూల్లో చేరి, చదువుమాట యెలాఉన్నా క్రైస్తవ మతప్రచార గేయాలు కంఠస్థంచేస్తూ - హిందూ ధర్మాల్ని - హిందూ దేవతల్ని వికృతంగా వర్ణించే దురభ్యాసాలకు బాగా అలవాటుపడ్డారు.

కృష్ణకుమారి అనే ఒక యువతీలలామ కొత్తగా మతంపుచ్చుకుని, క్రీస్తుకుమారిగా మారి, ఈ విద్యాలయం భారంపైనవేసుకుని, ఈ ప్రాంతంలోని బాల బాలికల నందర్నీ అజ్ఞానాంధకారంలోనుంచి వెలుగులోకి తీసుకురావటానికై కిందా మీదా పడుతోంది. బాల బాలికల చదువు విషయమై ఆ పంతులమ్మ అంత శ్రద్ధవహించినా వహించకపోయినా, వాళ్లు చిరకాలంనుంచీ కొలుస్తున్న దేవతల్ని గురించి, ధర్మాన్ని గురించి, వాళ్ల లేతమనస్సుల్లో విషబీజాల్ని నాటటంలో మాత్రం ఆమె ప్రయత్నలోపమేమీ చెయ్యటంలేదు. ఈ చిరుత బాలికలు చిలకపలుకుల్లాగా నేర్చుకున్న ఆ గేయాలు పాడుతూంటే - వాటిల్లో హిందూమతాన్ని గురించి ఎంతో ఈసడింపు వ్యక్తమవుతూండేది. అయినా ఆ బాలికల సంరక్షకులు అదేమీ పట్టించుకోకుండా చిరునవ్వు నవ్వుకొని ఊరుకుంటూంటే - వాళ్ల దురభిమానాన్ని చండి సహించలేకపోయేది. "ఆ విద్యాలయానికి మీ పిల్లల్ని పంపకండి. వాళ్ల మనస్సుల్లో నాటబడిన విషబీజాలకి విషఫలితాలు తప్ప సత్ఫలితాలెన్నటికీ కలగవు" అని చండి సంరక్షకులతో వాదించి మరీ చెపుతూ ఉండేది.

కాని ఆమె మాట వినే దెవరు? పశ్చిమ దేశంలో ఎక్కడో అదుపాజ్ఞల్లేకుండా పెరిగిన ఓ సిగ్గు-శరం లేని పిల్ల వచ్చి, తానే మహా ఆదర్శం అయినట్లు ప్రతి విషయంలోనూ తగుదునమ్మా అని తలెత్తుకు నిలబడుతుందా! ఎలా సహించి ఊరుకుంటారు! ఆ బాలికల సంరక్షకులు ఆమె వాదనకి విసుగెత్తి చివరికి కోపంతో "అక్కడికి పంపకపోతే మరింక ఏ స్కూలుందని పంపమంటావ్, ఏళ్లొ నదానికి?" అంటూ కస్సుమనేవాళ్ళు.

"అక్కడికి పంపించి వాళ్ల బుర్రలు పాడుచేయటంకన్న ఇంట్లో కూచోపెట్టుకుని మామూలు పనీ - పాటలూ నేర్పుకోవటం లక్షరెట్లు నయం" అనేది చండి నిర్భయంగా.

ఒక పొరుగు ముసలమ్మ మూతి విరుచుకుంటూ, "అయితే ఇహ నేం? రాబోయే నీ మామగారిచేత ఈ ఊళ్ళో ఓ బడి పెట్టించు. నువ్వే ఉండొచ్చు పంతులమ్మగా" అని వెటకారం చేసేది.

తన ఉక్తులూ-యుక్తులూ ఇహ నేం లాభం లేదని చండి గ్రహించింది. కాని ఇంతమంది బాలికల లేతహృదయాలూ విషమయమై పోతున్నాయే! అని ఆమె మనస్సుకు పరితాపం కలగసాగింది. ఈ గ్రామాన్నంతనీ ఎలా ఈ అనాచారంనుంచి ఉద్ధరించటం! ఆమెకి ఉపాయమేమీ తోచలేదు. వాళ్లకి ఇందులోని కుత్సితమంతా





చా కి రే వు



—ఫొటో : వి. కుటుంబరావు, మద్రాసు.

# ★ స్వయంసిద్ధ ★

తెలిసేట్లు చెప్పాలని ప్రయత్నించేది. కాని ఆ ఆడపిల్లలంతా ఈమె మాటలకి ముఖం చాటుచేసుకుని నవ్వుకుంటూ ఉండేవాళ్లు. చివరికి మళ్ళీ అంతా ఏకమై చండికి శివ మెత్తేట్లు వెక్కిరింపుగా చూసి, మరో గేయం పాడుతూ అల్లరిచేసేవాళ్లు.

ఒకరోజున స్నానాల రేవులో ఇలాగే జరిగింది. చండి కూడా స్నానానికి వచ్చింది. అక్కడ చేరిన బాలికలంతా చెరువులో దిగి, చండిని మొహంమీద కొట్టినట్లుగా - ఆమెని ఏడ్పించాలని తాము బళ్లో నేర్చుకున్న గేయాన్ని పాడటం మొదలెట్టారు. కాని ఒక్కక్షణంలో వాళ్ల అల్లరంతా అణిగింది. చండి ఒక్కొక్క బాలికనే పట్టుకుని ఆ నీళ్లలో ముంచుతూ లేవతీస్తూ ఊపిరాడకుండా చేసింది. పాపం, ఒక్కరు కూడా ఆ రోజున ఆమె చేతుల్లోంచి తప్పించుకోలేకపోయారు.

ఆ బాలికల కిలాంటి శాస్తి చేసినందుకు ప్రతిఫలంగా వాళ్ల తల్లితండ్రులు చండిని గురించి ఎలాంటి వదంతులు ఊరంతా ప్రచారం చేశారో, వాటిని విని చండి మాత్రం నిర్లక్ష్యంగానే నవ్వి ఊరుకుంది; కాని ఆమె తలిదండ్రులు ఆ వదంతులు విని కాడిలి బేజారెత్తిపోయారు. "ఇది పల్లెటూరు. ఇక్కడ పదిమందితోనూ కలిసి మెలిసి అణకువగా ఉండక తప్పదు. పంజాబ్‌లో చలామణి అయిన నీ దురుసుతనం ఇక్కడ సాగదేమనుకున్నావో!" అని తల్లీ తండ్రీ ఘట్టిగా చెప్పారామెకి.

తల్లీ తండ్రీ వేసిన చీవాట్లని చండి తల [illegible] ది-'స్వధర్మే నిధనం శ్రేయః [illegible] బోధించిన అక్ష్యక్తి [illegible] వచ్చింది. ఖదాయికోసమని స్వధర్మాన్ని విడిచిపెట్టుకున్నవాళ్లు - లేదా పరిస్థితులకి తల వొగ్గి తమ ధర్మాన్ని మంట కలుపుకున్నవాళ్ళు - ఇలాంటి వాళ్ళకేనా మనం భయపడాల్సింది! పసిపిల్లల మనస్సుల్లో విద్య పేరంతో విషాన్ని ఎక్కించి, వారి స్వధర్మ విశ్వాసాన్ని కూకటివేళ్ళతో పెల్లగించటానికి ప్రయత్నించే వాళ్లకి మరింత భయపడనక్కర్లేదూ! పంజాబ్‌లో జరిగిన ఒక సంఘటన ఆమెకి గుర్తొచ్చింది. బాలికలకు చదువు నేర్పుతామనే మిషతో మిషనరీవాళ్లు ఒక పాఠశాలను స్థాపించబోతే అప్పుడక్కడంతో కల్లోలం బయలుదేరింది. కాని ఇక్కడో! ఈ విషయంలో ఇక్కడ ప్రతీకారానికి మార్గమూలేదు. అసలా ప్రయత్నమూ లేదు. ఇక్కడెవరికీ అలాంటి ఊహకూడా ఉన్నట్లులేదు. ఆమె కళ్ళు చెమ్మగిలాయి. దీర్ఘంగా నిట్టూర్చి, తాతగారిచ్చిన భగవద్గీతను తీసుకుని కూచుంది.

చండి ఎంతవరకు చదివింది అన్న సంగతి ఎవరికీ తెలియదు. ఒక పురస్కారం పాటు ఈమెని తనదగ్గర పెట్టుకుని ఆ తాతగారు - ఈ గారాబు మనుమరాలికి ఎలాంటి శిక్షణ ఇచ్చాడో అది తెలుసుకుందామనే ఆసక్తి నయినా ఆమె తలితండ్రులు ఎన్నడూ కనపరచలేదు. చండికూడా తన విద్యాప్రతిభ ఎంతటిదో ఎదుటివారు తెలుసుకునే అవకాశాన్ని ఎన్నడూ కలగనివ్వలేదు. ఈ విషయంలో ప్రస్తుతం ఇంకేమీ మాట్లాడకుండా, తన దారిని వెళ్ళిపోయి, తన విద్యాపటిమను తరచుకోవటం మొదలెట్టింది. ఆమె అలా తన గదిలోపల గడియ వేసుకుని కంటికి నిద్రలేకుండా ఎన్నో రాత్రులు గడిపిన దన్న సంగతికూడా ఎన్నాళ్ళో గుంభనగా ఉండలేదు. ఆ సంగతి ఎవరైనా అడిగినప్పుడు "భగవద్గీత చదువుకుంటున్నాను" అనేది సగర్వంగా.

గీత చదివినా ఆమె మనఃపరితాపం తీరలేదు. తర్వాత కొన్నాళ్లకి ఆ విద్యాలయ వార్షికోత్సవ సభ జరిగిన సందర్భంలో ఓ అఘాయిత్యపు పనిచేసింది. దాంతో ఆమె ఎంత ఉద్దండురాలైందీ చుట్టుపక్కల ఊళ్ళలో కూడా తెలిసిపోయింది.

ఆ సభకి చుట్టుపక్కల గ్రామాల స్త్రీలు కూడా ఆహ్వానింపబడ్డారు. తనకి ఆహ్వానం రావటంతో చండి కూడా వెళ్ళింది ఆ సభకి. సభా ప్రారంభంలో పంతులమ్మ మిస్ క్రీస్తుకుమారి హిందూస్త్రీల కుసంస్కారాన్ని గురించి గొప్ప ఉపన్యాసం మొదలెట్టింది. కుసంస్కారాలమీద ప్రారంభమైన ఉపన్యాసం పోనుపోను హిందూదేవతల దూషణలోకి దిగింది. కుసంస్కారాలతో కుళ్లిపోతున్న హిందువుల ఆరాధ్య దేవత అయిన కాళికాదేవి ప్రసక్తి తీసుకొచ్చింది ముందు. నగ్నశరీరం, అసహ్యకరమైన ఆకారం, రుధిరపానాసక్తి కలిగిన ఆ 'అసభ్య' దేవతమీదఆమె కోపంతో విరుచుకుపడింది. ఆసభలో కాళికాదేవి భక్తురాండ్రు లేకపోలేరు. పల్లెటూళ్ళ తగవులాటల్లో ప్రసిద్ధికెక్కిన మహిళలూ ఆ సభకి చాలామంది వచ్చారు. గృహకల్లోలాల్లో, ఇరుగు పొరుగు పోట్లాటల్లో వాళ్ళ కెంత ప్రతిభ యినా ఉండనీ - ఇలాంటి [illegible] సమావేశంలో తమ కెంత అగౌ[illegible] చర్చ బయలుదేరినా కూడా వస్తుత[illegible] వార్యమైన వారి వాగ్ధాటికి అప్పుడు[illegible] పక్షవాతం వచ్చినట్లయింది. వాళ్[illegible] ఈ స్వధర్మనిందను, విభిన్న జాతి స్త్రీ[illegible] దేవత నుద్దేశించి చేస్తున్న [illegible] చెవులు రిక్కించుకు విని, [illegible] కున్నారు. కొంతమంది ఈ సదస్[illegible] చండికేసి చూసి చాటుగానవ్వు[illegible] హాలాన్ని కూడా నిగ్రహించుకో[illegible]యారు. అది తక్కినవారు కనిపెట్టకపోలేదు.

చండి యింక సహించలేకపోయింది. సభలోనివారంతా త్రుళ్ళిపడేట్లు ఆమె చటుక్కున లేచి నిలబడి-"నేను తమ వాదాన్ని ఖండించగలను - కాస్త ఆగండి" అన్నది తీవ్రంగా.

ఒక్క నిమిషం సభంతా నిశ్శబ్దమయింది. అక్కడ ఉన్న విద్యార్థినులు, ఇతర

స్త్రీలు - అందరి చూపులూ ఒక్కసారి చండిమీద పడ్డాయి. పౌడరు పులుముకున్న క్రీస్తుకుమారిముఖం వివర్ణమయింది. ఆమె అతికటువుగా "నువ్వా. అసభ్య బాలికవు! నువ్వు నా 'స్పీచ్'కి అడ్డురావటానికి సాహసిస్తున్నావా?" అన్నది.

చండి ఏమాత్రం తొణక్కుండా "అ౯. కచ్చితంగా. తమరు మమ్మల్ని అందర్నీ ఇక్కడికి ఆహ్వానించి రప్పించి, చాలా అవమానం చేశారు. తమరు మా అందర్నీ క్షమాపణ వేడుకుంటే బావుంటుంది" అన్నది.

ఇప్పటివరకూ ఈ క్రీస్తుకుమారిని ఇంత మాటనటానికి సాహసించినవాళ్ళెవరూ లేరు. ఈ స్త్రీలందరి యెదుట - తన విద్యార్థినులందరియెదుట తనకు జరిగిన ఇంతటి అవమానాన్ని ఆమె ఎలా దిగమ్రింగి ఊరుకుంటుంది! అసంభవం! సభలో బయలుదేరిన గుసగుసలు ఆ పంతులమ్మని మరింత ఉద్రిక్తపరిచాయి. ఆమె ఆత్మగౌరవం కాపాడుకుందామనే తలంపుతో "నువ్వు ముందు నా ఎదుటికివచ్చి నిలబడు" అని తర్జనితో నిర్దేశిస్తూ చండిని పిలిచింది.

ఆమె చెప్పినట్లు చండి నదురూ బెదురూ లేకుండా పంతులమ్మ టేబిల్ దగ్గిరకి వచ్చి నిలబడేసరికి - అందరూ ఆశ్చర్యంతో గుడ్లప్పగించి చూడసాగారు. చండి మాత్రం నిర్వికారంగా అలాగే నిలబడి, కుతూహలం వెల్లివిరుస్తున్న చూపులతో ధుమధుమలాడుతున్న క్రీస్తుకుమారిముఖంకేసి చూస్తూ సమాధానాన్ని కోరింది.

పంతులమ్మ సహనం కోల్పోయింది. ఆమె ఇచ్చిన జవాబు అహంకారమూర్తిని అయిన ఆమెకి అనువైనదే. కాని దాంతో సభలో స్త్రీలంతా మాత్రం గజగజలాడిపోయారు. ఆమె టేబిల్ మీదికి వంగి, చండిని చాచి లెంపకాయకొట్టి, "నీ అసభ్యతకిదే తగిన సమాధానం" అన్నది.

ఆ మరుక్షణంలో జరిగిన సంఘటనతో అక్కడివారంతా పనుతూ లేస్తూ ఇంటిముఖం పట్టారు. దెబ్బ తగలటంతోటే చండి - ఒక చేత్తో ముందున్న టేబుల్‌ను వెనక్కి వెల్లకిలా పడేసింది. దాంతో ఆ టేబుల్ మీద ఉన్న అలారం గడియారం, సిరాబుడ్డి, బైబుల్ వాల్యూములు అన్నీ తల్లక్రిందులుగా పడిపోయాయి. క్రీస్తుకుమారి చేతుల్ని టేబుల్ మీద మోపి నుంచుని ఉంది. టేబుల్ మీదపడేసరికి ఆమె వెనక్కి పడిపోకుండా తప్పించుకోలేకపోయింది. దభేలున వెల్లకిలగా పడిపోయింది. 'అమ్మో!' అని ఆమె అరచిన అరుపు అందరికీ విన్పించింది.

ప్రక్కనే ఉన్న ఆ పాఠశాల పరిచారిక చటుక్కున వచ్చి మిస్సమ్మను పట్టుకుంది. సభంతా చెల్లాచెదరైంది. ఎవరికి వారు వెళ్లిపోదామనే తొందరలో ఉన్నా, ఈ ఆఖరి దృశ్యం పూర్తిగా చూసిపోదామనే ఆసక్తిమాత్రం అందరికీ ఉంది. పరిచారిక సహాయంతో పంతులమ్మ లేచి నిలబడగానే - ఆమె వికృతరూపం చూసేసరికి - అంత భయంభయంగా ఉన్న సమయంలో కూడా - అందరూ నవ్వకుండా ఉండలేకపోయారు. ఆ టేబుల్ మీది సిరాబుడ్డిలోని సిరా అంతా ఆ మిస్సమ్మ ముఖం నిండా, ఆమె కట్టుకున్న తెల్లచీరనిండా ఒలికి, ఎలా ఉండాలో అలా ఉంది ఆమె.

సిరా తొణకటంతో అసలు రూపం చెరిగిపోయిన మిస్సమ్మ ముఖంకేసి చూసి, చండి ఏమాత్రం తొణక్కుండా, "ఇది కాళీమాత చేసిన శాస్తి దొరసానమ్మా! ఆమె శక్తి తెలుసుకోలేక అనవసరంగా మీరామెను నిందించారు. దానికి తగినట్లు ఆమె తన అదృశ్యహస్తాలతో మీ ముఖానికి ఈ కాళి మసిపూసింది. ఇహముందైనా ఎప్పుడూ ఇలాంటి పనికి పూనుకోకండి" అన్నది.

ఈ సంఘటన చిలవలు - పలవలతో చుట్టుపక్క గ్రామాల్లో పాకిపోయింది. చండి చేసిన ఈ అన్యాయ కృత్యాన్ని - 'దేశీయ యువతి అయిన చండి వేష, భాష, మతాల్లో ఆంగ్లమానస పుత్రి అయిన పంతులమ్మతో వాదోపవాదాలు చెయ్యాలని వెళ్లి అఘాయిత్యం చేసింది. ఆమె దొంగచాటుగా టేబిల్ వెనక్కి ఎత్తేసి, పంతులమ్మకి శాస్తి చేసింది.' అన్నంతవరకు అందరూ ఒకేరకంగా చెప్పుకునేవాళ్లు. ఇది జరిగాక - చండి భవిష్యత్పరిణామం ఎలా ఉంటుందీ అనేది ఊళ్ళో అందరికీ అతి ముఖ్యవిషయమైపోయింది. ఈ విషయం చర్చించుకోవటం అందరికీ అవసరమైన పనిగా పరిణమించింది. ఆయుర్వేదాచార్యులు గారు ఈ అమ్మాయిని ఎలా వదిలించుకుంటాడు? ఇంత త్రాచులాంటి పిల్లను ఎవరు చేసుకోటానికి సిద్ధపడతారు? ఒక వేళ ఏ అయ్య చేతులోనో ఓ అయ్య చేతులో పెట్టినా మాత్రం - అత్తవారింటి కెళ్ళాక ఇంత 'అదరగండం పిల్ల' ఈ పిల్లేం సంసారం చేస్తుంది! ఊళ్లో ఆడవాళ్లు ఎక్కడ ఏ ఇద్దరు కలుసుకున్నా చండినిగురించే ఇలా ఏదో ఒకటి తర్కించుకుంటూ ఉండేవాళ్ళు. ఇలాంటి పరిస్థితుల్లో 'బాసలీ జమీందారు హరినారాయణబాబు చండిని చూడటానికి వచ్చా'డన్న వార్త తలవని తలంపుగా ఊరంతా పాక్కిపోయేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. ఆయనకి ఒక వేళ పిల్ల నచ్చిందంటే ఆ యింటికి పెద్దకోడలు కూడా అవుతుంది. కనుక అసలు చండిని ఎవరైనా చేసుకుంటారా? దానికేమైనా కన్నె చెర విముక్తి అంటూ ఉందా అని తర్జన భర్జనలతో కిందుమీదవుతున్న వారికీ వార్త ఊహాతీతంగా కన్పించింది. అంచేత ఈ ఆశ్చర్యకరమైన వార్త వాళ్లు మామూలుగా ఒకపట్టాన విశ్వసించలేరు. అంచేత ఈయన రావటంలో ఇంకేం నిగూఢమైన ఆంతర్యం ఉందో అని వాళ్లుమరింత కళవళపడటంలో అసహజం ఏముంది!

[సశేషం]




[సుందరమ్మగారింట్లో ఒకహాలు. హాల్లో సుందరమ్మగారి కూతుళ్లు రాధ, మీనాక్షి.]

రాధ: మీనాక్షీ అక్కయ్యా!...... ఎక్కడో భజంత్రీలు వినిపిస్తున్నాయే. ఇటే వస్తున్నాయి.

మీనా: వస్తేనేమె రాధా?

రా: అన్నట్టు లక్ష్మీపతి గారింట్లో పెండ్లి కదూ?

మీ: అలాగా.

రా: అవునే. వాళ్లమ్మాయిలు శాంత, కమలా వాళ్లన్నయ్య పెండ్లికి పేరంటం పిలవటానికి వస్తున్నట్టున్నారు.

మీ: (ఆశ్చర్యంగా) అతనికి పెండ్లా?.. వాడికెవరిస్తారే పిల్లని.

రా: అలా ఆశ్చర్యపడతావెందుకు?... శాంతకు కాలా? శాంత ఏం బాగుంది? వాని మొగుణ్ణి చూడు, ఎంత అందంగా ఉంటాడో. ఈరోజుల్లో యిన్ని చిత్రాలే పెండ్లిండ్లు జరుగుతున్నాయి.

మీ: కొనుక్కొచ్చి చేసుకుంటున్నారేమో!

రా: నువు బొత్తిగా వంటింటికుందేలువి. కట్నంకూడా యిస్తున్నారు.

మీ: ఏమిటి?...కట్నంకూడా యిస్తున్నారా?

రా: అవును. ఈరోజుల్లో మొగాళ్ళు అందంగా ఉండాలని ఎక్కడా లేదు. అతడెంత కురూపో అంత సుర్ర్రదూపి నిచ్చి పెండ్లి చేస్తున్నారు. కాకి ముక్కుకు దొండపండు.

మీ: రోజుల మహిమ. కాకపోతే కట్నంకూడా యిచ్చి వాడికి పిల్ల నివ్వటమేమిటి!

రా: ఏం శాంతకు కాలా?

మీ: బోలెడంత కట్నమిచ్చారు.

రా: వాడు చేసుకున్నది డబ్బుని...... శాంతను కాదు. అంతా డబ్బు మహిమ. అన్నిటికీ ధనమునే తెర మరుగుంద. దాని చాటున ఎంత అపభ్రంశపు నాట[illegible] మాటానికి వీలుందో, అంతా ఆడుతున్నారు.

మీ: అరవకే వస్తున్నారు......రావే శాంతా. అక్కడే నిలబడిపోయావేం కమలా?

రా: అదిప్పుడు సిగ్గుపడుతోందేమో!

కమల: నాకెందుకే సిగ్గు.

రా: కాకపోతే మా యింట్లో అడుగు పెట్టకూడదని నిశ్చయమా?

క: అలా అంటే వీధిలోనే నిలుచునే దాన్నిగా.

రా: అదే మంచిదిగా – గుమ్మంలో నిలబడేదానికంటే?

శాంత: ఇవ్వాళ దానికేం క్రొత్తనే? అంతా కలిసి యిక్కడే ఆడుకునేవాళ్లం కదూ?

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## యామిజాల శంకరం

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

మీ: ఏదో లేవే – చిన్నతనం.

రా: చిన్నతనం కాదే...చూడవే దాని మాటలు.

మీ: పోనిద్దురూ.

శాం: మీ అమ్మగారేరే మీనాక్షీ?

మీ: లోపలుంది. పిలవ్వే రాధా.

రా: అమ్మా!...ఓ అమ్మా.

సుంద: (వస్తూ) ఏమిటే ఆ అరుపులు.

మీ: పెండ్లివారొచ్చారమ్మా.

శాం: మేమేనండి. కొత్తవాళ్లమేం కాదు. నేను శాంతని.

సుం: మీరటే?

రా: వీళే. కమలని చూశావా? ఎలా చిందులు త్రొక్కుతోందో?

క: అదిగాదే. ప్రక్కింటి తాయారమ్మగారిని పిలవటానికి వెళ్ళాం. అంత దురుసుగా యీసడించి మాట్లాడుతుందేం?

మీ: ఆమె స్వభావం.

శాం: ఇది తిరుగబడింది

రా: మంచిపని చేసింది

క: మా శాంతక్కయ్యతో వచ్చిందది – నా కొక్కులుపు, ఒకటే అదమాయింపు. అక్కడికి ఉండబట్టలేక నాలుగూ పెట్టాను.

రా: ఇంకేం. అలాంటివాళ్లకలాగే ఉండాలి.

సుం: సరేలే. బాగుంది నీ సలహా. కూర్చోండే ... నిలుచో బెట్టే మాట్లాడుతున్నారేమే.

రా: జీతాలిచ్చి పైగా.

శాం: ఈ వేళాకోళాల కేంగాని—

రా: మీ చెల్లెల్ని దాచమను పెండ్లి కోసం.

శాం: (మీనాక్షికి, రాధకు బొట్టు పెట్టింది) ఇవ్వాళ రాత్రి పన్నెండు గంటలకి మా అన్నయ్య పెండ్లి.

రా: భలేగా ఉంది. అర్ధరాత్రయితే ఎవరూ రారనా అలా లగ్నం పెట్టారు?

క: రాదలుచుకుంటే రాత్రి అడ్డమా?

శాం: తీరుబడిగా అంతా రావడానికి వీలుంటుంది కదూ? మీరూ తప్పకుండా రావాలి పెద్దమ్మగారూ.

సుం: కూర్చోండర్రా పోవచ్చులే.

రా: (కమల జాకెట్టుచూపిస్తూ) నేను చెప్పిన జాకెట్టు గుడ్డ యిదేనమ్మా. చూడు– ఆ పూవు లెంత అందంగా ఉన్నాయో. ఇలాంటిదే నా కొకటి కావాలి. ఏమమ్మా... కొనిపెట్టవ్?

సుం: అలాగేలే. యీ నెక్లెస్ ఎప్పుడు చేయించుకున్నావే శాంతా?

శాం: మొన్ననే కొన్నారు.

క: దాని మొగుడు.

మీ: ఎన్ని కాసులే?

శాం: పది కాసులట.

క: అని చెప్పారు – వారు.

సుం: ఏం వేళాకోళాలే. మంచి పొందికగా పొదిగారు రాళ్లు.

మీ: ఈ చంద్రహారం యిదివరకున్నదే కదే?

క: దాని మొగుడి ధర్మమా అని యింకా చెరిపించలేదు.

రా: అంటేనంటావా?

క: అతురాలా. ఈ రోజుల్లో కాసుల పేర్లు, చంద్రహారాలు మోటుకాదే. మళ్ళీ సారి మా అక్కయ్యవళ్లి, తిరిగివచ్చిన తరువాత చూడు!

రా: ఏమవుతుందంటావ్?

క: మూడుసార్లు మార్చి, నాలుగుసార్లు చెరిపించితేగాని అది వస్తువే గాదు. అప్పుడుగాని బంగారానికి నిగ్గు తేలదు.

సుం: నిజమేనమ్మా. ఆ రోజులు వేరు. ఆ నగలు వేరు. అప్పుడు అడ్డబాసలని, నానులని, వంకీలని, కాళ్ళకు కడియాలని [illegible], ఏవో పెట్టేవాళ్ళు.





# మగదిక్కు



రా: కావలస్తే మా అమ్మ చెప్పులకు చూడు - ఎన్ని వస్తున్నాయో.

సుం: అవన్నీ పూర్వపు రోజులు.

మీ: యీ చీర ఎప్పుడు కొన్నావే శాంతా?

శాం: పెండ్లికి వస్తూంటే, మద్రాసులో కొనిచ్చారు.

క: ఎవరో అర్థంకావటం లేదాయె - మూవారను - నవాను.

మీ: అంచు చాలా బాగుంది!

రా: అవును.

క: ఇహ లేవే!...నువు కూర్చున్నావంటే కదలనే కదలవు. నీతో ఎట్లా వేగుతున్నాడో మరి.

సుం: పోవచ్చులే. ఉండండర్రా ఏమిటా తొందర.

క: తిరగవలసిన యిండ్లింకా చాలా ఉన్నాయి.

శాం: అవునండి. మొగాళ్లంతా బయట నిల్చుని ఉంటారు వెళతాం. ఇవ్వాళ మీరంతా అక్కడికే రాండి భోజనాలకు.

రా: తప్పకుండా వస్తాం.

క: ఇహ రావే, రాధ గ్యారంటీ ఇచ్చేసింది.

బయట: రాండర్రో.

క: వస్తున్నాం...పద పద.

సుం: మీనాక్షీ!...వాళ్లకు బొట్టు పెట్టు.

మీ: (లోనికి వెళ్లి కుంకుమ కాయ తెచ్చి బొట్టు పెడుతుంది.)

శాం: వెళ్లొస్తాం...(వెళ్లారు యిద్దరు)

సుం: దేనికైనా పెట్టి పుట్టాలి!...

రా: కాదు మరి!

మీ: ఏమమ్మా!...మేం వెళ్లేదా?

సుం: ఎక్కడికి?

రా: ఎక్కడికని అడుగుతా వేమిటి... పెండ్లివాళ్ళింటికి.

సుం: ఏడిసినట్టుంది.

మీ: ఏమమ్మా!

సుం: సిగ్గు లేకుండా ఎలా అడుగుతున్నావే?

రా: ఎందుకే?

సుం: ఎలా వెళతారు?...కట్టుకోవడానికి మంచి చీరన్నా లేదాయె—నగలూ, నాణ్యాలు లేకపోతే మానె; ఈ చింపిరి గుడ్డలతో అక్కడ ప్రత్యక్షం కాకపోతేనేం.

మీ: ఏవో గుడ్డలు...ఇవన్నీ వాళ్లు గమనిస్తారా?

సుం: తప్పకుండా.

రా: రాలేదని అనుకోరూ?......ఇంత యిదిగా మనింటికి వచ్చి పిలిచినప్పుడు వెళ్లకపోతే ఏం బాగుంటుంది!

సుం: బాగుండదని నాకూ తెలుసు.

రా: అందుకే. ఒక్కసారి వెళ్ళొస్తే ఏం పోయింది?

మీ: వెళ్లకపోతే గర్వపోతులనుకోరూ?

రా: అదీగాక...శాంత, కమల, మేం అంతా ఇక్కడ పుట్టి ఇక్కడే పెరిగాం. ఇక్కడే కలిసి మెలిసి మసలేవాళ్లం. ఆడుకున్నాం, పాడుకున్నాం. ఇవ్వాళ వాళ్ళ యింట్లో పెండ్లి జరుగుతూ ఉంటే, ఇంత స్నేహితులమైయుండికూడా, గుడ్డలు లేవనే వంకతో మానేస్తే ఎంత అసహ్యంగా ఉంటుంది!

సుం: ఆ విషయాలన్నీ నాకు తెలుసు. కాని మీకు వాళ్ళకు చాలా తేడా ఉంది. చిన్నతనం వేరు. అప్పటి హృదయాలు వేరు. ఎల్లప్పుడూ అలాగే ఉండవు.

రా: ఇప్పుడు మాత్రం.

సుం: విను. అప్పుడు మీ నాన్నగారుండేవారు. ఆయన ఉండగా మనం ఎంతో గొప్పగా బ్రతికాం. అప్పుడు సంఘంలో మనకుండే గౌరవం వేరు. అందుకే మీరంతా కలిసి మెలిసి ఆడుకోవడం సంభవించింది. ఇప్పుడు మీ నాన్నగారు లేరు.

రా: అంతమాత్రం చేత మనకున్న గౌరవం ఎక్కడకు పోయింది?

సుం: నీకు తెలీదు. మీరు ముగ్గురాడపడుచులు నాపాల బడ్డారు. నాన్నగారుండగా కుదిర్చిన సంబంధానికే మీ పెద్దక్కయ్య రాజ్యానికి పెండ్లిచేశాను. నా చేతులమీదుగా మీనాక్షికి చేశా. రాజ్యం దాని భర్తయింటికి పోయి ఎంత సుఖపడుతోందో, మీనాక్షి పోకా అంతే...నీకు పెండ్లిగాకా అంతే. రాజ్యం కష్టసుఖాలు వింటూ ఉంటే నా కడుపు తరుక్కుపోతోంది.

రా: దేనికమ్మ దీనికీ వాటికీ ముడి పెడతావ్?

సుం: ఎందుకా?...మీనాక్షిని అత్తింటికి పంపటమెలా? నువు పెండ్లికాకుండా కూర్చున్నావు. ఎన్ని వేలుపోస్తే అవుతుంది? ఇలాంటి పరిస్థితుల్లో ఎవరైనా ఏమయినా అంటారు. అందులో నలుగురాడవాళ్ళ చేరేచోట.

రా: ఎందుకంటూ రేమిటి?

సుం: ఎందుకన్న ప్రశ్న తీసెయ్. అంటారు. అది సహజం. ఇదివరకు మనమున్న స్థితి వేరు. ఇప్పుడున్న స్థితి వేరు. ఇదివరకు మీరూ, వారూ ఒకటిగా కలిసి తిరగవచ్చు. కాని వారు ఎప్పటిలాగే ఉండిపోయారు. మనం దిగజారిపోయాం. యిప్పుడీ రెండు కుటుంబాలమధ్య అంతస్థులు వేరు. వారేమయినా అంటే ద్వేషాలు పెంచుకోవడం మాత్రమే జరుగుతుంది చివరికి.

మీ: పూర్వ స్నేహమెక్కడికి పోతుందేమిటి?...ఎందుకంటారు?

సుం: అర్థమావదు. తెల్లటివన్నీ పాలనుకోకండి. ధనం ఏమైనా చేయిస్తుంది. లేక సుఖం సుఖం చూసుకోకుండా ఎందుకు చేసుకుంటారు.

రా: ఇష్టంలేదని అనరాదూ?

సుం: అదికాదు రాధా!...ఇవి ఆడంబరాలకు రోజులు. మీ రిప్పుడంత ఆడంబరంతో వెళ్ళలేరు...మిమ్మల్ని చిన్నచూపు చూస్తారమ్మా.

మీ: ఎప్పుడైనా, ఎక్కడికైనా వెళతానంటే, నువ్వెప్పుడూ యిలానే మాట్లాడతావ్.

సుం: సిగ్గూ, లజ్జా విడిచి ఎలా వెళతానంటున్నావే?

రా: సిగ్గు సిగ్గని దాని నిగ్గుతేల్చారు మీరు.

సుం: నేనా?

రా: అవును నువ్వే. పెండ్లి...పెండ్లని, చదువుసంధ్యలు చెప్పించకుండా చిన్నతనంలోనే దానిగొంతుకోశావ్. అక్క, అక్క, యివ్వాళ అడిగింది, ఎంత చచ్చిపోయి అడుగుతోందో ఆలోచించావా?

సుం: రాధా!

రా: ఏమన్నా అంటే నీ కోపమొస్తుందనే నోరు మూసుకున్నాను. అంత పసితనంలోనే దాని గొంతుకోయ్యాల్సిన గతేమొచ్చింది?

సుం: ఎదుగుల్లా ఎదిగిన తరవాత పిల్లలకి పెండ్లిండ్లుచేస్తే ముద్దుముచ్చట్లు తీర్చుకునేదెప్పుడు? నోములు, వ్రతాలు జరిపించుకునే దెప్పుడు?

రా: అందుకే అన్ని సరదాలూ తీర్చుకుంటున్నావుగా. ఈనాడు అక్కయ్య ఎందుకూ పనికిరాకుండా పోయింది. అక్షరం ముక్క రాదు. ఎక్కడికైనా వెళ్ళి ఉద్యోగం, సద్యోగం చేసి పొట్టపోసుకునే రాతా లేదు. కర్కోటకుడి చేతిలో పెట్టి దాని కంఠం కోశావు. ఇప్పుడు దాన్ని



దాని మొగుడొదిలిపెట్టాడు...దాని దిక్కెమిటి?

సుం: రాధా!...(కోపంతో లెంపమీద కొట్టి) జాగ్రత్త. ఒళ్లు దగ్గరపెట్టుకుని మాట్లాడు. (లోనికి వెళ్ళింది).

రా: (చిందులు త్రొక్కుతుంది.)

మీ: నన్నుగురించి నువ్వెందుకు బాధపడతావే?

రా: పొరబాటే జరిగింది.

మీ: అనవసరంగా దెబ్బతిన్నావ్.

రా: నిన్ను చూస్తే నాకు జాలివేస్తోంది. ఆగలేక యివ్వాళ అడిగేశాను. నువ్వు చదువుకున్న దానివైతే ఎంత బాగుండేది!

మీ: చదువుకుంటేమాత్రం?

రా: అక్కడే పొరపాటుపడుతున్నావ్. నీ కిప్పుడు విలువలేకపోయింది. చదువుకున్నట్లయితే సంపాదించుకోగల శక్తి కొంత ఉండేది. ఒకడిమీద ఆధారపడాల్సిన అవసరం ఉండేదికాదు. నీ కష్టాడు కొంత విలువయిచ్చేవాడు. కాదు, కూడదంటే వేరే బ్రతగ్గలవు.

మీ: నువ్వలానే చేస్తావా?

రా: అక్షరాలా.

మీ: మరి పెండ్లిచేసుకోవా?

రా: వస్తే చేసుకోను.

మీ: అది బాగుంటుందే?

రా: నువు చేసుకొని ఏం బాగుపడ్డావు? ...అక్కయ్య ఏం పొడుకుంటోంది?

మీ: అయితే ఏంచేద్దామనుకుంటున్నావు?

రా: చదువుతాను.

మీ: మరి డబ్బు?

రా: అమ్మ నాకు కట్నమివ్వబోయే డబ్బు యిలా సద్వినియోగంచేస్తాను.

మీ: తరవాత?

రా: స్వశక్తిమీద ఆధారపడి బ్రతుకుతాను.

మీ: అంటే?

రా: నీ కర్థంకాదులే.

మీ: ఇలాంటి వ్యర్థపుటూహ లూహించకు.

రా: ఏం?

మీ: ఆడది ఏనాటికైనా పెండ్లిచేసుకోవలసిందే. లేకపోతే అపనిందలు వేసి అసహ్యంగా చూస్తారు.

రా: ఎవరు?

మీ: సంఘం.

రా: ఆ సంఘం చెడిపోయిన నీ సంసారాన్ని సరిదిద్దగలదా?

మీ: నా మాట వేరు.

రా: అది వేరు......ఇది చెట్టు కాదు. రెండూ ఒక్కటే.

మీ: అయితే జీవితాంతం బ్రహ్మచారిణిగా ఉండిపోతావా?

రా: ఏమో చెప్పలేను. నాకు నచ్చినవాడు, నన్ను మెచ్చినవాడు ఎవడైనా తటస్థపడితే, అప్పుడు చేసుకుంటా.

మీ: అదీ కొంత బాగానే ఉంది.

రా: నీకు తెలీదక్కా. మనలో ఏసత్తా లేదు గాబట్టి అంతా తేలిగ్గా చూస్తున్నారు. మనం కూడా పనికివస్తామని నిరూపించిన నాడు...మళ్ళీ మాట్లాడగలరా? దేనికైనా సమువృజ్జీ వుండాలి. నేనూ మనిషినే; నాలోనూ చీమూ, నెత్తురూ ఉన్నాయి; నేనూ సంపాదించుకోగలను; నాకూ శక్తి ఉంది; ఆడదైనంతమాత్రంచేత బాధలు పడాలని రాసిపెట్టుందా? అలా ఎదురు తిరిగేస్థితికి నువ్వు రావాలి. కాని అలా రాకుండా చేస్తున్నారు మనవాళ్ళు

మీ: మరి అమ్మ నిన్ను చదువుకోనిస్తుందా?

రా: ఎందుకు చదువుకోనివ్వదు?

మీ: పెండ్లిచేస్తానంటె?

రా: వద్దంటాను.

మీ: ఊరుకుంటుందా?

రా: ఉరిపెట్టుకోమను.

మీ: ఆ ఆటలేం సాగవ్.

రా: సాగించుకుంటే అన్నీ సాగుతాయి.

మీ: అరవకు. అమ్మ వస్తోంది

సుంద: (వచ్చింది...ఇద్దరూ కొంచెం బెదిరారు) ఎందుకే అలా భయపడుతున్నారు. పెండ్లికి వెళ్ళాలనే ఉందా?... మీకంతగా వెళ్లాలనుంటే, వెళ్ళండి; నేనన్నానని ఎందుకు బాధపడతారు. ఏదైనా స్వానుభవంవల్ల తెలుసుకోవడం మంచిది. పొండి. ఆ దుస్తులు మార్చుకుని వెళ్ళండి. (ఇద్దరూ లోనికి వెడతారు. సుందరమ్మ భర్త పటంవద్దకు వెళ్తుంది )ఏమండి! ఈసంసారం యీదటం నావల్లకాకుండా ఉంది. ఆడదాన్ని. ఏంచేయగలను? మాయలేని వారి మూపురాలమీద యీ భారం వదిలేసి వెళ్ళిపోవడం న్యాయమేనా!...

తాయారమ్మ: (బయటనుంచి వస్తూ)... ఏమమ్మోయ్!...సుందరమ్మగారూ!

సుం: రండి తాయారమ్మగారు!...

తా: చూచావటమ్మా కమల దుండగం. అమ్మో! అమ్మో!! ఈ రోజుల్లో పెద్దా పిన్నా పరిజ్ఞానమే పోయింది. నోటికెంత మాటవస్తే అంతమాటా అనెయ్యటమేనా?

సుం: ఏదో చిన్నపిల్లలెండి.

తా: అలా అనకు. గర్వం...ఈ రోజుల్లో పిల్లల్ని పట్టపగ్గాలున్నాయా? మన రోజుల్లో మనం ఎరుగుదుమా?

సుం: నిజమే.

తా: సరేగాని...కొస్త కాఫీపొడుముంటే పెడుదూ?

సుం: మీరే వేళ అడిగారో గాని, నిజంగా అయిపోయిందండి.

తా: అరేమిటమ్మా!...ఇప్పుడు మీరాధ తెస్తూండగా నేను చూచాను.

సుం: మా రాధ తెస్తూండగా చూచారా! ...అబ్బె!...ఒకవేళ కాఫీపొడుం డబ్బా ఏదన్నా పట్టుకోవస్తూండగా చూచారేమో?

తా: అవునవును.

సుం: అది వట్టిడబ్బాయే నండి.

తా: అమ్మో! అమ్మో!! నీ విపరీతం పాడుగాను. వట్టిడబ్బా అంటూ వెందుకమ్మా; లేదు, పెట్టనంటే పోదూ?...మా కాలంనాడు మేం ఎరుగమమ్మా!

సుం: అలా అంటా రెందుకమ్మా! ఇంత పెడితే ఏం?...బంగారమా? వెండా? ఇరుగూ, పొరుగూ, బదులూ - సదులూ ఉండవబండి.

రా: (వచ్చింది.)

తా: నాకు తెలీదూ?...ఇలా ఉంచుకోని లేదనటం - మా కాలంనాడు మేం ఎరుగమమ్మా. పోనీలే...వస్తా. ఏం పిసినారితనం. అందుకే యిలా ఉన్నారు.

రా: (కోపంతో) తాయారమ్మగారు! ...జాగ్రత్తగా మాట్లాట్టం మంచిది. మీ కాలంలో ఎరక్కపోయినా, యీ కాలంలో చూడండి. అయినా ఎందుకు పెట్టాలి? పెట్టం. మేం పిసినారివాళ్లమని తెలిసి ఎందుకొచ్చారు? ఎవరు రమ్మన్నారు. మీ రెప్పుడైనా పిల్లికి బిచ్చం పెట్టారా? మీరు మాట్లాడింది ఒప్పు. మేం మాట్లాడితే తప్పు. మేం ఎలా ఉంటే మీకెందుకు?

తా: అమ్మో! అమ్మో!! ఏం మిడిసిపాటుతనమే!

రా: నిదానంగా మాట్లాడ్డం మంచిది. మీరు లక్షఅన్నా ఫరవాలేదు చిన్నదాన్ని ...ఒక్కటంటే చాలు.

తా: భయభక్తులతో పెంచిన పిల్లలయితే కదూ. ఇన్నేళ్లు పెళ్ళిళ్ళుచేయకుండా యింట్లో ఉంచుకుంటే—

రా: (రోషంతో) తాయారమ్మగారూ! ...(మీదికి నడిచింది)

సుం: రాధా!...(గద్దించింది. దాంతో రాధ నిఽబడిపోయింది)

తెర దిగింది.

## 2

[అదే దృశ్యం. కాకపోతే యిందాక మధ్యాహ్నం, ఇప్పుడు రాత్రి. తొమ్మిది లేక పదిగంటల సందర్భం. హాల్లో ప్రక్క



# మగదిక్కు



వేసి ఉంటుంది. సుందరమ్మగారు భర్త పటం దగ్గరనుంచి దేవునిపటందగ్గరకు వెళ్ళి, మొక్కి]

సుం: ప్రభూ!...నామనస్సుకు శాంతిని చేకూర్చు. అంతా నీ యత్నంవల్ల జరగాలి. నేను ప్రయత్నించి మాత్రం ఏం ప్రయోజనం. (అంటూ ప్రభువు పాదాలు కళ్ళ కద్దుకుంటుంది. తరవాత దీపం కొంచెం తగ్గించి ఒకచోట పెట్టింది. మంచంమీద పక్కదులిపి కూర్చుంటుంది. దిండు సరిచేసి పడుకోబోయింది. ఎవరో తలుపు తట్టారు) ఎవరది?...తిరిగి వచ్చారా ఏమిటి వాళ్ళు. (లేచి దీపం పెద్దదిచేసివెళ్లి తలుపు తీసుంది) నువ్వటే రాజ్యం ... ఇప్పుడొస్తున్నావేమిటి?...ఎవరెవరొస్తున్నారే?

రాజ్యం: ఇంటికిమాత్రం ఒక్కదానే వస్తున్నానమ్మా.

సుం: మీ ఆయనకూడా వచ్చారా?

రాజ్యం: వచ్చారు. కాని ఆఫీసరుగారితో బంగళాకు వెళ్ళిపోయ్యారు.

సుం: ఒక్కదానివే వస్తున్నావన్న మాట.

రాజ్యం: గుమ్మంలో దింపేసి అదేబండిలో వెళ్ళిపోయారు.

సుం: లోపలకన్నా రాలేదేం: భోంచేశారా?

రాజ్యం: ఆఁ...చేశాయిలేరే?

సుం: లక్ష్మీపతిగారి అబ్బాయి పెండ్లి. కాంతావాళ్లు పిలిస్తే వెళ్లారు.

రాజ్యం: ఎప్పుడూ పెండ్లి?

సుంద: రాత్రి 12 గంటలకట. ఎన్నాళ్లకెన్నాళ్లకు చూచానే నిన్ను.

రాజ్యం: ఎన్నాళ్లకయినా చూడ్డం కష్టమమ్మా.

సుం: అలా అంటున్నావేం?

రాజ్యం: అవునమ్మా. ఒకళ్ల చేతిలో పెట్టిం తరువాత వాళ్ల అధీనంలో ఉండాలి. వారి యిష్టాయిష్టాలమీద నారాక పోకడ లాధారపడి ఉంటాయి.

సుం: నిన్ను వాళ్లు బాగా చూడటం లేదటనే?

రాజ్యం: [ఉస్సురన్నట్టు]. చూస్తూనే ఉన్నారు...బాగా.

సుం: మీ ఆయన నీతో చక్కగా ఉంటాడానే?

రాజ్యం: ఆయన మాత్రం చక్కగా ఉంటాడు...చూట్టానికి.

సుం: అంత నీరసంగా ఉన్నావేమే?

రాజ్యం: ప్రయాణంవల్ల.

సుం: అక్కడివిషయాలేం చెప్పావు కావే?

రాజ్యం: చెప్పిమాత్రం ఏంప్రయోజనం?

సుం: ఏం?

రాజ్యం: ఆ కష్టసుఖాలేవో నన్నే అనుభవించనీయండి. అందులో పాలు మీకెందుకు?

సుం: అమ్మదగ్గర మర్మమా?

రాజ్యం: మర్మంకాదమ్మా. చెప్పితే ఏమన్నా ప్రయోజనముందా? అనవసరంగా మిమ్మల్ని కష్టపెట్టినదాన్నవుతాను.

సుం: చెప్పమ్మా. నాదగ్గర దాచకు. మీ కష్టసుఖాలుగాక, నాకు తెలుసుకో దగ్గ విషయాలింకేమున్నాయ్?

రాజ్యం: నన్నొక ధనవంతులయింట్లో పడేశారు. [illegible] నువు పెట్టావు. కాని యిచ్చింది [illegible]. కడుపుకోసం ప్రాణాలు నేను తేను. వాళ్ళలా నేను వెళ్ళలేదు. పెద్దకోడలిసంగతి చెప్పక్కర్లేదు? చిన్నకోడలికి యీమధ్య ఏకరాలు రాసిచ్చారు మొన్న. పైగా మేపెకట్టుకోడానికి కావలసిన డబ్బిస్తానని కబురుపెట్టారు మామరిది మామగారు. వీళ్లిద్దరిమధ్యా నేనేం కనిపిస్తాను?

సుం: ఇప్పుడేమంటున్నారేమిటి?

రాజ్యం: ఏమైనా అంటారు. వాళ్ళ అంతస్థు వేరు, మన అంతస్థు వేరు. అందరూ సాధించటానికి అనువుగా నేనొక్కదాన్ని దొరికాను. ఎవర్ని అంటే ఎవరు ఊరుకుంటారు—నేనుతప్ప. ఈసడింపులు, ముక్కవిరుపులు మూతివిరుపులు, అన్నీ నామీదనే ప్రయోగిస్తారు.

సుం: మీఆయనకూడానా?

రాజ్యం: అయ్యకుపుట్టిన ఆరుగురూ సంగీతపాఠకులే. ఆయన మాత్రం ఏం తక్కువ తిన్నారు? ముందాయన ధాటికి తట్టుకోలేకుండా ఉన్నాను.

సుం: ఏమంటాడేమిటే?

రాజ్యం: నాన్నగారిపేరు చూచి నన్ను చేసుకున్నారట. విధవా కూతుర్ని కాబట్టి బోలెడంత ఆస్తి కలుస్తుందని ఆశించారట. మీనాక్షి మొగుడిలాగానే ఆయనకూ పుట్టింది.

సుం: గొప్ప కుటుంబంలో పడ్డందుకు నువ్వయినా సుఖపడుతున్నావేమో అనుకున్నానే.

రాజ్యం: సుఖం!...ఆమాట అనకమ్మా. ఈ రోజుల్లో ముఖ్యంగా చదువుకున్న వాళ్ళకి యీ తెగుళ్లు ఎక్కువయ్యాయి. కొంత చదివితేచాలు, బువ్వ లేకపోయినా పొంగులెక్కువ. ఎంతసేపటికీ కట్నాలు. కట్నాలు..కట్నాలు. అంతటితో ఆగితే బాగుండిపోను. పెండ్లయిన తరువాతకూడా యింకా...యింకా దోచుకుందామంటే — వీళ్లు ఆడపిల్లల్ని కన్నతల్లిదండ్రుల కొంపలు తీయటానికి పుట్టారా?

సుం: సాగుతున్నప్పుడు యిల్లెక్కి కూస్తారు.

రాజ్యం: పిచ్చెక్కిపోతోందమ్మా...ఇంతకీ మీనాక్షి మొగుడేమంటున్నాడు?

సుం: తొణకటంలేదు...బెణకటంలేదు. ఏదో చదువుతాడట. అందుకు అయ్యే ఖర్చంతా మనం భరించాలట.

రాజ్యం: అంటే?

సుం: కొంపలు తీసి మాటలమ్మా...... నాలుగు వేలిస్తేనే గాని పట్టు తీసుకోనంటాడట.

రాజ్యం: నేను వెళ్ళి ఏం పోట్లాడుకుంటున్నానో—అది వెళ్ళకో అంటే.

సుం: రెండూ, గంటే అయ్యాయి

రాజ్యం: రాధ పెండ్లిప్రయత్నం ఏమీ చెయ్యటంలేదా?

సుం: అది చేసుకునేటట్టు లేదే.

రాజ్యం: ఏం?

సుం: చదువుకుందట.

రాజ్యం: అదే మంచిపని.

సుం: ఏం మంచి - గీచి మంచి. చదివి ఉద్యోగాలు చేస్తుందా? ఊళ్లేలుతుందా?

రాజ్యం: అలా అనకు. ఇలా మొగాళ్ళ చేతుల్లో నలిగి చచ్చేదానికంటే, కాస్త నాదగ్గిరా సత్తా ఉందని నిరూపించుకుంటుంది.

సుం: మన వంశంలో ఎవరైనా ఉద్యోగాలు చేశారే.

రాజ్యం: వంశాలని...చరిత్రలని...... అవన్నీ పూర్వపు మాటలమ్మా. కాలం మారిపోయింది. దాంతో అన్నీ మారిపోతున్నాయి.

సుం: నేనుండగా అలా జరగటానికి వీల్లేదు. ఎల్లాగయినా దాని పెండ్లి చేయటానికి నిశ్చయించాను.

రాజ్యం: కాని.—

సుం: కాని లేదు...ఏమీ లేదు. యీ యేటితో స్కూల్ ఫైనల్ అయిపోతుంది. ఆతరవాత దాని మొగుడి కిష్టమయితే చదివించుకుంటాడు. నాబాధ్యత తీరిపోతుంది.

రాజ్యం: సంబంధం అప్పుడే నిశ్చయించావా?

సుం: ఆఁ...



రాజ్యం: ఆస్తిపాస్తు లున్నవాళ్ళేనా?

సుం: పదెకరాలుంది... బియ్యే చదువు తున్నాడు.

రాజ్యం: బాగానే ఉంది. కాని ఆ మహానుభావు డెలాంటివాడో?

సుం: ఎలాంటివాడైనా కాని... తప్పుతుందా?

రాజ్యం: కట్నం ఏమాత్ర మడుగుతున్నాడు?

సుం: అందరితోపాటే.

రాజ్యం: మరి డబ్బెట్లా?

సుం: అదే వస్తుంది.

రాజ్యం: అంటే?

సుం: ఈ యిల్లూ, ఆ నాలుగెకరాలు అమ్మివేయటానికే నిశ్చయించుకున్నాను.

రాజ్యం: అః...!

సుం: అవునే. మీనాక్షి మొగుడుకో వాలుగువే లివ్వాలా?......దీని పెండ్లికి కావాలా?...అన్నిటికీ సరిపోవద్దూ.

రాజ్యం: అయితే అమ్మేస్తా వన్నమాట!

సుం: మరేం చేసేది?

రాజ్యం: పెండ్లితోనే అయిపోతుం దనుకుంటున్నావా? ఆ తరువాత జరుగవలసిన తతంగాలు బోలెడన్ని ఉన్నాయి.

సుం: ఏమైనా ఉండనీయి.

రాజ్యం: మరి మువ్వెట్లా?...నిన్నూ చేదెవరు?

సుం: ఆశ్రమాలు, అరణ్యాలు లేవటే?

రాజ్యం: (గాద్గదికంగా) అమ్మా!

సుం: ఎందుకమ్మా విచారిస్తావు?

రాజ్యం: మమ్మల్ని కన్నందుకు నీ కిదా గతి!

సుం: గతేమిటమ్మా!...పుట్టాను. అనుభవించవలసిన కష్టసుఖాలన్నీ అనుభవించాను. ఇహ నాదేముంది! (తన దేహం చూపుతూ) ఈ యిల్లు పాతదైపోయింది. ఈ యిల్లువదలి యింకోయింట్లో ప్రవేశించాలి. ఇప్పుడు అనుభవించవలసింది మీరు మీ సుఖాల్ని, అనుభవాల్ని చూచి సంతోషించటమే నాపని ..అదే నాకు సంతృప్తి... నే నేమైపోతే యేం?

రాజ్యం: కాని.. ఈ వృద్ధాప్యం గడిచే దెట్లా?

సుం: ఎందుకు గడవదు. ఉదయించిన సూర్యభగవానుడు అస్తమించటం లేదూ?

రాజ్యం. ఇదివరకు గడిచిన జీవితం వేరు. ఇప్పుడు సర్వశక్తులు ఉడిగిన శరీరం మరి.

సుం: అన్నీ ఒక్కటే నమ్మా.

రాజ్యం: ఈ వేదాంతానికేం లే వి న్నిప్పు డెవరు చేరదీసి ఆదరిస్తారు? ధననూ లేదాయె. మేం ఏం సహాయం చేస్తాం. ఒక్క రూపాయి యివ్వటానికి పదిమంది అనుజ్ఞ కావాలి. అలాంటప్పుడు మేం ఏం చేయగలం? కనీసం రాధయినా మొగపిల్లాడయితే ఎంత బాగుండేది?

సుం: మనం లక్షాధికారులమయితే యింకా బాగుండేది కాదు?

రాజ్యం: నా సంసారాన్ని బట్టిమాస్తే ...రేపు మీనాక్షి, రాధా కూడా కట్టు బాట్లకు అణిగి మణిగి ఉండాలి.

సుం: ఎందుకే బాధపడతావు ఎవ రెంత వరకు నోచిపుట్టారో, అంతవరకే అనుభవిస్తారు. కొడుకులే పుట్టారనుకో?...వాళ్లు మాత్రం పోషిస్తారనే నమ్మక మేమిటి? పెండ్లాం రాగానే తల్లి దండ్రుల్ని తరిమేసిన కుమార రత్నాల్ని ఎంత మందిని చూట్టం లేదు మనం.

రాజ్యం: ఎలానయినా అది వేరమ్మ... అక్కడ వాక్కుంది.

సుం: అన్నీ ఒక్కటేనమ్మా. ఇంత కాలం బ్రతికినదాన్ని యిహ బ్రతకలేనూ? పిచ్చిదానా!...మూతి పెట్టినవాడు మేత పెట్టడూ?

రాజ్యం: ఈ ఉపశాంతి మాటలకేం?

సుం. ఏదో శాంతి...ఆ పాంతం నీ విషయం చెప్పావు కావు.

రాజ్యం: దీని కంతం లేదమ్మా.

సుం: ఏం చేస్తే నీ సంసారం చక్కబడుతుంది?

రాజ్యం: అది ఎవరివల్లా కాదమ్మా.

సుం: మీయిద్దరికీ పెండ్లి చేశాను. మీ సంసారాలు చక్కబడందే రాధకుమాత్రం పెండ్లి చేసి ఏంసుఖం?

రాజ్యం: ఆయన నన్నిక్కడికి తీసుకొని వచ్చారు.

సుం: అః...

రాజ్యం: మళ్ళీ తీసుకొని వెళ్లటమే అనుమానం.

సుం: రాజ్యం!....

రాజ్యం: అవునమ్మా.

సుం. మరలాంటప్పుడు ఎందుకొచ్చావే?

రాజ్యం: నా అంతట నే వచ్చానా?... ఎవరైనా అలా వస్తారా? మనింట్లో అనుకు కూడా పెట్టకుండా ఆయన ఎలా వెళ్ళిపోయారో చూడరాదూ?

సుం: అసలక్కడనుంచి ఎందుకు కదిలావు?

రాజ్యం: ఏం చేయను?

సుం: ఏంజరిగింది?

రాజ్యం: రెండు మూడు నెలల క్రితం ఒకసారి వెళతానని అడిగాను తిటారు. మళ్ళీ తరువాత ఎప్పుడో అడిగాను లాభం లేకపోయింది. వారికోరు వస్తారండటం తెలిసి అడిగాను. అందు కిదిగో ... (వీపు చూపుతూ)

సుం: రా...జ్యం!...

రాజ్యం: ఇలా ఎన్నోసార్లు కొట్టారు. ఇది కొత్తగాదు. ఇప్పుడు తిట్టటం మానివేశారు, మాటిమాటికి కొట్టటమే. అందు కందరూ ప్రోత్సహించేవారే అంతా నన్నొక పురుగును చూచినట్లు చూస్తారు. ఇక్కడే వదిలేస్తానన్నారు. అయితే రానన్నాను ... వీపు చిట్లగొట్టి బండిలో పడేశారు.

సుం: భగవంతుడు నా మనస్సుకు శాంతి నివ్వలేడే?

(తలుపు దప్పుడు)

చూడు? . ఎవరో తలుపుతట్టుతున్నారు. నీ మొగుడేమో?

రాజ్యం. అంత భాగ్యం కూడానా... (వెళ్తుంది)

సుం: (అల్లుడొస్తాడేమో నని మర్యాద కోసం పమిట సర్దుకుంటూ పక్కగా వెళ్తుంది. మీనాక్షి, రాధా వస్తారు)

రా: రాజ్యమక్కయ్యే!

మీ: ఎప్పుడొచ్చావే?

రా: ఎంతసేపయిందే వచ్చి?

మీ: అంతా క్షేమంగా ఉన్నారానే?

రా: బావకూడా వచ్చాడానే?

మీ: బావేడీ?

రాజ్య: అబ్బబ్బ! ... ఇన్ని ప్రశ్నలు ఇలా గబాగబా అడిగేస్తుంటే ఎలా?

సుం: అప్పుడే వచ్చేశారేం? 12 గంటలవకదూ లగ్నం.. మాట్లాడరేమే?

మీ: ఇహ అక్కడ ఉండలేక వచ్చేశామమ్మా.

సుం: ఏం?

మీ. అంత యిదిగా రమ్మని పిలిచారా! ఇంత స్నేహితులమా! అక్కడ మా ముఖాలు చూచినవాళ్ళు లేరు. ఇంత పసుపురాసి బొట్టు పెట్టుకోమన్నవాళ్ళు కూడా లేరు. నౌకరులన్నట్టు చూచారు.

రా: పైగా కమలకెంత గర్వం! ప్రతి దానికీ చివరించుకోవడమే. అందరూ పెట్టి పోషిస్తున్నట్లు, అందరికీ లోకువే.

సుం: నాకు తెలుసు. అందుకే వెళ్లొద్దన్నాను. కాని మీ ఉత్సాహం చూసి కాదనలేకపోయాను ఎవరైనా మనకు లేదంటే పెట్టరమ్మ పైగా అందరికీ లోకువవుతాం. హీనంగా చూస్తారు. అందుకే తినకపోయినా తిన్నట్టు నటించాలి. అదీ

(55- వ పేజీ చూడండి)






# తేనె తొనలు

మునిపల్లెరాజు

ఆడవే నా పాప పాడవే పాపా!
బంగారు పాపా! నా తెలుగు పాపా!!
నవ్వాలి నవ్వాలి కాంతి నింపాలి
పండాలి పండాలి శాంతి పంచాలి
పలకాలి పలకాలి తేనెలొలకాలి
కలికితే ముత్యాల వాన కురవాలి
తెలుగునాటను నీవు దివ్వెగా వెలగాలి
తెలుగు తల్లుల కీర్తి తిరిగి తేవాలి
తెలుగు వత్నుల బాట సూటిగా నడవాలి
ముందు రోజున నీవు ముందంజ వేయాలి
పోరు పౌరుషములేని జాతి నత్రాలి
మనజాతి రత్నాల మరచేవు తల్లీ
అడుగడుగునా వాళ్ళ స్మరణ చెయ్యాలి
మనకట్టు మనబొట్టు సొగసైన కనికట్టు
మన ముగ్గు మన ముద్దు మన కళలకే ఒప్పు
నిద్రించు మనజాతి తిరిగి నిలవాలి
ఈ బుగ్గిలో తిరిగి అగ్గి పుట్టాలి
ఈ మట్టిలోనుండి మణులు రావాలి
ఈ మబ్బులో నుండి చంద్రుడు మెరవాలి
ఓ తెలుగు పాపా - బంగారు పాపా
కవితలో కళలలో కీర్తి కెక్కిన పాప
ఓ తెలుగు శోభా! ఓ తెలుగు పాపా!!






## జరిగిన కథ

[మా నాన్నగారు—ఎస్సెట్టీ—లాన్గ్యుడాక్‌లో పెద్ద సిల్కు వ్యాపారి. సొంత ఫ్యాక్టరీ అవీ వుండేవి. నేను (చిన్నా) పుట్టినరోజు లగాయితూ మా కుటుంబాన్ని ఏదో ఒక ఆపద చుట్టు ముట్టేస్తూనే వుంది. చివరికి దేశంలో వచ్చిన విప్లవం మూలంగా మా నాన్నగారిస్థితి పూర్తిగా చితికి పోయింది. ఆ దెబ్బతో ఆయన మహా కోపదారి మనిషిగా తయారైనారు. నిర్జనమైన మా ఫ్యాక్టరీ ఆవరణలో నేను మా గేటు కాపలా వాడికొడుకు 'రోజె' తో కలిసి 'రాబిన్సన్ క్రూసో' ఆట ఆడుతుండేవాణ్ణి. వాడికి బూతులూ అవీ చాలావచ్చు. వాడితో సావాసం చేసినమీదట ఆ బూతులు నాకూ వచ్చేశాయి. ఒకరోజు మావాళ్ళందరూ భోంచేస్తుండగా బండబూతు ఒకటి నానోటివెంట వచ్చేసింది. దాంతో మా నాన్నగారు మండిపడి నన్ను స్కూలుకి పంపించాలన్నారు. స్కూలులో పడేసేముందు 'కన్ఫెషన్'కి తీసుకెళ్ళి ప్రాయశ్చిత్తం చేయించాలని మా పెద్దన్నయ్య అన్నాడు. కొంతకాలానికి మా నాన్నగారు దివాలా తీసిన మా ఫ్యాక్టరీని అమ్మేశారు. మేము మా స్వస్థలం విడిచిపెట్టి లయన్స్ పట్టణానికి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆ ప్రయాణంలో నా చిలుకను పోగొట్టుకొన్నాను. లయన్స్ పట్టణంలో నాలుగో అంతస్థు అద్దెకొంపలో నా ఆటలకి ఆస్కారం లేకుండా పోయింది. మా వంటలక్క 'అనీ'కి జబ్బుచేసి, స్వంతవూరు వెళ్ళిపోయింది. అలా కొంతకాలం గడిచాక మా అమ్మగారి సలహామేరకు నన్నూ, మాఅన్న జాక్‌నీ, మా నాన్న చర్చి శాలగాయకుల పాఠశాలలో చేర్పించారు. అక్కడ చదువు బాదరబందీ అసలే వుండేదికాదు.]

## 4

మా దురదృష్టం కొద్దీ మేము చర్చి బడిలో కూడా చాలా కాలం ఉండలేకపోయాం. మా పెద్ద వాళ్ళకి బాగా పరిచితుడైన ఒకాయన వాలీ నాత్ర్ విశ్వవిద్యాలయంలో 'రెక్టర్'గా పనిచేస్తున్నాడు;—ఆయన మా నాన్నగారికి ఒక జాబు వ్రాస్తూ, అందులో మా అన్నదమ్ముల్లో ఎవరినో ఒకర్ని గనుక లయన్స్ కాలేజీకి పంపించితే, తను స్కాలర్‌షిప్పు అదీ యిప్పించే ఏర్పాట్లు చేస్తానని హామీ యిచ్చాడు. ఆ జాబు చదవగానే మా నాన్నగారు "చిన్నాను పంపిస్తాను" అన్నారు.

"వాడికంటే పెద్దవాడు కదా—జాక్‌నెందుకు పంపకూడదు"దని మా అమ్మ అడిగింది.

"జాక్!—వాడు నాకు సాయం చేస్తూ యిక్కడే వుండిపోతాడు: అదీగాక—వాడికి వ్యాపారం అంటే చాలా సరదా. ఆ విషయం నే నెప్పుడో కనిపెట్టాను. వాణ్ణి మంచి నిగ్గుతేలిన వ్యాపారస్థుణ్ణిగా చేస్తాను; నీ కెందుకు?" అన్నారు నాన్న.

నిజం చెప్పాలంటే—జాక్‌లో వ్యాపారానికి పనికొచ్చే లక్షణాలు మా నాన్నగారికి ఏవి కనిపించాయో నాకైతే చాలా ఆశ్చర్యంగా వుంది. ఆ రోజుల్లో వాడికి యీ సృష్టిలో ఏ ఒక్కదానిమీదనైనా అభిమానం అంటూ వుంది అంటే, అది ఏడుపు ఒక్కదానిమీద మాత్రమే. మా నాన్నగారు ఆ విధమైన నిర్ణయానికి వచ్చేముందు కనీసం వాడితో సంప్రదించి అయినా వుంటే,...సరేలెండి—నాతో సంప్రదించారు గనుకనా, వాడితో సంప్రదించలేదని నే నిప్పుడు బెంగ పెట్టుకోవడానికి!

స్కూలులో చేరీ చేరగానే నాకు ఒక్క విష

 అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి 

యం బుర్ర తిరిగిపోయేలా తెలిసొచ్చింది—స్కూలు స్కూలు అంతటిలోకి బ్లౌజ్ (వదులు చొక్కా) తొడుక్కు వచ్చిన వాణ్ణి నేనొక్కణ్ణే! లయన్స్ మహా నగరంలో కలవారి బిడ్డలు బ్లౌజులు తొడుక్కోరు: వీధుల్లో కాళ్ళకి అడ్డం వచ్చే కుర్రకుంకలు మాత్రమే యిలాటివి తొడుగుతారు. అందులోనూ ఆ రోజు నేను తొడుక్కున్నది చారల చారల చిన్న బ్లౌజు. మా ఫ్యాక్టరీ ఉచ్చ దశలోవున్న రోజుల్లో ఏరికోరి కుట్టించుకొన్న బాపతది—ఐతేనేం ఆ వూళ్లో అది తొడుక్కొని స్కూలుకి వచ్చేసరికి, వీధుల్లో అడుక్కు తినే వెధవ ఎవడో పొరపాటున క్లాసు రూములోకి జొరబడినట్లు అనిపించింది కాబోలు - నన్ను చూసీ చూడగానే క్లాసులో పిల్లలంతా గొల్లుమన్నారు.

"చూడండి; చూడండి; వీడెవడో బ్లౌజ్ తొడుక్కుని క్లాసుకి వచ్చాడ"ని కేకలు వేశారు.

క్లాసులో రేగిన కలవరానికి కారణం ఏమిటో వెదకటం కోసం బుర్ర నాలుగు వైపులకీ తిప్పిన క్లాసు మాస్టారికి నేను కంటపడగానే ఆయన మొఖం ముప్పై ఆరు వంకరలు తిరిగి పోయింది. ఆ క్షణంనుంచీ నేనంటే ఆయనకి విపరీతమైన హేయభావం కలిగింది. నన్ను పన్నెత్తి పలుకరించటం కూడా ఆయనకు నామోషీ అనిపించింది. ఎంత పెద్ద అవసరం వచ్చినా నన్ను నా అసలు పేరు పెట్టిగాక "ఏరా, డింభకాధమా!" అని పిలుస్తుండేవాడు.

ఆయన నన్ను అలా సంబోధించి నప్పుడల్లా చెప్పాను—నా అసలు పేరు అదికాదనీ, 'డే-ని-య-ల్ ఐ-సె-ట్టీ' అనీ! అయినా ఆయన ఆ పేరుపెట్టి పిలవటం మానలేదు. ఆయనేకాకుండా స్కూలులో పిల్లలందరూ కూడా నన్ను "డింభకాధమా?" అనే పిలుస్తున్నారు. చివరికి నాకా పేరే శాశ్వతంగా వుండిపోయింది.

అంతమంది పిల్లలలోనూ నేనొక్కణ్ణే తీసికట్టుగా కనిపించేటట్టు చేసింది, నేను తొడుక్కొచ్చిన బ్లౌజు ఒక్కటేకాదు. మిగిలిన పిల్లలందరికీ పసుపు పచ్చని తోలుతో కుట్టిన మంచి మంచి పుస్తకాల సంచులు వున్నాయి; చక్కని కొయ్యతో చేసిన యింక్‌స్టాండులున్నాయి; గట్టి అట్టలు వేసిన కాపీ బుక్కులున్నాయి; —యిక నా పుస్తకాలా?—అసలే ఎక్కడో చౌకబారు షాపుల్లో కొన్న బాపతువేమో, పేజీలనీ పొగచూరినట్లు పచ్చగా తయారై, అదొక రకమైన పాతవాసన కొట్టుతుండేవి. అట్టలన్నీ చివరలు చిరిగి పోయి నానా అసహ్యంగానూ వుండేవి. లోపల కొన్ని పేజీలకి పేజీలు అసలు వుండనే వుండేవికావు. ఇంటి దగ్గిర మా అన్నయ్య జాక్, వాటి నన్నిటినీ బాగు చెయ్యాలనీ బైండ్ చెయ్యాలనీ అస్తమానం అవస్థ పడుతుండేవాడు; గట్టి అట్టలు సంపాదించి జిగురుతో అంటించి అదిచేసి యిదిచేసి మొత్తానికి వాటికి పుస్తకాల ఆకారం తెచ్చేవాడు. అట్టలు అంటించటం, పుస్తకాలు బైండ్ చేయటం-యీ పనులు బాగానే చేసేవాడు కాని వాడిపనిలో ఒక్కటే లోపం:—ఎంతచిన్న కాగితం అంటించవలసి వచ్చినా, బోలెడంత జిగురు పులిమేసేవాడు. దాంతో వాడిచేతిలో తయారైన వస్తువులు ఎన్నిరోజులు గడిచినా జిగురువాసన కొట్టుతుండేవి. సొరుగులో సొరుగుగా అనేక సొరుగులు గల సంచి ఒకటి— పుస్తకాలు పెట్టుకొనేది— చేసి యిచ్చాడు. చాలా వుపయోగంగా వుండేది. కాని ఒక్కటే చిక్కు,- తగని జిగురువాసన! అట్టముక్కలు కత్తిరిస్తూ వుండటమూ, జిగురుతో వాటినన్నిటినీ అతికిస్తూ వుండటమూ అనే కార్యక్రమం మా జాక్‌కి, ఆ కళ్ళనీళ్ళు కారుస్తూ వుండటంలాగే, వాడు చెయ్యకుండా వుండలేని పనుల్లో ఒకటిగా తయారైంది. అదేమిటో వాణ్ణి ఆ పని చేయమని ఏదో అనిర్వచనీయ ఆంతరంగికశక్తి లోపల్నుంచి తరుముతున్నదో అనిపించేది. మా యింట్లో నెగడుకి దగ్గరగా వీడివి కొన్ని జిగురుసీసాలు— చిన్నవీ, పెద్దవీ-వరసగా పేర్చివుండేవి. బజారుకుపోయి సరుకులు తేనక్కరలేని ఘడియలంటూ ఏమన్నా వాడి జీవితంలోవుంటే, ఆ కాసిని ఘడియలూ వాడు యీ జిగురు సీసాలతోనే గడిపేవాడు; ఏదో ఒకటి అంటిస్తూనో, బైండు చేస్తూనో వుండేవాడు. మిగిలిన వేళల్లో బజారునుంచి మూటలు మోసుకు రావటమో, లేకపోతే మానాన్నగారు చెప్తుంటే తను ఖాతాదారులందరికీ జాబులు రాయటమో యిలాంటి పనుల్లో గడిపేవాడు. అంటే-వ్యాపారంలో తర్ఫీదు పొందుతుండే వాడన్నమాట!

ఇక నా విషయ మంటారా—

ఎంత స్కాలర్‌షిప్ వున్నప్పటికీ, స్కూలుకి

 

# అన్నా - చిన్నా



[illegible]నవాడూ, అంతకంటే గతిలేక ప్లీజులు తోడు క్కుని క్లాసుకి వచ్చేవాడూ, డింభకాధముడనే వాడూం తరంబున జరగువాడూ, అయిన నా వంటివాడు, మిగిలిన పిల్లలతో సరిసమానంగా వుండాలంటే వారందరూ కష్టపడేదానికంటె రెండింతలు ఎక్కువ కష్టపడి చదవవలసి వుంటుందనే విషయం నేనెప్పుడో గ్రహించాను. గ్రహించిన ప్రకారమే యీ డింభకుడు నడుము [illegible], వొళ్లువొంచి కష్టించి చదివాడు.

సాహసివిరా డింభకా!... ఈ రోజుకీ నాకా దృశ్యాలు కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్నాయి. ఆ ఎముకలు కొరికే చలిలో, సకల జగత్తూ స్తంభించిపోయిన ఆ రాత్రివేళల్లో యీ డింభకుడొక్కడే దీపంముందు కూచుని ఎడతెరిపిలేకుండా చదువుకుపోతున్నాడు. చలిని పారదోలేందుకు గదిలో నెగడులేని కారణం చేత, కాళ్లనిండా గొంగళి కప్పుకు కూచుని చదువుకొంటున్నాడు. గది కిటికీ గాజుతలుపులమీద మంచు బొట్లు వానచుల్లుల్లా టపటప పడుతున్నాయి. అవతల గట్లోనుంచి మహ్యా ఐసెట్టీ కంఠం మందంగా వినిపిస్తూనేవుంది. ఆయన జాక్ చేత వ్యాపారానికి సంబంధించిన జాబులు రాయిస్తున్నారు.

"మీరు యీ నెల 8 న రాసిన జాబు అందినది..." మహ్యా ఐసెట్టీ చెప్పుకుపోతున్నారు.

"మీరు...యీ నెల...8 న...రాసిన...జాబు...అందినది..." కన్నీళ్లను స్ఫురింపచేసే జాక్ కంఠం తొటతొటనీ కూడబలికి పైకి అంటోంది.

అటువంటి వాతావరణంలో ఒక్కొక్కసారి యీ డింభకుడు చదువుకొంటున్న గది తలుపులు నిశ్శబ్దంగా తెరుచుకొనేవి. అడుగులో అడుగు వేసుకొంటూ ఐసెట్టీ సతి లోనికివచ్చేది. మునివేళ్లమీద నడుస్తూ యీ డింభకుడి వెనకకువచ్చి నిలుచునేది. ష్ష్...!

"చదువుకొంటున్నావా, చిన్నా?" అని ఆప్యాయంగా అడిగేది ఆమె.

"అవునమ్మా."

"[illegible]?"

లేదు— ఈ డింభకుడు అబద్ధంఆడుతున్నాడు; వాడికి నిజానికి చచ్చే చలివేస్తోంది.

ఐసెట్టీ సతి గాఢవిశ్వాసం విడిచి యీ డింభకుణ్ణి ఆనుకు కూర్చుని వూలు అల్లకం మొదలుపెట్టేది. పైకి వినిపించీ వినిపించకుండా కుట్లు లెక్కపెట్టుకుంటూ, మధ్యమధ్య నిట్టూర్పులు విడుస్తూ ఆ డింభకుణ్ణి ఆనుకు కూర్చుని అలాగే కొన్ని గంటలకాలం గడిపేది.

పాపం! మా అమ్మకి అప్పటికింకా తను పుట్టి పెరిగిన వూరిమీది మమకారం పోలేదు. ఈ జన్మలో మళ్ళీ ఆ వూరిని చూడగలననే ఆశనుకూడా పూర్తిగా వదులుకొంటోంది... కాని ఆమె దురదృష్టం కొద్దీ, మా అందరి దురదృష్టం కొద్దీ, ఆవిడ అనతికాలంలోనే అక్కడికి వెళ్ళవలసి వచ్చింది.

## 5. పెద్దన్న 'ఎబ్బీ'

జులై నెలలో ఒకానొక సోమవారంనాడు...

ఆ రోజు సాయంకాలం స్కూలు వదలిపెట్టగానే ఆటలాడాలనే బుద్ధిపుట్టి, బేస్ బాల్ ఆటఆడుతూ చాలా సేపు గడిపాను. ఆట అయిపోయేసరికి నే ననుకొన్న దానికంటే చాలా ఆలస్యం అయింది. ఇంటికి యిప్పటికైనా తొందరగా పోదామనిపించి 'పెరాక్స్ స్క్వేర్' నుంచి 'లాంతరు' వీధి వరకు ఒక్క వుదుటున పరుగెత్తాను. బొడ్లో బెల్టుకు వేళ్ళాడ కట్టుకొన్న పుస్తకాల దస్తరం దభీదభీమని వచ్చి మోకాళ్ళకు కొట్టుకొంటోంది. నెత్తిమీద పెట్టుకొంటే గాలికి ఎగిరిపోతుందేమోనని టోపీని తీసి నోటితో పళ్ళసందున గట్టిగా బిగబట్టి పరుగెత్తాను. ఇంటికి పోగానే మా నాన్నగారు అవుపిస్తారేమో, ఆయనకు ఏం సమాధానం చెప్పి తప్పించుకోవాలా అని లోపల్లోపల చాలా మధనపడ్డాను. మా యింటికి చేరాక కూడా మెట్ల దగ్గిర ఒక్కక్షణం సేపు నిలబడిపోయి, వూపిరి పీల్చుకుని, నాన్నగారు యింత ఆలస్యమైందేమని అడిగితే తక్కున చెప్పేందుకు చక్కని సాకుకోసం వెతుకుతూ వుండిపోయాను. దొరికింది ఒక సాకు! ఎక్కడ లేని [illegible]

"ఇంత ఆలస్యం అయిందేంరా చిన్నా?" అని అడిగారు.

ఆయన నోటివెంట ఆ ప్రశ్నవచ్చేసరికే నాకు ఆపాదమస్తకం వొణుకు పుట్టుకొచ్చేసింది. వజవజ వణుకుతునే నేను కల్పించి పెట్టుకొన్న గాథను చెప్పబోసుకొంటున్నాను. చెప్పటం సగమైనా కాకముందే మా నాన్నగారు ఎందుకో నన్ను తన రెండు చేతులలోనూ పొదివి పట్టుకొని చాలాసేపు తన గుండెలకి నా తల ఆనించుకుని అలాగే వుండిపోయారు.

ఇంటికి ఆలస్యంగావచ్చినందుకు కనీసం ఘాటైన తిట్లైనా తగులుతాయని ఎదురు చూస్తున్న నాకు, అనుకోకుండా మా నాన్నగారు యింత ఆప్యాయంగా ఆదరణగా దగ్గరకు తీసుకోవటం చూస్తే చాలా ఆశ్చర్యం వేసింది. లోగడ మా యింటికి సెయింట్ నిజేర్ మఠం నుంచీ అప్పుడప్పుడూ ఒక ఫాదిరీ భోజనానికి వస్తూవుండటమూ, ఆయన వచ్చినరోజున మాయింట్లో పెద్ద వాళ్ళంతా చిన్నవాళ్ళని ఏమీ అనకుండా ప్రేమగా చూస్తూవుండటమూ, చిన్నవాళ్లు పెద్దవాళ్ల పట్ల భక్తి ప్రపత్తులూ, గౌరవ మర్యాదలు యిత్యాదులు పుట్టిపడేలా మసలుతూ వుండటమూ మామూలు. బహుశః యీ వేళ కూడా ఫాదరీ వస్తున్నారు కాబోలు; అందుచేతనే నాన్నగారు యింత యిదిగా వున్నారని అనుకున్నాను. కాని తీరా వంటయింటిదాకా వెళ్లి, అక్కడ నాకు మా నాన్నగారికి మాత్రమే వడ్డించి వుండటం చూసి, నేను వూహించిందంతా తప్పని తెలుసుకుని వుక్కిరిబిక్కిరి అయ్యాను.

"అమ్మేది నాన్నా? చిన్నన్న జాక్ ఏడీ? ఎవరూ కనుపించటం లేదేం?" అని కంగారుగా అడిగాను.

నే నెన్నడూ ఎరగనంత మందరస్థాయిలో మా నాన్నగారు మాట్లాడారు: అంత నింపాదిగా మాట్లాడ్డం ఆయన కెన్నడూ అలవాటు లేదు:

"మీ పెద్దన్న 'ఎబ్బీ'కి చాలా జబ్బుగావుందని వార్తవచ్చింది. మీఅమ్మా, చిన్నన్న అక్కడికెళ్లారు?" అన్నారు.

అన్నంతలో నా ముఖం వివర్ణం అవుతూ వుండటం గమనించారు కాబోలు—పెదవులమీదికి ప్రయత్న పూర్వకంగా చిరునవ్వు తెచ్చిపెట్టుకొని:

"అంటే—మీ పెద్దన్నకి మరీ అంత ప్రమాదంగా ఏం లేదు. కాకపోతే ఏదో సుస్తీచేసి మంచంలో వున్నట్లు మాత్రం జాబువచ్చింది. సరే—మీ అమ్మ సంగతి నీకు తెలుసుగా; పోయి తీరుతానంది. పోయిరమ్మని, జాక్‌ని తోడుయిచ్చి పంపించాను. ఇంతకీ అసలు 'ఎబ్బీ'కి అంత ప్రమాదంగా వుండకపోవచ్చు. ఏదో మామూలు జ్వరమైవుంటుంది...అన్నట్లూ, నాకూ ఆకలౌతున్నది; భోజనాలకి కూర్చుందామా?" అన్నారు.

పెదిమవిప్పి ఒక్కమాట అయినా మాట్లాడలేకపోయాను. అలాగే మౌనంగా కంచంముందు కూర్చున్నాను. కూర్చున్నానన్న మాటేగాని పెద్దన్నకి జబ్బుగావుందనే విషయం క్షణక్షణమూ జ్ఞాపకానికి వచ్చి, గుండె అంతకంతకూ బరువెక్కుతోంది. గుడ్లలోంచి పెల్లుబికివస్తున్న కన్నీటి ప్రవాహాలను అరికట్టుకోవటం కష్టతరమైపోతోంది. అలాగే నేనూ మా నాన్నా ఒకరికొకరం ఎదురుబొదురుగా కూర్చుని కూడా ఒకళ్ళతో ఒకళ్లం ఏమీ మాట్లాడలేని స్థితిలో అన్నం తినటం అనే అర్థంలేని పని పూర్తిచేస్తున్నాం. మా నాన్నగారు ఆరోజు అన్నంతినే పద్ధతికూడా ఏమిటో చిత్రంగా మారిపోయింది. తింటే ముద్దమీద ముద్దగా గబగబా తినడం; తాగితే గ్లాసుమీద గ్లాసుగా అదేపనిగా తాగడం; లేదా ఏమీ తినకుండా, ఏదీ తాగకుండా కంచంలో చెంచాచాకూ అలాగే పెట్టేసి ఏదో ఆలోచిస్తూ అలాగేవుండిపోవడం. నా సంగతి అంతకంటే అయోమయంగా తయారైంది. భోజనాల బల్లకి రెండో చివర కూర్చున్న వాడ్ని కూర్చున్నట్లే ఏదో మగతలోపడి అలాగే వుండిపోయాను. ఆ సమయంలో, లోగడ మా పెద్దన్నయ్య మేమంతా వుండే ఫ్యాక్టరీకి వచ్చిన సందర్భాలలో నాకు చెప్పిన చక్కచక్కని కథలన్నీ ఒక్కసారిగా జ్ఞాపకానికొచ్చాయి. మా పెద్దన్న మతప్రచారకుడుగా చేరి తర్ఫీదు పొంది మొట్టమొదటి వుపన్యాసం యిస్తున్న రోజున మా కుటుంబంలోని వారందరూ నాటి సమావేశానికి హాజరైనాము. ఆ దృశ్యం జ్ఞాపకానికి వచ్చి, నా మనస్సు మరీ కలతపడింది. మత ప్రచారకుడి దుస్తుల్లో మొట్టమొదటిసారిగా అతన్ని మేము చూసినప్పుడు అతని కా దుస్తులు ఎంత బాగున్నాయో అని



## అన్నా-చిన్నా



హించింది. చేతులు రెండూ పైకిఎత్తి అతను అలౌకిక తుంటే మా అమ్మ ఆ ఆనందపారవశ్యంలో వచ్చని పైన కంఠస్వరంతో బైబిల్‌లోని భాగాలు చదువు కన్నీళ్లు జలజల రాల్చింది—అటువంటి 'ఎబ్బీ'



# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాధ కుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



"మీ బట్టలను సన్‌లైట్‌తో ఉతికినచో మలినము ఎంత సులభముగా దొర్లిపోతుందో మీరే చూడండి. కొద్ది నిమిషములలో మీ తెల్లని బట్టలన్నియు (రుమాలునుండి దుప్పట్లు వరకు) క్రొత్తవాటికంటె తెల్లగా నగును: మరియు సన్‌లైట్‌తో ఉతుకుట వలన మీ బట్టలు చాలకాలము నిలబడును."



"దీనిని బాగా జ్ఞాపకముంచుకొనండి— సన్‌లైట్ సబ్బు రంగు బట్టలను తళతళమని మెరసేటంత ప్రకాశవంతముగా మరికేటట్లు మరేదియు నుతుకదు. సన్‌లైట్ సబ్బునుండి త్వరగావచ్చు నురగ బట్టలను బాధకుండగనే వాటిలోని మలినమును తరిమివేసి వాటి అసలు రంగును తిరిగి తెచ్చుటను మీరే చూడండి."




S. 222-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

అన్నయ్య యీరోజున అంత ప్రమాదకరమైన పరిస్థితిలో మంచంమీద పడివున్నాడా?... అతడు నిజంగానే మంచంమీద పడివున్నట్లూ, జబ్బుతో బాధపడుతున్నట్లూ—అదీ ప్రమాదకరమైన జబ్బుతోనే యమయాతన పడుతున్నట్లు వూహించుకో సాగాను. అతనికి వచ్చిన జబ్బు మామూలుదేనని మా నాన్నగారు యిందాక అన్నప్పటికీ, అది మామూలుదిమాత్రం కాదని నా కెందుకో తెలుసు. ఈ ఆవేదన చాలదన్నట్లు నా గుండెల్లో ఎక్కణ్ణుంచో ఒక యిరుకు సందులోనుంచి ఒక కీచుగొంతుక నా చెవులు గింగురు ఎత్తి పోయేట్లు అరవటం మొదలుపెట్టింది: "ఒరేయ్ చిన్నా! ఇదంతా నీమూలంగానే సుమా!! ఇప్పటికైనా తెలుసుకో !!! భగవంతుడు నిన్ను శిక్షిస్తున్నాడు లే !!! లేకపోతే,—స్కూలువదిలిపెట్టగానే సరాసరి యింటికి రాకుండా ఆటలకి వెళ్తావా, ఆటలకి ?? పైగా 'ఆలస్యం ఎందుకైందిరా' అని మీ నాన్నగారడిగితే అబద్ధాలు ఆడతావా, అబద్ధాలు ???" అని.

డింభకాధముడు చేసిన తప్పుకు భగవంతుడు, వాడి అన్నను చంపి కసితీర్చుకోబోతున్నాడనే ఆలోచన రాగానే, వీడు, యీ డింభకుడు కొయ్యలా బిగుసుకు పోయాడు. "లేదు భగవాన్; మరెన్నడూ ఆటల జోలికి పోను! ఇకమీదట ప్రతిరోజూ స్కూలు నుంచి సరాసరి యింటికే వచ్చేస్తాను భగవాన్" అని అతి దీనంగా భగవంతుణ్ణి ప్రార్థించాడు.

నాటి భోజనం ఎలాగైతేనేం ఐపోయింది. ఇంక అప్పటినుంచీ దేనికోసమో జాగరణం ప్రారంభం అయింది. ఇవతల గదిలో పెద్ద లాంతరు వెలిగించి మా నాన్నగారు తన వ్యాపారానికి సంబంధించిన పెద్ద పెద్ద ఖాతా పుస్తకాలు ముందు వడేసుకొని, పైకి వినిపించేలా ఏవో కూడికలూ, తీసివేతలూ చేసుకొంటున్నారు. బొద్దింకలను చంపటంకోసం మేము పెంచుతున్న పిల్లి 'ఫినెట్', కాలుకాలిన దానిలా టేబుల్ చుట్టూ తిరుగుతోంది. అది అరిచే అరుపుల్లో ఏవో విషాదరేఖలు వినిపిస్తున్నాయి. తలుపులు తెరిచివున్న కిటికీలోంచి తల బయటికిపెట్టి కనిపించిందల్లా చూస్తూ అక్కడే నిలబడి పోయాను.

అది చిమ్మ చీకట్లు అలుముకొన్న రాత్రి...... వీథుల్లోనూ ఎదురుగుండావున్న యిళ్ళ గుమ్మాల ముందూ మనుష్యులు గుంపులుగుంపులుగా నిలబడి ఎందుకో వెకిలిగా నవ్వుకొంటూ, అర్థంలేని ఎకసెక్కాలాడుతున్నారు. దూరంగా 'లమొస్సీ' కోటలో వాయిస్తున్న నగారా మోతలు మంద మందంగా గాలి మీద తేలివస్తున్నాయి. రాత్రిలోకి చూస్తూ, భయంకరమైన ఆలోచనలు ఏవేవో చేస్తూ నేను ఆ కిటికీ దగ్గర అలాగే చాలాసేపు నిలబడి వుండిపుంటాను. కాలగమనమే ఆగిపోయినట్లున్న ఆ తరుణంలో వాకిలి గంట ఒక్కసారిగా గణగణా మోగటం మొదలుపెట్టింది. ఆ మోతకి నేను వులిక్కిపడ్డాను. వెన్నువెంట పాకుతున్న చలితో, బరువెక్కిపోతున్న గుండెతో మా నాన్నగారి వంకచూశాను. ఆయన కూడా యించుమించు అదే స్థితిలో వున్నారు; గంటమోతకి ఆయన కూడా హడలిపోయినట్లున్నారు.

"ఎవరో గంట కొడుతున్నారు!" అన్నారు నాన్న, అదోరకమైన బొంగురు గొంతుకతో.

"మీరు వుండండి నాన్నా! నేను చూసి వస్తాను."

అంటూనే వీథివాకిలి దగ్గరకు పరుగెత్తాను.

గుమ్మంలో ఎవరో మనిషి నిలుచుని వున్నాడు. అతడు చేతిలో ఏదో పట్టుకొనివున్నట్లు గోడల మీద పడుతున్న క్రీనీడలనుబట్టి గ్రహించాను. అతని చేతిలోది ఏమిటై వుంటుందో నాకు తెలుసు—ఆక్షణంలో దేన్నైతే నా చేతులతో నేను తీసుకోవటానికి భయపడి పోతున్నానో, అదే!

"టెలిగ్రాం" అన్నాడు అవతలి మనిషి.

"టెలిగ్రామా? టెలిగ్రాం ఎందుకు?" గడగడ వణికిపోతున్న చేతులతో అతను తెచ్చిన టెలిగ్రాం అందుకొని, వెంటనే తలుపు మూసెయ్యబోయాను. మూస్తున్న తలుపుకి అవతల మనిషి కాలు అడ్డంగా పెట్టి కటువైన గొంతుకతో "దీనిమీద సంతకం పెట్టాలి" అంటూ ఏదో కాగితం చూపించాడు.

నేనా?—సంతకమా?—పెట్టాలా—? నాకా విషయం అంతకు ముందు తెలియదు. ఈ జీవితంలో నేను అందుకొన్న మొట్టమొదటి టెలిగ్రాం అదే!

"ఎవరు చిన్నా, అదీ?" లోపలనుంచీ నాన్నగారి కేక.

"ఎవరూ లేరు నాన్నా. ఎవరో బిచ్చగాడు !"



నిద్రకు నాంది

—ఫొటో: నాళం కామేశ్వరరావు, రాజమండ్రి.

అని బిగ్గరగా ఆయనకు సమాధానం చెప్పి, యీ మనిషిని అక్కడే వుండమని సంజ్ఞచేసి దబదబా నా గదికి పరుగెత్తాను. కలమూ, సిరాబుడ్డికోసం డ్రాయర్లన్నీ గాలించి తెచ్చాను.

"ఇక్కడ సంతకం పెట్టు" అన్నాడు ఆ మనిషి, వేలితో ఒకచోటు చూపిస్తూ.

మెట్ల గదిలోని గుడ్డిలాంతరు వెలుతురులో వణికిపోతున్న వేళ్ళతో సంతకం పెట్టాను; వెంటనే తలుపు గడియపెట్టి, వచ్చిన టెలిగ్రామ్‌ని విప్పనైనా విప్పకుండా సంచి పళంగా మడిచి బ్లౌజుకి అడుగున బాడ్లో దాచేశాను.

ఏ ఘోరవార్తను తెలియ చేయటం కోసం యిప్పుడీ టెలిగ్రాం వచ్చిందో కవరు విప్పకుండానే నాకు తెలుసు. అది మా నాన్నగారి కంటపడటం నాకు ఎంత మాత్రమూ యిష్టంలేదు. అందుకే దాచేశాను.

ఏమీ ఎరగనట్లు లోనికి వస్తున్న నా వంక మా నాన్నగారు తదేకంగా చూస్తూ "ఆ వచ్చింది నిజంగా బిచ్చగాడేనా?" అని అడిగారు. ముఖంలో ఏ మార్పు రానీయకుండా "అవు"నని చెప్పాను.

నాలో రేగిన కలవరాన్ని పట్టి బలవంతాన తగ్గించుకోవటంకోసం, యింతకుముందు ఏ కిటికీలోనుంచైతే బయటకు చూస్తూ నిలుచున్నానో, ఆ కిటికీదగ్గర వెళ్లి ఏమీ జరుగనట్లు చీకట్లోకి చూస్తూవుండిపోయాను.

ఆ విధంగా నిశ్చేతనంగా నిశ్శబ్దంగా అక్కడే చాలాసేపు నిలబడివుండివుంటాను. అక్కడ వున్నంతసేపూ బాడ్లోదాచిన కవరు నా గుండెల్లో మంటలు రేపుతున్నట్లు తెగబాధపడిపోయాను. ఆ బాధ భరించలేక అగ్నిహోత్రంవలె అవుపిస్తున్న ఆ కాగితాన్ని అలాగే చేత్తో అదిమి పట్టుకొన్నాను.

జరిగిందీ, జరగబోయేదీ నా అంతరాత్మకి తెలిసిపోయినప్పటికీ ఏమిటో నాలో నేనే కుతర్కం ఏదో చేసుకొని వెర్రిధైర్యం తెచ్చుకోవాలని, నానా తంటాలూ పడ్డాను.

ఏమో!— ఎవరికి తెలుసు? ఈ టెలిగ్రామ్‌లో ఎంతో సంతోషకరమైనవార్త యింకేదో వుండచ్చుగా! మరొకటీ మరొకటీ దేనికి?—పెద్దన్నయ్య జబ్బు క్షణంలో మటుమాయమైపోయిందనీ అతను హాయిగా లేచి తిరుగుతున్నాడనీ యిందులో రాసివుండచ్చునే!" అని నాకు నేనే బుద్ధిచెప్పుకో బోయాను. అయినా నాకు తెలుసు—నా యీ వెర్రి ఆశల్లో ఒక్కటీ నిజంకాబోదని. నన్ను నేనే అబద్ధాలతో బుజ్జగించుకొంటున్నాననీ తెలుసు; ఈ టెలిగ్రామ్ ఎన్నటికీ మా అన్నయ్య కోలుకొన్నాడన్న మంచి వార్తనుమాత్రం మోసుకువచ్చి వుండదు;—నాకు బాగా తెలుసు.

నాన్నగారికి అనుమానమైనా తగలనివ్వకుండా గుట్టుచప్పుడు కాకుండా నాగదిలోకివెళ్ళి, కవరువిప్పి, అందులో అసలు ఏమిరాసివుందో చూడాలనే బుద్ధి పుట్టింది. ప్రత్యేకించి ఏ ఒక్కదానికోసమూ కాకుండా, కేవలం యాదాలాభంగా వెళ్లుతున్నట్లు నటించి నా గదివైపుకి దారితీశాను. అంతవరదాకా వున్న గుండెధైర్యం ఏమైపోయిందో, నా గదిలోకి కాలుపెట్టగానే మాత్రం ఎక్కడలేని తొందరా పుట్టుకొచ్చింది. కంగారుగా దీపం వెలిగించాను. మరణవార్తను మోసుకొచ్చిన ఆ కవరుని కొంకర్లు తిరిగి పోతున్న వేళ్లతో అడ్డదిడ్డంగాచించాను. మడతలు విప్పిన కాగితంమీద మసిబూసినట్లున్న ఆ అక్షరాలు చదివి వేడి కన్నీళ్లు ఎన్ని కార్చాను! మొదటచదివింది తప్పుగా చదివివుంటాననే భ్రమలో పడి, మొత్తం ఏ యిరవైసార్లో చదివాను. ఎన్నిసార్లు చదివినా, పదాలను ఏవిధంగా తిప్పితిప్పి అన్వయించుకున్నా ఒకటే భావం. ఉత్తరం విప్పక ముందునుంచీ ఏ భావమైతే అందులో వుంటుందనుకొంటున్నానో అదే భావం. మాటలు మాత్రం యివి.

"అతను పోయాడు. అతని ఆత్మశాంతికై భగవంతుణ్ణి ప్రార్థించండి."

అంతే! అవే మాటలు! ఎన్నిసార్లు చదివినా అవే మాటలు!!

టెలిగ్రాం కాగితం మొఖానికి అడ్డంగా పెట్టుకొని ఎంతసేపు ఏడుస్తూ అక్కడే ఉండిపోయానో నాకే తెలియదు. నా గదిలోంచి యివతలికి వచ్చేటప్పటికి మాత్రం నా ముఖమూ, కళ్లూ వాచిపోయి వున్నాయన్న విషయం మాత్రం బాగా జ్ఞాపకం వుంది. ఆ దిక్కుమాలిన టెలిగ్రాం కాగితాన్ని కసికొద్దీ నలిపి



నలిపి ఉండచుట్టి గుప్పిటలో బిగపెట్టి, మా నాన్న గారు కూర్చుని రాసుకొంటున్న గదిలోకి వచ్చాను.

అక్కడిదాకా రావటమైతే వచ్చానుకాని, యీ ఘోరవార్తను ఆయన చెవుల పడవెయ్యటం ఎలాగ? ఏమీ పాలుపోలేదు. అసలు యింతసేపు యీ టెలిగ్రామ్‌ని ఆయనకి కనపడకుండా దాచాలని నేను చేసిన ప్రయత్నం ఎంత అర్థరహితమైంది? ఎప్పటికో ఒకప్పటికి ఆయన కావార్త తెలియక తప్పదుకదా! అలాంటప్పుడు దాన్ని ఆయనకు తెలియనీయకుండా వుంచాలని ప్రయత్నించటం ఎంత అవివేకం? అనవసరంగా యింత జాప్యం చెయ్యకుండా టెలిగ్రామ్ వచ్చీరాగానే సరాసరి ఆయన దగ్గరకే తీసుకువెళ్ళి ఆయన చేతికే యిచ్చి వుంటే, యిద్దరం కలిసే కవరు విప్పి చదివేవాళ్ళం. చదవగానే వచ్చే శోకాగ్ని ఏదో యీపాటికి యిద్దరికీ చల్లారి కూడా పోయేదికదా!

ఈ విధమైన ఆలోచనలతో, చప్పుడు చెయ్యకుండా నాన్నగారి బల్లదగ్గరకు వచ్చి ఆయన పక్కనే కూర్చున్నాను. ఆయనకి అప్పటికే లెక్కలతో ప్రాణం విసిగినట్లుంది; చిఠా పుస్తకాలన్నీ మూసేసి బల్లమీద ఒకమూల గుట్టగా పడేశారు; మా పెంపుడు పిల్లి 'ఫినెట్'ని తన వొళ్ళోకి తీసుకొని దాంతో ఆడుకొంటున్నారు. తను రాసుకొనే యీక కలంతో పిల్లి ముక్కుమీద కితకితలు పెట్టుతున్నారు. ఇటువంటి తరుణంలో ఆయన పిల్లితో ఆటలాడుకొంటూ వుండటం చూసేసరికి నా గుండెలు తరుక్కుపోయాయి. బల్లమీద వున్న లాంతరు వెలుగు ఆయన ముఖంమీద సగం మాత్రమే పడుతోంది; మిగిలిన సగం చీకటిలో వుంది. అయినా ఆ వెలుగులో ఆయన ముఖం అప్పుడప్పుడు నవ్వులతో నిండిపోతూవుండటం నాకు కనిపించలేదు. ఆ నవ్వు కనిపించినప్పుడల్లా 'నవ్వద్దు నాన్నా! నవ్వులకిది సమయం కాదు నాన్నా!' అని ఆవురున ఏడవాలనిపించింది.

అయినా పైకి ఏమీ అనకుండా ఆయన వంక జాలిగా చూస్తూ అలాగే మౌనంగా కూర్చున్నాను. ఉన్నట్టుండి ఆయన తలపైకి ఎత్తారు. మా యిద్దరి చూపులూ అనుకోకుండా కలిశాయి. ఆ క్షణంలో నా ముఖంలోనూ, నా కళ్లల్లోనూ ఆయనకు ఏం కనిపించిందో నాకైతే తెలియదుగాని, అకస్మాత్తుగా ఆయన ముఖం వివర్ణమై, ఒక్కసారిగా ముడతలు పడిపోయింది.

అగ్ని పర్వతం బద్దలైనట్లు ఆయన గొంతుక విడివడి, పెద్దకేక ఒకటి వినబడింది. నా గుండెల్ని చీల్చివేసే కంఠస్వరంతో ఆయన అడిగాడు:—

“మీ పెద్దన్నయ్య పోయాడుకదురా నాయనా?” అని.

టెలిగ్రామ్ కాగితం నా వేళ్ల సందుల్లోంచి జారి కింద పడిపోయింది. వెక్కి వెక్కి ఏడుస్తూ ఆయన కంఠాన్ని అమాంతం కౌగలించేసుకొన్నాను. ఆయన కూడా నన్ను తన గుండెలకు అదిమి పట్టుకొని ఆవురుమన్నారు. ఇద్దరమూ అలా ఒకరి కొకరం అంటుకుపోయి ఎంతసేపు ఏడ్చామో ఏమో!

మా యిద్దర్నీ శోక సముద్రంలో ముంచివేసిన ఆ పాపిష్టి టెలిగ్రామ్ కాగితం మా కళ్లముందు కింద పడివుంది. దాంతో మా పెంపుడు పిల్లి 'ఫినెట్' ఆడుకొంటోంది.

ఇందులో నేను ఒక్కముక్క అయినా అబద్ధం చెప్పటం లేదు. ఇదంతా జరిగి కొన్నివళ్లు గడిచాయి నేనెంతగానో ప్రేమించిన మా పెద్దన్న ఏనాడో భూస్థాపితమైనాడు. అన్నీ నిజమే — అయినా యీ రోజుకి నాకెవరైనా టెలిగ్రాం అంటూ వస్తే, వెంటనే వెన్నులో పోటుపొడిచినట్లు అవుతుంది. ఏ టెలిగ్రామ్ విప్పినా అందులో ఆనాటి పదాలు “అతడుపోయాడు; అతని ఆత్మశాంతికై భగవంతుణ్ణి ప్రార్థించండి.” అనే ముక్కలే మళ్ళీ చదవాల్సి వస్తుందని ఎక్కడలేని భయము పుట్టుకొస్తుంది

([illegible]వుంది)

# చిక్కుడుగింజ పుట్టుక

అనగా అనగా ఒకఅవ్వ వుంటుండేది. ఆఅవ్వ చాలా బీదది. ఒక రోజున ఏమయిందంటే అన్నం వండుకోడానికి బియ్యంకూడా యింట్లో లేవు. సరే ఏంచేస్తాంలే! అనుకుంది అవ్వ. వెతికితే యింట్లో చిక్కుడుగింజలు దొరికాయి. ఆగింజలని ఉడకబెట్టుకు తిందాంలే అనుకుంది. మరి గింజలని వుడకబెట్టుకోడానికి నిప్పు కావాలి కదూ? అందుకని పొయ్యిలో నిప్పు వేసింది. ఆనిప్పు ఎంతకీ మండకపోయేటప్పటికి కొంచం గడ్డిపరకలని పొయ్యిలో వేసింది.

పొయ్యిమీద పెట్టిన కుండలో చిక్కుడుగింజలు పోసింది! అలా పోస్తూ వుండగా ఒక చిక్కుడుగింజ కుండలో పడకుండా జారి క్రింద నున్న గడ్డిపరకదగ్గర పడింది. మరికొంతసేపటికి పొయిలోని బొగ్గు ఒకటి ఎగిరి సరిగా చిక్కుడుగింజ, గడ్డిపోచ పడివున్న చోటనే పడింది!

"ఏమర్రా! ఎక్కడినుంచి వచ్చారు మీరు"- అని చిక్కుడుగింజని, బొగ్గుని పలకరించింది గడ్డిపరక!

"ఏదో! అదృష్టం ఉండబట్టికాని, నిప్పులోంచి బయటపడ్డాను, కొంచం ఆలశ్యం అయివుంటే యీపాటికి మసి అయిపోయి వుందును"—అంది బొగ్గు!

"నేనా!......ఏదో నర్రా! భూమిమీద రాళ్లు ఉండబట్టికాని లేకపోతే నేనూ నావాళ్లలాగ యీపాటికి ఆకుండలో ఉడికిపోదును"-అంది గింజ!

"నేనుమాత్రం ఏమిటి? నాకూ చావుతప్పి కన్ను లొట్టపోయినంత పనయింది! పాపం మావాళ్లందరూ బూడిద అయిపోయారు. అదృష్టం వుండి అవ్వ వేళ్లసందుల్లోంచి జారాను కనుక కాని, లేకపోతేనా...?''-అంది గడ్డిపరక!

''సరే! అన్నీ బాగానే వున్నాయి! ఒకరిని గురించి ఒకరం తెలుసుకున్నాం—బాగుంది! యింక ముందుగతి ఏమిటర్రా''—అని అడిగింది బొగ్గు!

---

రచన: "ఎల్లోరా"

---

"మీరు నిర్ణయించినదానిని నేను కాదంటానా అన్నట్లు ఏం మాట్లాడకుండా కూర్చుంది గడ్డిపోచ!

''అయితే! అడిగారు కనుక చెబుతున్నా. నా సలహా ఏమిటంటారా! మనందరం అన్యోన్యంగా, కలసికట్టుగాఉండి యింకోపరాయి చోటుకుపోయి వుందాం, అలాచేస్తే మనకు మంచిదికూడాను అంది''-గింజ!

మంచి సలహా చెప్పినందుకు బొగ్గు, గడ్డిపోచ గింజమిత్రుడ్ని చాలా మెచ్చుకున్నాయి. గింజ చెప్పిన సలహాప్రకారం మిత్రత్రయం బయలుదేరారు! అలా నడుస్తూ, అక్కడక్కడ విశ్రాంతి తీసుకుంటూ ప్రయాణం సాగిస్తున్నారు—వెళ్లగా వెళ్లగా ఒకఏరు అడ్డువచ్చింది. ఏరుదాటడం ఎలాగ? ఏపక్క చూసినా ఎక్కడా వంతెన కనుపించలేదు. ఏం చేయడమా అని ఆలోచించగా ఒక చక్కని ఉపాయం తట్టింది! గడ్డిపోచకి. ''తల ఒకగట్టుమీద, కాళ్లు ఒక గట్టుమీద పెట్టి వెల్లకిలా పడుకుని మిగిలిన మిత్రులకి వంతెనలాగ ఉపయోగించడం''— ఆప్రకారంగా గడ్డిపోచ వెల్లకిలా పరుంది. అలా పడుకోవడం తరువాయిగా బొగ్గు తొందర పట్టలేక హడావిడిగా తూలుతూ గడ్డిపోచమీద నడక సాగించింది! సరిగా మధ్యకి వచ్చేటప్పటికి బొగ్గుకి కళ్లుతిరిగాయి అందుకని కళ్లుమూసుకుంది-కళ్లుమూసుకుని యెల్లా నడుస్తుంది? అందుకని లేచి నిలబడింది.

ఇక్కడ ఒక విచిత్రం జరిగింది! పొయ్యిలోంచి కదూ బొగ్గు ఎగిరి బయట పడింది! అలా బయటపడినప్పుడు బొగ్గు కాళ్లుమాత్రం నిప్పుతోనే వున్నాయి—ఆరిపోలేదు—ఆవిషయం హడావిడిలో బొగ్గు గుర్తించుకోలేదు!

కళ్లు తిరగడంమూలాన గడ్డిపోచమీద బొగ్గు నిలబడింది కదూ. అల్లా నిలబడ్డచోట నిప్పు వుండడం మూలంగా గడ్డిపోచ అంటుకు

పోయి రెండుముక్కలుగా ఏటిలో కొట్టుకుపోయింది. పంతెనలా వున్న గడ్డిపోచ అంటుకుపోయి కొట్టుకుపోవడంతో బొగ్గుకు ఆధారం లేక ఏటిలోపడి ప్రాణాలు విడిచింది!

ఇక మిగిలింది చిక్కుడుగింజే కదూ! అది యింకా గట్టుమీదే వుంది. గడ్డిపోచ, బొగ్గు ఆవిధంగా అవటంచూసి గింజ ఫక్కున నవ్వింది. మరీ వింతగా నవ్వడంతో గింజకు పొట్ట బ్రద్దలయింది. ఆసమయంలో గింజకూడా చచ్చిపోయి వుండేదే! కాని అదృష్టంకొద్దీ ఆప్రక్కనే కూర్చున్న దర్జీ దాన్ని చూశాడు. ఆ దర్జీ చాలా మంచివాడు కనుక, తత్ క్షణం తన దగ్గర వున్న సూదీ, దారంతీసి దానిపొట్ట కుట్టేశాడు. దర్జీ చేసిన సహాయానికి గింజ చాలా సంతోషించింది!

గింజ పొట్టని కుట్టేటప్పుడు దర్జీ తనవద్దవున్న నల్లని దారాన్ని వుపయోగించాడు! అందుచేత ఆరోజునుంచీ ప్రతి చిక్కుడుకీ దాని పొట్ట మీద నల్లనిచార వుంటుంది!

“చిక్కుడుగింజకు నల్లటిచార ఎలా వచ్చిందో చూశారా పాపాయిలూ! ఇదీ చిక్కుడు గింజ పుట్టుక!



# విజ్ఞానవీధులు

"దాంప్రర్"

## చిత్రప్రశ్నలకు జవాబులు

డి. బి. సుందరరావుగారు, నెల్లూరు.

—"మనస్సు అనగా ఆలోచన జరిగే చోటు" అని చెప్పుకుంటే, మనస్సుకు మెదడు స్థానమని నిశ్చయించుకోవచ్చును. మన శరీరనాడులు స్పర్శనాడులు ప్రవర్తక నాడులు అని స్థూలముగా రెండు రకాలు. స్పర్శనాడులు స్పర్శజరిగిన వార్తను తీసుకొనిపోవ, ప్రవర్తకనాడులు ఆ స్పర్శకు ప్రతీకారము చేయుటను ప్రేరేపించును.

వెన్నుపాములో మొనలుకలిగిన నాడులు పై రెండు రకాలవీ కలవు. నిద్రలో, చీమ మన వీపుపై పాకినచో స్పర్శనాడులవల్ల వెన్నుపాముకు ఆ వార్త అంది, అక్కడ ప్రవర్తక నాడులకు హెచ్చరిక కలిగి చేయి కదిలి ఆ చీమను దులిచివేయును. ఈ కార్యము మనకు జ్ఞాపకముండదు. దీనిలో మెదడుకు పని కలగలేదు.

ఆ చీమయే కుట్టిన దనుకొందము. ఇప్పుడు వట్టి దులిచివేయుట మాత్రమే కాదు జరిగేపని. వేళ్లు ఆ చీమనుపట్టి పారవేయును, లేదా నలిపివేయును. ఈ పనిలో, వార్త మెదడునకు అంది, వేళ్లను కదిపే ప్రవర్తకనాడులు పనిచేయుట కనపడును. ఇది సంప్రేరక కార్యము (*Voluntary act*) మన యత్నములో కూడినది. ఇందాకటిది అసంప్రేరక కార్యము. దానిలో మన ప్రత్యేక యత్నము ఉండదు. కోరిక ఎదురువీపుపై వాలి బాధించినప్పుడు, ఎద్దు ఆ ఈగవాలినచోట కొంచెముగా చర్మము కదిపి ఆ ఈగను ఎగరగొట్టును. ఇదీ అసంప్రేరక కార్యమే.

మెదడుకు పని కల్పించే కార్యములే మనకు జ్ఞాపకముండును. జ్ఞాపకానికి మెదడే తావు. శిశువుల మెదడును సూక్ష్మదర్శిని కింద పరీక్షిస్తే దానిలో సూక్ష్మములగు నరములు ఏకోన్ముఖముగా కనబడవు. వృద్ధుల మెదడు నిండా సూక్ష్మనరముల అల్లికలు చాలా ఉండును. పిల్లలకూ పెద్దలకూ మెదడులో లేదా జ్ఞాపకముంచుకునే సంగతులూ, ఆలోచనాలూ, కనక ఈ సూక్ష్మనరములే జ్ఞాపకముంచుకోడానికి సాయపడతాయని శాస్త్రజ్ఞుల నమ్మకము.

యస్. లలితాకుమారిగారు, అయితం పూడి.

—చిదంబరరహస్యమంటే "ఏమీ లేదు." (కొట్టబయలు) అని అర్థము. సృష్టి పృథివ్యాపస్తేజో వాయు రాకాశములనే పంచభూతములవల్ల ఏర్పడిందని పూర్వులు నమ్మినారు. జగత్తంతా పరమేశ్వరుని రూపమే అన్న సిద్ధాంతమునుబట్టి పంచభూతములూ పరమేశ్వరుని రూపములే.

కనుక రామేశ్వరములో పృథివీ లింగమూ, జంబుకేశ్వరములో జల (అప్పు=నీరు) లింగమూ, అరుణాచలములో తేజో లింగమూ (దీపమే దేవుడు) కాళహస్తిలో వాయులింగమూ (చిన్న స్తంభాకారములో నున్న దిమ్మమీది వాయువే లింగము), చిదంబరములో ఆకాశలింగమూ (అనగా ఒక మందిరములోని ఖాళీ చోటు) స్థాపించుకున్నారు పూర్వులు. చిదంబరములో ఆ మండపము నాలుగువైపులా తెరలు వేసి ఉంచుతారు. లోపలి ఆకాశలింగము రహస్యము కాదా మరి. భక్తులు వందలకొలదీ దర్శనార్థము ఆ మండపము దగ్గర చేరతారు.

చివరకు నగారాలూ, తప్పెటలూ, శంఖాలూ తాళాలూ మోగిపోతూంటే గప్పుమని తెరలు లాగేస్తారు. భక్తులంతా లెంపలు వాయించుకుని నమస్కారము చేస్తారు. ఒక్క క్షణము. తెరలు మళ్ళీ వేసేస్తారు.

నమ్మకము లేనివారు తెరవెనకటి 'చిదంబర రహస్యము ఏమిటి?' అని అడిగితే "ఏమీ లేదు వట్టిదే" అని చెప్తారు.

కె. పద్మగారు, న్యూఢిల్లీ.

—ఎర్రని దంపతులకు నల్లని బిడ్డ కలగడములో విపరీత మెంతమాత్రమూ లేదు. గోంగూర, ఉసిరిక పచ్చడి తింటే గర్భములోని పిండమునకు ఆ రంగు అంటదు.

తలిదండ్రుల జననీ జనకులు నలుపు వారైతే, మనమలు నలుపువారు కావచ్చు. ఆంగ్లోయిండియనులు నలుపుగా ఉండడము ఈ కారణము చేతనే.

మా. జమలాపురిదాస్ గారు, దుమ్ముగూడెం.

—రేడియో ధార్మికత్వము కల ధాతువుల ముడిపదార్థము గనులలో దొరకును. వీటిలో ఆ ధాతువుల అణుకణములను చిమ్మగా ఆ కణములు హీలియము పరమాణువులుగా మారి, బయటికి పోలేక బంధింపబడును. ఆ రాళ్ళనుగొట్టి, పంపులతో హీలియమును తోడవచ్చును. అయితే నష్టై చాలా కొద్ది.

యస్. యస్. పద్మావతి గారు, గుంటూరు.

—వేదకాలంలో పురుషులకు రాజకీయ స్వాతంత్ర్యముండినది. కనుక స్త్రీల అభివృద్ధిని వారు నిరోధించలేదు. మధ్యయుగాలలో పురుషులకు (రాజకీయ) స్వాతంత్ర్యము లేదు. కనక స్త్రీల సంస్కృతి వెనక్కి నెట్టినారు వారిమీద అధికారము చలాయించవలసిన పురుషులు.

నేడు పురుషులకు రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినది. స్త్రీల జుట్టుకట్లలో, చెవుల ఆభరణాల్లో, చొక్కాల వైవిధ్యములో ఇంత చైతన్యము పదిఏండ్ల క్రితము లేదు.

—పురుషులకు ప్రత్యేక శక్తుల ననుసరించి ఉద్యోగాలు లేని పూర్వపు రోజులలో ఒక కుటుంబములోని వారందరూ సుఖజీవనము చేయవలెనన్న సమిష్టిగా నుండి, ఉన్న పుట్టెడు భూమినీ సాగుచేసుకుని తినవలసిన అవసరము ఉండేది. కనక పురుషుని సొమ్ము విలువ తక్కువ. వివాహము కావాలంటే ఆడపిల్లగలవారికి నమ్మకము కలగడానికి నగలేవో పెట్టి, లేదా కన్యాశుల్కం లంచమిచ్చి వివాహము చేసుకోవలసి ఉండెను. నేడో ఉద్యోగాలు వచ్చాయి. స్కూలుఫైనలు దాటితే రెండు వేలూ, బి. ఏ.కి అయిదు వేలూను.

ఆడపిల్లలకు కోరేపద్ధతి మారిపోయింది. మగపిల్లలకు మా పిల్లనిస్తామని ఇప్పుడు చెప్పడానికి మగపిల్లవాని ఉద్యోగపు విలువ హెచ్చడమే కారణము.

త. చిరంజీవి రావుగారు, భీమవరం.

—వెలుతురు సెకనుకు 186000 మైళ్ళ చొప్పున ప్రయాణిస్తూ, సూర్యునినుంచి మన భూమికి రావడానికి ఎనిమిది నిమిషాల కన్న ఎక్కువ కాలము తీసుకుంటుంది. దూరము లెక్క కట్టుకోండి. సూర్యుడు భూమి, చంద్రుడు, ఇతర గ్రహముల కన్న పెద్ద.

నక్షత్రాలలో మాత్రము సూర్యుని మించేవి అసంఖ్యాకాలు.

భగోళంలో కటిలో నక్షత్రాల్లో చేపలూ ఉన్నట్టు నమ్మదగిన సాక్ష్యము రాలేదు.

మనకంటికి కనపడే నక్షత్రాలు సుమారు 6000. మొత్తపు సంఖ్య కట్టడానికి ఆధారమేదీ లేదు. చిన్న కనబడని "నక్షత్రము" లెన్నో కనపడవచ్చును.

ఎస్. ఆర్. సాధక్షిగారు, పరకువాకము.

## 'రాజు-పేద'

గతమాసం 25 వ తేదీన విడుదలయిన "రాజు పేద" చిత్రం ఈ నెల 4 వ తేదీన మద్రాసులోని పత్రికలవారికీ, సినిమా వ్యక్తులకీ చూపబడింది. పారగన్ థియేటరు ఆరోజున అతిథులతో కిటకిటలాడింది.

"ప్రిన్స్ ఎండ్ ది పాపర్" నవల ఆధారంగా తీయబడిన ఈ చిత్రానికి నిర్మాత, దర్శకుడు బి. ఏ. సుబ్బారావుగారు. మాటలు పినిశెట్టి; పాటలు అనిశెట్టి, శ్రీశ్రీ, ఆత్రేయ గార్లు. సంగీత దర్శకుడు రాజేశ్వరరావు; ఫోటోగ్రఫీ ఆది ఇరానీ. సుధాకర్, ఎస్. వి. రంగారావు, ఎన్. టి. రామారావు, లక్ష్మీరాజ్యం, అమ్మాజీ, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు మున్నగువారు తారాగణం.

"సినిమా అవసరాల కోసం మూలకథలో చాలా మార్పులు చేసినందువల్ల కొబోలు, కథా రచయిత మార్క్ ట్వేన్ అని

"రాజు పేద" లో విక్రంగా ఆర్. నాగేశ్వరరావు.

"వేగుచుక్క" లో పావురంతో సరసాలాడుతున్న అంజలీదేవి.

## ★ "రాజు-పేద" ★

'హైదిలర్స్'లో చూపలేదు. మంచిదే. కొంతకాలం క్రిందట ఇదే కథను ఒక హాలీవుడ్ కంపెనీవారు సినిమా తీశారు. ఇంగ్లీషులో మూలకథను, పాత్రలను కొంత మార్చి తీశారు. అదేవిధంగా తెలుగులో కూడా మార్పులు చేశారు. నవలలను సినిమాలుగా తీస్తున్నప్పుడు మార్పులు చేయడం అందరూ చేస్తున్న పనే. ఇందులో పెద్ద తప్పు పట్టవలసిన అవసరం లేదు. చేసిన మార్పులు మూలకథలో రచయిత ఉద్దేశించినదానికి దోహదకారులుగా ఉన్నాయా, భంగకారులుగా ఉన్నాయా అనేదే ఆలోచించవలసిన ప్రశ్న.

"ప్రిన్స్ ఎండ్ ది పాపర్"లో ఒక ముఖ్యమైన పాత్ర మైల్స్ హెండన్. ఇతను కూడా యువరాజు సింహాసనానికి తాత్కాలికంగా దూరమైనట్టే, తన జమీందారీ నుండి తాత్కాలికంగా వెళ్ళగొట్టబడి బాధలు పడతాడు. మైల్స్ హెండన్, యువరాజు పాత్రలు ఒకదానికొకటి అద్దాలవలె పనిచేస్తాయి. అంతేకాక మైల్స్ యువరాజును అంగరక్షకునివలె చివరవరకూ కాపాడుకుంటూ వస్తాడు. అందుచేత అతని పాత్రకు కథలో ఒక స్పష్టమైన ప్రయోజనం ఉన్నది. తెలుగు చిత్రంలో ఈ పాత్రను 'కామెడియన్' పాత్రగా మార్చారు. మార్చినా ఫరవాలేదు. కాని కథలో అతడు నిర్వర్తించే ప్రయోజనం దాదాపు మృగ్యం. ఈ మార్పు అంత సమర్థించదగినదిగా కనబడదు.

ఇతర పాత్రల విషయంలో కూడా అట్టే పాత్రౌచిత్యం పాటించబడలేదు. యువరాజు [illegible] చూస్తారును, దాసీలను గుంట్రంగా తిరగండని ఆజ్ఞాపించి తను వినోదించడం, మహారాజు తన బావమరిది విక్రమ్‌ను మాటిమాటికీ పొట్టలో పొడవడం, నేనుముందునా అందరిచేతా ప్రాగించడం వెకిలిగా ఉండి ఆ పాత్రల ఉదాత్తతను భంగపరుస్తున్నాయి. విక్రమ్ కుట్రదారు అనే అనుమానం తనకున్నట్లు మహారాజు పలుచోట్ల వ్యక్తపరుస్తాడు. ఆ అనుమానానికి కారణం ఎక్కడా స్థిరపరచబడలేదు. పోనీ అనుమానం ఉన్నప్పుడు విక్రమ్‌ను యువరాజుకు దూరంగా ఉంచడానికీ, మరే చర్య తీసుకోడానికీ ఆయన ప్రయత్నించలేదు.

ఇలాంటి లోపాలు ఉన్నప్పటికీ ఈ చిత్రం ప్రేక్షకులను ఆకర్షించడానికి కావలసిన కొన్ని హంగులు సంతరించుకోవడం చేత విజయవంతం కాగలదని ఆశించవచ్చు.

నటీనటులందరూ బాగా నటించారు. పురుష పాత్రధారులు కొంతరకం దుస్తుల్లో పాపం, ఇబ్బందిపడినట్లు కనిపించినప్పటికీ సమర్థతతో తమ పాత్రలు నిర్వహించారు. మహారాజుగా రంగారావూ, యువరాజుగా, పేదగా సుధాకర్ ముఖ్యంగా ప్రశంసనీయులు. ఎన్. టి. రామారావు, లక్ష్మీరాజ్యం, రేలంగి తృప్తికరంగా నటించారు. అమ్మాజీ కొత్త నటి అయినా చక్కగా నటించింది.

రాజేశ్వరరావుగారు ట్యూన్ చేసిన పాటలు విడిగా వింటే బాగుంటాయనడానికి సందేహం లేదు. అయినా సందర్భాలకు అతికించినట్లుండడంచేతను, సంఘటనాబహుళమైన ఇలాంటి కథలో పాటలకుస్థానం లేకపోవడంచేత చిత్రంలో అంతగా విరక్తి కట్టలేదు. రాజ దర్బారు, యువరాజు గది, కోట మొదలైన సెట్టింగులు బాగున్నాయి.

పినిశెట్టి శ్రీరామమూర్తిగారు వ్రాసిన మాటలతో వెలువడిన మొదటి చిత్రం ఇది గనుక వారి రచన మొదటి ప్రయత్నంగా తృప్తికరంగా ఉందనే చెప్పాలి. వారి భాష ముందుముందు ఇంకా మంచి పరిణతి పొందగలదని ఆశించవచ్చును.

హిందీలో ఒకప్పుడు స్టంటు చిత్రాలు విరివిగా వెలువడేవి. తెలుగులో అవి లేకపోవడం ఒక కొరతే అయితే ఆ కొరతను తీర్చినందుకు బి. ఏ. సుబ్బారావుగార్ని అభినందించవలసి ఉంది.

# "రాజు-పేద"పై ప్రేక్షకుల అభిప్రాయాలు

మొన్న "రాజు-పేద" చూశాను. నేను లోగడ 'ఆంధ్రపత్రిక' సచిత్రవారపత్రికలోను దరిమిలా పుస్తకరూపంలోను ప్రకటించిన 'మార్క్ ట్వేన్ గారి "రాజు-పేద" తెలుగు అనువాదం చదివాను. కథ "ఆంధ్రవారపత్రిక" లోదని 'పబ్లిసిటీ' కూడ చేశారు. కాని ఆ కథకు, ఈ సినిమా కథకు దాదాపు పోలికే లేదని నా మనస్సుకు తట్టింది. కనీసం 'టైటిల్స్' చూపునప్పుడైనా 'మార్క్ ట్వేన్'గారి పేరు చూపకుండుట బాగులేదు.

'రాజు-పేద' సినిమా చూసిన తర్వాత ఇది చారిత్రికమా? లేక జానపదమా? అనే సందేహం నాకు కల్గినది. దీనిలో చారిత్రికములైన విషయములకంటె జానపదములకు ఎక్కువ అనుకూలముగా కథను మార్చినారు. పాత్రపోషణములో అన్యాయము జరిగింది.

మొట్టమొదటిది నారిగాని పాత్ర. 'మార్క్ ట్వేన్' గారి 'టామ్' తెలివిగలవాడు. వచ్చిన ప్రతిచిన్న అవకాశాన్ని వారవిడచకుండా జాగ్రత్తగా మెలిగాడు. మొదట్లో తాను యువరాజును కానని వాదించినా, తర్వాత అంతరంగములో బాధపడుతూనే తాను యువరాజుగా నటించడానికి ప్రయత్నించాడు. మహారాజు చనిపోయిన అనంతరము రాచకార్యములను అతి సమర్థతతో నిర్వర్తించాడు. కాని నారిగాడో, మొదట్నుంచి చివరవరకు "నేను యువరాజును కాను. నన్ను వదిలివేయండి బాబూ! అమ్మా!" అని బ్రతిమిలాడుతాడు. సమర్థత కలవాడని ఎక్కడా ఋజువుకాదు. (పన్నుల తగ్గింపుదగ్గర మినహా).

'మార్క్ ట్వేన్' మహారాజు అతి సమర్థుడు. తను చేయదల్చుకొన్న పనిని నిర్దాక్షిణ్యముగా చేసి తీరుతాడు కాని ఈ సినిమాలోనో? ఎప్పుడూ "నేను పోషించిన కత్తులు, పాలుపోసి పెంచిన పాములు" అనుటయే కాని కార్యశూరత్వము కలవాడు కాదు.

తర్వాత అతి ముఖ్యమైన 'మైల్స్ హెండన్" పాత్ర. దీనిని దాదాపు ఖూనీ చేశారని చెప్పవచ్చు. 'మైల్స్ హెండన్' అతి గంభీరుడు. శూరుడు. ముక్కుకు సూటిగా పోయే రకం. ఎప్పుడూ సైనికముగా ఆలోచించును తప్ప భీరుత్వ మెరుగడు. తనకు దొరికిన కుఱ్ఱవాడు యువరాజని తెలియకపోయినా, వాని మాటలు చేష్టలకు ముచ్చటపడి ప్రాణస్నేహితునిగా భావించాడు. చివరకు నానావమానముల పాలైనా, ప్రాణాపద వచ్చినా యువరాజును వదలకుండా అంగరక్షకునివలె

కాపాడాడు. ఇక సుధీర్‌లో? వట్టి మాటల పోగు. జేబులో "బొమ్మ" ఉంటేనే కాని ఎదుటివానితో కలబడలేడు. తాను దుష్టశిక్షణకూ, శిష్టరక్షణకూ బ్రతుకుతున్న వీరుడనని చెప్పుకునే రకం. కాని కత్తికూడ సరిగా ఒరలో పెట్టుకోలేడు. నారిగాడు తన ప్రియురాలి తమ్ముడగుటచే ఆశ్రయమిచ్చాడుగాని, యితరులకైతే చోటు పెట్టేవాడు కాదు. అచ్చి, మల్లిలతో నారిగాణ్ణి వెతికి తీసుకువస్తానని చెపుతాడుగాని అటువంటి ప్రయత్నం చేయడు. ఎంతసేపూ 'స్టంటు' చిత్రాలలో మాదిరి వకళ్ళ తర్వాత వకళ్ళతో యుద్ధంచేస్తాడు. (తక్కినవాళ్ళు చూస్తూ ఎందుకూరుకుంటారో మరి?).

మార్క్ ట్వేన్ నవలలోని యువరాజు మేనమామ హెండర్సన్ ప్రభువు రాజభక్తుడు. స్వంత మేనమామయినా యువరాజును గౌరవముగా చూస్తాడు. రాజ్యకాంక్ష లేనివాడు. యువరాజు పిచ్చివాడైనాడని బాధపడతాడు. తన కనుమానము వచ్చినా దిగమ్రింగి ఊరకుంటాడు. పట్టాభిషేక సమయములో నిజమైన యువరాజును కనుగొనుటకు తగిన ప్రయత్నము చేస్తాడు. కాని విక్రంసింగ్ ప్రతిసారి యువరాజుకు తాను మేనమామనని గుర్తుచేయుటకు ప్రయత్నిస్తాడు. రాజ్యపరిపాలనాకాంక్ష కలవాడు. రాచనగరులోనున్నది తన మేనల్లుడు కాదని తెలిసినా తను రాజ్యమేలవచ్చునుగదాయని కపటనాటక మాడుతాడు. దయా దాక్షిణ్యములు లేక తన మేనల్లుని చంపించ ప్రయత్నిస్తాడు. పట్టాభిషేకసమయమున మేనల్లుని గుర్తించికూడ అతనిని త్రోసిరాజని చూస్తాడు. చివరకు యువరాజును హత్య చెయ్యబోయి తానే మరణిస్తాడు.

ఇక దుస్తులు. కథ భారతీయ వాతావరణములో నడచినా దుస్తులుమాత్రం (మగవారికి) పాశ్చాత్యపద్ధతిలో నడచినవి. కథలోని సేవకప్రభువులకు మారు దాసీ స్త్రీలను ప్రవేశపెట్టారు. సుబ్బారావుగారు ఏ పుస్తకములోనైనా చదివారో, లేక ఊహించారో మరి హిందూదేశపురాజులు గొర్ర బొచ్చు దుస్తులు ధరిస్తారని. ఇటీవలి తెలుగు సినిమాలలో సంభాషణ లోక క్రొత్తపంథా త్రొక్కుచున్నవి. అది చారిత్రిక, పౌరాణిక, జానపద, సాంఘిక చిత్రమేదైనా కానీయండి, దేవునిమీద, ధనికవాదముపైని వ్యంగ్యమైన మాటలు, పాటలు వినవస్తున్నాయి. ప్రపంచానికి దేముడూ, ధనికుడేనా హాని కలిగిస్తున్నది? ఇదా! అభ్యుదయకరమైనపంథా? ఇంత మాత్రం చేతనే ఆస్తికత్వము, ధనికవాదము, ప్రపంచములో రూపుమాసిపోవునా?

మహారాజుగా రంగారావు, పోలిగాడుగా రామారావు, నారిగాడు, యువరాజులుగా సుధాకర్ సమర్థతతో నటించారు. రేలంగి చౌకబారు హాస్యముతో తనపూర్వ ప్రతిష్ఠను తానే తగ్గించుకున్నాడు. క్రొత్త నటి అమ్మాజీ ఫర్వాలేదు. మిగిలినవారి నటన అంత తృప్తికరముగా లేదు. టెక్నికల్‌గా పిక్చరు ఏవరేజిగా ఉన్నది. రాజేశ్వరరావుగారి మ్యూజిక్ ఏమంత తృప్తికరముగా లేదు. చివరి మాట. ఇది "తెలుగు సినిమా ప్రపంచపు పోకడ"ని తృప్తిపడుట తప్ప వేరొకమార్గము, గత్యంతరము సినిమా చూసిన ప్రేక్షకునికి లేదు.

—వై. వి. సుబ్బారావు,
ఈడ్పుగల్లు.

* * *

ప్రఖ్యాత నవలా రచయిత మార్క్ ట్వేను "ప్రిన్స్ ఎండ్ ది పాపర్"ను అనుసరించి తీయబడిందీచిత్రం. మొన్నిమధ్యే ఆంధ్రదేశంలో విడుదలై ప్రజాదరణతో నడుస్తోంది.

పేదగూడా రాజరికాన్ని నేర్పుతో నిర్వహిస్తాడని నారిగాడి పన్నుల నిర్ణయ ఘట్టం నిరూపిస్తుంది. అలాగే రాజుగూడా ఒకమాటు పేదరికాన్ని చవిచూస్తే, వారి బాధలనర్థంచేసుకొని, సంపూర్ణ సానుభూతితో పేదలను పరిపాలిస్తాడని చివర మనం నేర్చుకొనే నీతి.

రాజు జీవితానికి, అతని ప్రజల జీవితానికి ఎంత తేడా వుంటుందో బాగా చిత్రీకరించబడింది. కోటగోడలు పాలక పాలితులను పూర్తిగా వేరుచేసి ఒకరిసంగతు లొకరికి తెలియకుండా చేయడం మూలంగానే కథ అనేది జరగటానికి అవకాశం వుంది. కోటలో నారిగాడు "నేను యువరాజును కానం"టే యువరాజుకు మతిభ్రమించిందని రాజవైద్యులు చికిత్స చేయబోతారు. పాలెంలో నరేంద్రుడు నేను యువరాజునంటే "ఈమధ్య నారిగాడికి మతిపోయింద"ని వేళాకోళం చేస్తారు.

ఈ చిత్రం విజయం పొందితే (పొందుతుందని ఆశించడంలో అతిశయం వుండదు) దానికి మూడు కారణాలు చెప్పుకోవచ్చు. మొదటిది కథలోని పటుత్వం. రెండవది రాజేశ్వరరావు సంగీతం. మూడవది సుధాకర్ నటన.

కథలోని పటుత్వం, ఔన్నత్యం అందరకూ తెలిసినదే. రాజేశ్వరరావు సంగీతం బాగుంది. ముఖ్యంగా పాటలు భావయుక్తంగాను రసవంతంగాను ఉన్నాయి. దీనికి తాపీ, ఆత్రేయ ప్రభృతుల నభినందించాలి. సంభాషణలుగూడ యుక్తియుతంగాను, కథాగమనానికి దోహదం చేసేవిగాను ఉన్నాయి. "నారిగా, నాయనా" అనే పాట ఎబ్బెట్టుగా వుండటం, అచ్చి, మల్లిల పాటలు పేద వాతావరణానికి సరిపోక పోవడం, పెద్ద లోపాలు కావు, మిగతా చిత్రాలతో పోలిస్తే.

ఇక మూడవది సుధాకర్ నటన. అతని నటన చూస్తూ మనం మిగతా విషయాలన్నీ మర్చిపోతాం. ముఖ్యంగా దుస్తులు మార్చుకొనే దృశ్యంలో పేద బాలుని జడుపు, రాజపుత్రుని ఠీవి, ప్రదర్శించడం అతను తన పాత్రల్ని ఎంత పూర్తిగా ఆకళింపు చేసుకున్నాడో విశదీకరిస్తుంది.

మిగతావాళ్ళ నటనకూడా ఫరవాలేదు. ఎన్. టి. రామారావు "దాసి" చిత్రాన్ని మరోమాటు మనకు జ్ఞాపకంచేశారు. అలాగే లక్ష్మీరాజ్యం కూడాను. కేవలం పేరు ఉపయోగించుకోవడం కోసమే ఎస్. వి. రంగారావుని తీసుకున్నారనిపిస్తుంది. ఈ చిత్రంలో మహారాజు పాత్రలో, అతను ప్రదర్శించగల నైపుణ్యానికి స్థానంలేదు. ఆ పాత్ర మరెవరికిచ్చినా పరవాలేక పోవును. అయినా వీలైనంతలో బాగానే నటించారు.

స్టంటుసీనులు కొంచెం తగ్గించివేస్తే చిత్రం పొడుగుతగ్గి ఇంకా బాగుండేదేమో. ముఖ్యంగా కథాగమనానికి స్టంటులు అడ్డు తగిలాయి. చివరిభాగంలో కథ క్లైమాక్సుకి వచ్చినప్పుడు టెంపో క్షీణించింది. కోటలో నారిగాడి పట్టాభిషేక దృశ్యమూ, బయట పోలిగాడు, సుధీర్, నరేంద్రుల గుఱ్ఱపుస్వారీ దృశ్యము, మార్చి మార్చి రెండు మూడు సారులు చూపెట్టారు. అలాగే తరవాత రాజముద్ర వదకి తెమ్మని ముందొకర్ని పంపి, వాడిచేత లేదనిపించి, ఈలోగా నారిగాడు పాతసంగతులు జ్ఞాపకంచేసిన తర్వాత మళ్ళీ పంపించడం, కేవలం చిత్రాన్ని పొడుగుచేయడానికే ననిపిస్తుంది.

అలాగే మరో నిముషమో రెండు నిముషాలో ఉందనగా విలనువిక్రమ్, నారిగానిపై కత్తి విసురుతాడు. వెంటనే విక్రమ్, పోలిగాడు మధ్య ద్వంద్వయుద్ధం, కోటదగ్గర సుధీర్, కాపలావాళ్ళమధ్య కత్తియుద్ధం దృశ్యాలూ కలగాపులగం చేసి చూపించబడ్డాయి. ఇంతికీ చివరకు నారిగాడు కత్తిదెబ్బకు తట్టుకొని బతికాడా లేదా? అనే సందేహాన్ని నివారించుకోవాలంటే ఆట ఆఖరిపాట్లు పరిశీలనగా చూచి గుర్తుపట్టాలి. జాతీయపతాక ఎగిరేదాకా శాంతంగా కూర్చోలేక ఇంటికి పోదామనే ఆతురతతో చివరి నిముషంలో సీటులోంచి

# "రాజా-పేద"పై ప్రేక్షకుల అభిప్రాయాలు

లేచిపోయే ప్రేక్షకులకు, ఈ రకంగా సమాప్తం చెయ్యడం నచ్చకపోతే అది వారి తప్పుగాదు అంత ప్రధాన దృశ్యాల్ని అంత చివరిదాకా ఉంచకూడదు

ఇక ప్రేక్షకుల్ని రంజింపజేయటానికి హాస్యం కావాలి దానికోసం సుధీర్ పాత్రను నియమించి దాన్ని రేలంగివారి కిచ్చారు దాన్ని ఆయన మామూలు ఫక్కీలోనే నిర్వహించారు కాని సుధీర్‌కీ, మల్లికీ మధ్య ప్రణయాన్ని కల్పించటం అనవసరమేమో! మిగతా సినీమాలకు తీసిపోకూడదనో, ఆమాత్రం ప్రేమ లేకపోతే బాగుండదనో ఇరికించినట్టుగా కనిపిస్తుంది అలాగే ఎప్పుడూ గుఱ్ఱపు మొహం ఎరగని పేదపాలెపు పోలిగాడిచేత హఠాత్తుగా గుఱ్ఱపుస్వారీ చేయించటం, సహజత్వమును మరుగుపరుస్తుంది. వాతావరణం మన దైనా ఫర్‌కోట్లలో పాశ్చాత్యత్వం పోలేదు.

సత్యం—కాకినాడ

*　　*　　*

"రాజా - పేద" లో అత్యంత ప్రశంసనీయంగా మహారాజా సురేంద్రదేవు పాత్రను శ్రీ ఎస్. వి రంగారావు పోషించారు అతని నటన చూస్తున్నంతసేపు ప్రేక్షకులు 'హాయ్ హాయ్' అన్నారు వీరి నటన ముందు రాబోయే అక్బరు పాత్రకు ఆశాజ్యోతిగా ఉంది మాష్టరు సుధాకర్ ద్విపాత్రాభినయం కూడ మెచ్చుకో తగ్గదిగా ఉంది. 'నటనలో కొత్తదనం కనుపించటం లేదు' అని అనుకుంటున్న ప్రేక్షకులకు శ్రీ ఎన్ టి రామారావుగారి పాత్ర చాలా ఆనందాన్ని కలిగించింది. రౌడీగా, దొంగగా, ప్రేక్షకులను రంజింపచేశారు స్త్రీలలో అమ్మాజీ, లక్ష్మిరాజ్యంగార్ల పాత్రపోషణ చక్కగా ఉంది.

కథతో సంబంధం లేని శ్రీ రేలంగి పాత్ర విమర్శనీయమైనను, సరికొత్త హాస్యంతో ప్రేక్షకులను ఆనందపరిచింది ఆర్ నాగేశ్వరరావు పాత్ర అంతగా పోషించలేదు. తదితర నటులు బాగానే నటించారు

మగవాళ్ల దుస్తులు 'అరేబియన్ నైట్సు' లోని వారిని జ్ఞప్తికి తెస్తూ, స్త్రీల వేషాలు మన సంప్రదాయాన్ననుసరించి ఉన్నాయి ఇది పెద్ద లోపం. కొన్ని సందర్భాలు పాశ్చాత్య విధానాన్ననుసరించి ఉండటం విచారకరం. మాటలు చిత్రానికి జీవం పోశాయి. పాటలు ఒకటి రెండు కంటె బాగాలేవు శ్రీ రాజేశ్వరరావుగారి వద్ద నుండి ఆశించిన సంగీతం రాకపోగా వినుకు అసహ్యం కలిగించింది

మొత్తం మీద చిత్రం సంపూర్ణత నొందకపోయినా బి ఏ. సుబ్బారావ్ ప్రొడక్షన్స



యూనియన్ పిక్చర్స వారి "శ్రీ జగన్నాథ మాహాత్మ్యం" (తెలుగు) చిత్రంలో బృందగీతం ఒకటి ఇటీవల రికార్డు చేసినప్పటి దృశ్యం.

వారి కృషి ప్రేక్షక జనాన్ని చాలావరకు సంతోషపరచినట్లే—

అడిదం పాపారావు.

* * *

మార్క్ ట్వేన్ రచనలలో ఏదో విశిష్టత ఉంటుంది. పేదల కష్టాలు పేదలకే తెలుస్తాయి కాని మహారాజుకి తెలియదని, మహారాజుకు తెలిస్తే పేదలకు కష్టాలుండవని ఈ కథ నిరూపిస్తున్నది. జుట్టు పన్ను, కిటికీల పన్ను నారిగాడు ఖండిస్తాడు. మహారాజు ఆ పన్నులను విధించడం మంచిది కాదని తనకూ అనుమానంగా ఉన్నదని అవే యువరాజు ఖండించాడని చెబుతాడు. ఆ పన్నులు విధించడం అన్యాయమేమో అని అనుమానించాడే కాని అన్యాయమని తేల్చలేకపోయాడు మహారాజు. పేద బాలుడు కాబట్టి ఆ పన్నులు విధించడం అన్యాయమని తెలిసికోగలిగి ఖండించగలిగాడు. విక్రమదేవుడు విపులంగా దుస్తుల మార్పు వృత్తాంతాన్ని చెప్పినపుడు యీ విషయం మరెవరికైనా చెప్పావా అని అడిగితే చెప్పనిస్తేకదా అంటాడు నారిగాడు. నారిగాడు తన తండ్రి దుర్మార్గుడు, దొంగ అని మహారాజుకు చెబుతాడు కాని దుస్తుల మార్పు వృత్తాంతము ఎవరికీ చెప్పడానికి ప్రయత్నించినట్లుగా చూపబడలేదు. పినిశెట్టి మాటలు చక్కగా వ్రాశారు. మహారాజు యువరాజుకు రాజనీతి బోధించిన ఘట్టంలోను, మహారాజు మరణించిన ఘట్టంలోను పినిశెట్టి కలం చిందులు త్రొక్కింది. పాటలలో కొసరాజు వ్రాసిన పాట "కళ్లు తెరచి కనర - సత్యం ఒళ్లు మరచి వినర" భావయుక్తంగా ఉంది. ఈ పాటకు రాజేశ్వరరావు సంగీతం, జిక్కి కంఠం మెరుగులు పెట్టాయి. కుచలకుమారి చక్కగా నాట్యం చేసింది. మహారాజుగా ఎస్. వి. అత్యుత్తమంగా నటించాడు. సుధాకర్ రెండుపాత్రలను చక్కగా పోషించాడు. లక్ష్మిరాజ్యం, ఎన్. టి, రేలంగి బాగానే నటించారు. ఏమైనా రాజా పేద కథను చిత్రంగా నిర్మించడం సాహసమే అని చెప్పాలి. బి. ఎ. యస్. ప్రొడక్షన్స్‌వారు యింకా మంచి చిత్రాలు తీస్తారని ఆశిద్దాం.

నూకల రామానుజరావు—

వీరవాసరం.



# మగదిక్కు

(36-వ పేజీ తరువాయి)

గాక వాళ్ల అంతస్తులు వేరు మన అంతస్తులు వేరు. వాళ్లేమన్నా అనగలరు చెల్లుతుంది. గొప్పవారి మాటకు, వంకతోటకు వంక ఉండదు. మనమే అంటే అహంకారం, అహంభావం, అంటారు.

రా: వాళ్ల కడేం పొయ్యేకాలమో !... వచ్చినవాళ్లందరి చూపులు వ్రేళ్లు మా మీదనే.

మీ: వస్తూంటే కమల చూస్తూ కూడా అదేమిటే అనైనా అనలేదు.

సుం: వాళ్లన్నారని మనం నొచ్చుకోకూడదు. అంతమంది గొప్పవాళ్లముందు మిమ్మల్ని తమ స్నేహితులని చెప్పుకోవడాని కిష్టపడిఉండరు. డాబులకు, దర్పాలకు రోజులివి. మీ రిద్దరూ మంచి సిల్కు చీరలు కట్టుకొని నెక్లెసులు... చంద్రహారాలు వేసికొని వెళ్లిఉన్నట్టయితే ఓహోహో అనేవారు.

రా: అంతా నాకింకా పెండ్లికాలేదని... అక్కయ్యను మొగుడు విడిచిపెట్టాడని దుయ్యబట్టారు... తేళ్ళు జెర్రులు పాకినట్టయి లేచి వచ్చేశాం.

మీ: యీ తాయారమ్మ అక్కడికీ సిద్ధమయి నానామాట లనటం. నువ్వు గర్వపోతువట. మన సంసారమంత వెధవ సంసారం మరెక్కడా లేదట...మన మంతా కూడా....

సుం: భగవంతుడు నన్ను తీసుకొనిపోతే ఎంత బాగుండేది!

ముగ్గురు: గద్గద కంఠాలతో) అమ్మా!...

సుం: (దుఃఖభారంతో) వెధవ జన్మ... మీవల్ల వచ్చిందే నా కిదంతా... నా జన్మ యిలా కుళ్ళికుళ్ళి చావాలిసిందే.

రాజ్యం: ఎందుకమ్మా అలాంటి మాటలు.

సుం: మాటలు కాదే... నేను పోతే మీ యిష్టమొచ్చినట్లు మీ రాడుకోవచ్చు. యీ జన్మ యిలాంటి మాటలు పడలేదు. మీరు నన్నిల్లా బ్రతకనీయరు.

రా: ఇంకెప్పుడూ వెళ్లమమ్మా!

మీ: నువొద్దన్న పని ఎప్పుడూ చేయమమ్మా! ..నీ పాదాలంటి చెబుతున్నాం.

సుం: ఎందుకో వచ్చింది- యిదంతా.

(కూతుళ్లు ముగ్గురూ దిగులుతో తల్లివంక చూస్తూ ఉండిపోతారు.)

తెర.



# కోటీశ్వరుణ్ణి పెళ్లిచేసుకోవడం ఎలాగ?

# How to marry a Millionaire

ప్రతిదీ ప్రజలకు ఆకర్షవంతంగా చెయ్యాలనేది మొదటి కమాండ్‌మెంట్‌గా పాటించే హాలీవుడ్‌వారు తమ చిత్రాలకు ఆకర్షవంతమైన పేర్లు పెట్టడంలో మహాజాగ్రత్త తీసుకుంటారు. "కోటీశ్వరుణ్ణి పెళ్లిచేసుకోవడం ఎలాగ?" అనే పేరు ధనలక్ష్మి ఉపాసకులైన అమెరికన్ల దేశంలో ఎంత మధురంగా ధ్వనించి ఉంటుందో చెప్పనక్కరలేదు. పేరులోనే కాకుండా ట్వెంటియత్ సెంచరీ ఫాక్సువారు తీసిన ఈ చిత్రంలో మరెన్నో ఆకర్షణ లున్నాయి. ఇది ఆ కంపెనీవారు విడుదలచేసిన రెండవ సినిమాస్కోప్ చిత్రం. ధగధగమెరిసే టెక్నికలర్; ఖరీదైన దుస్తుల్లో పెరపెరలాడే స్త్రీ తారలు; కళ్లు చెదరగొట్టేటంత ఎత్తు కలిగి, అమెరికన్ల శక్తిసామర్థ్యాలకు జోహారనిపించే న్యూయార్క్ అంబరచుంబిత సౌధాలు. 'సన్ వాలీ' లోని హిమావృతమైన విశాల పర్వత ప్రదేశాలు. మొదటి సినిమాస్కోప్ చిత్రమైన "ది రోబ్" లో అమెరికన్ అధికార వర్గాలకు హైడ్రోజన్ బాంబు తర్వాత అత్యంత ప్రీతిపాత్రమైన క్రైస్తవ మతప్రచారం చూశాం. ఈ చిత్రంలో 'అమెరికన్ జీవిత విధానం' ఎంత నోరూరించేదిగా ఉంటుందో చూస్తాం.

ఈ చిత్రంలో ముగ్గురు తారలున్నారు, మెరిలిన్ మన్రో, బెట్టీ గ్రేబుల్, లారెన్ బకాల్. మొదటి తారపేరును భవతారక మంత్రంగా వాడుకునే హాలీవుడ్ అభిమానులు దేశంలో అనేకులున్నారు. ముఖ్యంగా ఆమె నడిచే తీరు పలువురు యువకుల హృదయస్పందన స్తంభనకు కారణభూతమైంది. ఆమె నడకను, కాళ్లను సాధారణంగా నిర్మాతలు పూర్తిగా 'ఎక్స్‌ప్లాయిట్' చేయందే వదలరు.

కామెడీగా ఈ చిత్రం తప్పక చూచి వినోదించదగినది. త్రీ-డీ చిత్రాల్లోవలె సినిమాస్కోప్‌లో 'లోతు' తెలియక పోయినా, తలనొప్పి వగైరాలు కలిగే ప్రమాదాలు లేకపోవడమే కాక దృశ్యం మామూలు చిత్రాల్లోకంటె మనోహరంగా కనిపిస్తుంది. క్రమక్రమంగా సినిమాస్కోప్

చిత్రాలు మామూలు చిత్రాల స్థానాన్ని ఆక్రమించుకోవచ్చును.

## చైనా ప్రధానికి భారతీయ డాక్యుమెంటరీలు

భారత ప్రభుత్వపు ఫిల్మ్స్ డివిజన్ వారు తయారుచేసిన ఆరు డాక్యుమెంటరీ చిత్రాలను భారతప్రధాని నెహ్రూ ఇటీవల ఢిల్లీ వచ్చిన చైనా ప్రధాని చౌ ఎన్ లే కు బహూకరించారు. చిత్తరంజన్ రైలు ఇంజన్ల కర్మాగారం, సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ, భాక్రా నంగల్ ప్రాజెక్టు, ప్రభుత్వ శాస్త్రపరిశోధనశాలలు గూర్చి తెలిపే డాక్యుమెంటరీలను, చేనేత పరిశ్రమను, సహకారోద్యమాన్ని గూర్చి తెలిపే చిత్రాలను నెహ్రూ బహూకరించారు.

## "నవరాత్రి"

తెలుగులో పౌరాణిక చిత్రాలకు ఏనాడో స్వస్తిచెప్పబడినప్పటికీ హిందీలో ప్రతి ఏడూ పౌరాణికాలు తయారవుతూనే ఉన్నాయి. భాగ్యోదయ పిక్చర్స్ అనే కంపెనీవారు "నవరాత్రి" అనే పౌరాణిక చిత్రం ఇటీవల ప్రారంభించారు. ఇందులో నిరూపరాయ్, ప్రేమ్ అదీబ్, మనోహర్ దేశాయ్, సప్రూ, లలితా పావర్ మున్నగువారు నటిస్తున్నారు. రమన్ బి దేశాయ్ దర్శకుడు.

## చిత్రకారుని జీవితం

స్పానిష్ చిత్రకారుడైన గోయా జీవిత కథను ఒక హాలీవుడ్ కంపెనీ చిత్రం తీయనున్నది. ఇందులో గోయా పాత్రను టైరోన్ పవర్ ధరిస్తున్నాడు. ఈ చిత్రం గోయా జన్మస్థలమైన స్పెయిన్‌లోనే తీయబడుతుందట.

## ప్రేమ్‌నాథ్ కొత్త చిత్రాలు

నిర్మాత, నటుడు అయిన ప్రేమ్‌నాథ్ మరి రెండు కొత్త చిత్రాలు నిర్మించనున్నాడు. ఒకటి "పృథ్వీరాజ్ - సంయుక్త" అనే చారిత్రిక చిత్రం. ఇందులో ప్రేమ్‌నాథ్ పృథ్వీరాజుగాను, బీనారాయ్ సంయుక్తగాను నటిస్తారు. కె. ఎస్. ముల్తానీ దర్శకుడు. రెండవ చిత్రం మాస్టర్ దిలీప్" ఈ చిత్రంలో కూడా ప్రేమనాథ్, బీనారాయ్ నటిస్తారు. దర్శకుడు ప్రేమ్‌నాథ్. కళా దర్శకుడు కనూ దేశాయ్ ★



"కలికాలంరా — కలికాలం
ఇది అకలికాలంరా భాయీ"
**"పరివర్తన" లో జైలు దృశ్యం.**

పంచతంత్రం:

# లబ్ధనాశము





చిత్రరచన, నిర్వహణ: విశ్వాత్ముల నరసింహమూర్తి

"బాగుందండీ, మీ వీరోచిత - కార్యం! చేతికి చిక్కినదానిని - బెదరగొట్టి చెడగొట్టారు."

"ఏం చెయమంటావ్? ఎంతపెద్ద ఏనుగ ఐనా - నా చేతుల్లో పడి పోయేదేనా? - ఈ సారెందుకో ఇలా జరిగినది!"



"జరిగిందేదో జరిగిందీ!.. మళ్ళీ పోయీ ఆ గాడిదనే కేక వేసుకొస్తాను, ఈ సారైనా గురి కాచుకొని జాగ్రత్తగ మరి కొట్టండే!"



"భయపడి పోయిన ఆ గాడిద ఇటు - వస్తుందా నీ పిచ్చిగాని! - పోని ఇంకో గాడిదనైనా - పట్టుకు రా రాదా?"

"మీ కెందుకు మీరూరికే చూస్తూ ఉండండే; సాధించుకు వస్తా!!"



అంటూనే ఆ ధూసరకం - లంబకర్ణమూ మేసే చోటికి - బయలు దేరి వెళ్లింది.

"అదేమిటయ్యా, ఓ మామయ్యా! హడలి పోయి వచ్చేశావేం? నీపై కొచ్చిందెవరనుకున్నావ్??"

"ఏమో బాబూ! ఆ ఆకారం, చూస్తే, నాకూ భయమేసిందీ!"



"అహ్హా..హ్హా.. అది నీపై వలపును ఆపలేని గార్దభ కన్యయ్యా! నిన్ను చూసి చూడంగానే మోహంతో నీ మీదికురికినది; రా! రా!.. ఇది ఎవరైనా వింటే హాస్య!.. నవ్వి పోతారూ."



మందబుద్ధి ఆ లంబ కర్ణమూ - నక్క జిత్తులన్నియు నమ్మి - గంతులు వేస్తూ అడవి చేరెను.-



రాగానే ఆ గాడిదనూ సింహం కొట్టి చంపేసిందీ!



"స్నానానికి నే పోయొస్తానూ; జాగ్రత్తగ చూస్తుండు దీనిని"



సింహాన్ని అటు పోనిచ్చి ఆకలిగొన్న ధూసరకర్ణి గాడిద చెవులను, గుండెను గుట్టు చప్పుడుగ తినివేసింది.



(కొలను నుండి తిరిగొచ్చిన కరాళకేసరం)

"ఓరోరి నీచాధమ! - రారాజుల భోజనమిది, ఎంగిలి చేసేశావా? - దాని చెవులు, గుండె కాయ - ఏమైనాయ్ చెప్పిప్పుడు!"



"ఇంతకు ముందుంటేగా? చెవులుంటే ఈ గాడిద నా మాటలు నమ్మేదా? గుండె వుంటె ఒక సారి మోసంలో బడి మళ్ళీ వచ్చేదా ఓ స్వామీ?"



బుర్ర చిన్నదగు ఆ సింహం - నక్క చెప్పినా తర్కం నమ్మి - మిన్నకుండినది.

"అదీగాక... అతి తెలివితో నువ్వేసిన ఎత్తు వెనుకటికా కుమ్మరి లాగా తొరపడి పాడూ చేసుకొంటివి!"



# ఇప్పుడు ఆంధ్ర దేశమంతటా

భావపూరితమైన కథాగమనంతో

నేత్రానందకరమైన నాట్యాలతో

వీనులకు విందొసగే పాటలతో

